నరయ మృగములయందు సింహంబు కరణి]
గణములందెల్ల నగణంబు గరిమఁ [1]దాల్చు. 170

[*కవిజనాశ్రయము - సంజ్ఞ - ప. 51]

క. ఏగణముఁ గదియు నగణం
బాగణము సమస్త మంగళావాప్తంబై
రాగిల్లు [నినుము పరుసపు
యోగంబునఁ బసిఁడి వన్నెనూనిన మాడ్కిన్.] 171

వాదాంగ చూమమణియందు —

చ. గుణములకెల్ల [1]నాలయమగుం గృతులందున డాసియుండు దు
ర్గుణ గణదోషము ల్సెఱుచుఁ [2]గోరిన వస్తువు నూత్నమైన భూ
షణమఁ లిచ్చుఁ గావ్యముల సత్కవిశేఖరులెంచ సర్వల
క్షణములుగల్గి యొప్పు బుధసన్నుతమై నగణమ్ము శంకరా! అన్నారు. 172

కవిసర్పగారుడమున —

శా. పరమాత్మ్కుం డధినాయకుండు జయసౌభాగ్యైక సామ్రాజ్య పూ
జ్యరమా సంతతులీగి లబ్ధము నిజోపాంతస్థ దుష్టాక్షరో
త్కర దోషాఢ్య గణౌఘ ధూర్త [1]గుణ ముల్లంఘించు నాశీల మె
వ్వరికిం గాదసరాదు నా నగణ మవ్యాజస్థితిం బొల్పగున్. 173

---

170. [1]గరిమఁ గాంచు [రం. ఛం. 2 : 107]

171. *లక్షణశిరోమణి వ్రాఁతప్రతిలో నీపద్యము 'గోకర్ణచ్ఛందంబునందు' అని కలదు. రం. ఛం. దీనిని 'భీమనచ్ఛందంబున' అని పేర్కొనెను (2 : 104).

172. [1]నాకరముకోరి కృతీంద్రుల డాసి (రం. ఛం. 2 : 98), [2]గోరిన వస్తు వినూత్న రత్నభూషణములనిచ్చుఁ గావున లసత్కవిశేఖరులెంచు (రం. ఛం. 2 : 98)

173. [1]గుణముల్ ఖండించుటల్ శీలమె (రం. ఛం. 2 : 99)

వ. అన్నారు కాఁబట్టి నగణయుతమైన మగణము సర్వశుభదాయియగు నట్లేను. ‘శ్రీరామారమణ’ దేవవాచకము. ‘జయ’ శుభవాచకము. ‘శ్రీరమ్య గుణాభిరామ’ భద్రవాచకము. ఈ దేవశుభభద్రవాచకములకు — 174

[గ్రకవిసర్పగారుడము —]

గీ. దేవతావాచకముల వర్తిల్లెనేని
భద్రవాచకములఁ గూడి పరఁగెనేని
నగణ సంపర్క లబ్ధితోఁ దగియెనేని
[క్రూర సంయుక్త లిపులైనఁ గూడు మొదల.] 175

వ. అన్నారు గావున నీ దేవశుభ భద్రవాచకములు జయసౌభాగ్యారోగ్యదాయి యగు నట్లేను;

“శ్రీరామా రమణ” యనే మొదలి పద్యాది శబ్దవిభక్తి సంబుద్ధికి జయపతి అధిదైవతం. ఈ ఫలం విభవమగు నట్లేను; “శ్రీవేంకట లోకాలాఢ్య” యనిన వాక్యమునందును వేంకటశబ్దము మొదల శ్రీ తుద లకారము ఈ వేంకటశబ్దాది శ్రీ శకారరేఫ ఈకారములు త్ర్యక్షరాన్వితమైన యీ యక్షరమ్ములలో శకారరేఫలకు గ్రహం చంద్రుడు. ఈకారమునకు గ్రహం సూర్యుఁ డగును. వీరలిద్ద రన్యోన్యమిత్రులగు నట్లేను; ఈకారశకారములు రెండింటి కధిదైవతం లక్ష్మీదేవి. రేఫకధి దైవ మగ్ని “లక్ష్మీప్రదోవహ్నిః” అనే వాక్యమునను “ప్రథమాం పిబతే వహ్నిః” అనే వాక్యమున చంద్రుని మొదటి [1]కళ దీసుకునె వాడున్ను అగ్నిహోత్రుఁడే గనుక మేలగునట్లేను —

ఆ వేంకటశబ్దము తుద లకారమునకు గ్రహం చంద్రుఁడు గనుక వేంకటేశ్వరునకుభయపార్శ్వ వర్ణగ్రహ మిత్రత్వము గలిగినట్లేను; కృతిపతి వేంకటేశ్వరుఁడు గనుక యీ స్వామినామ నక్షత్రంబు మృగశిర దేవగణము. పద్యాది మగణనక్షత్రం [2]చిత్ర స్వాభావికమైన దైవరాక్షస

174. గ్ర‘అనంతనగారు’ — అని ల. శిరోమణి వ్రాఁతప్రతి కవిసర్పగారుడములోనిదిగ (ఛం. ఛం. 2 : 167)

176. [1]మొదటి కల యిచ్చేవాడున్ను ........ మంచిదగు నట్లేను (శా), [2]జ్యేష్ఠ ఇది రాక్షసగణం గనుక స్వాభావికమై (తి).

గణములగునన్లేను; మాహేంద్ర పొంతువు గలుగు నన్లేను; చిత్రా మృగశిరా నక్షత్రములకు స్త్రీదీర్ఘపొంతువు గలుగు నన్లేను; మృగశిర స్త్రీసర్పయోని, చిత్ర వ్యాఘ్రయోనియుఁ గనుక యోని పొంతువ గలుగు నన్లేను; వేంకటేశ్వరుని నామనక్షత్రరాశి మృగశిరా వృషభం, పద్యాది మగణ నక్షత్రరాశి చిత్రాకన్యారాసులకు పంచమ నవమంబు లగుటకు ఫలము సకల సౌభాగ్యారోగ్యంబులు చేయుఁ గావున రాశి పొంతువు గలుగు నన్లేను; కృతికర్త రాశి వృషభానకు గ్రహము శుక్రుఁడు, గణ నక్షత్రం కన్యారాశికి గ్రహం బుధుఁడు, వీరలిద్ద రన్యోన్య మిత్రులు గనుక గ్రహమైత్రి పొంతువలు గలుగు నన్లేను; మృగశిరా నక్షత్రమునకు నాడీరజ్జు పొంతువులు మధ్యమములైనను "రాశీశయోని సమతో యది చేన్నదోషః" అనే వాక్యప్రకారమున దోషరహితంబు గావున మంచివగు నన్లేను; మృగశిరా వృషభ చిత్రారాసులకు రాశికూట నక్షత్ర పొంతువులు గలుగు నన్లేను; దోషస్వల్ప గుణాధిక్యంబు అగుట కావచ్చును; మిగిలిన వన్ని పొంతువ లున్నవి గనుక ఒకటరలు లేకయున్నను గావచ్చు గనుక శుభకరమగునన్లేను; శకచటహాల నియ్యారు వర్ణములున్ను మొదటి మూఁటి నైదిటి పదనొకొంటికి పరిహరించి శ్రీసంయుక్త వర్ణములు గనుక స్త్రీలింగయోగములు మంచివిగా ప్రథమాక్షర శ్రీః జాతి వన్నె ఫలములు నక్షత్ర సురనర తిర్య గధోముఖోర్ధ్వముఖ పార్శ్వముఖ అమృత విష అల్పప్రాణ మహాప్రాణ స్నిగ్ధ రూక్షాంతస్థ [3]ఊష్మ లక్ష్య లక్షణములు నిర్ణయించుటకు సహజ వర్ణముగాదు గనుక శ్రీసంయుక్తాక్షరంబు గావున లక్ష్య మిందులకు — 176

*లింగమగుంట రామన్నగారు లక్షణతిలకంబున —

క. వినఁబడు దీర్ఘము విషమగు
ననునిది నిజముగను సంయుతాక్షరమైతే
మునుపటి గుణములు విడువడి
తనరఁగ వేఱొక్క గుణముఁ దాల్చుమురారీ! 177

---

176. 3యూష్మ (అ. శి. లిఖితప్రతి).

177. *రం. ఛం. నిది 'భీమన' పద్యముగ ఉద్ధరింపబడెను (2 : 140).

వ. అన్నారు గావున పసుపున్ను సున్నమున్ను భిన్నవస్తువులై యున్న యపుడు తమ స్వీయగుణమ్ములచేత స్వప్రకాశంబగు; నా పసుపున్ను సున్నమున్ను ఈ రెండున్ను ఏకముగాఁ గూడియున్న యపుడు తమ స్వరూప గుణంబు విడిచి వేఱొక గుణప్రకాశమై తేజరిల్లు చందంబగునట్లైగావున — 178

క. మొదలన్వంయుక్తాక్షర
మదికిన నారెంటికి నిగ్రహమ్ముల మైత్రుల్
కుదురుపవలె.....................
.......................... 179

వ. అనుట గాఁబట్టి శ్రీకారప్రధానము గనుక తత్ఫల నిదానములు చూడ వలయుఁగావున తత్ఫలంబు లున్నవి యవియును మంచివగునట్లేను; రాహుగ్రహం ఉత్తరాషాఢా నక్షత్రముననుండుఁ గావున కృతికర్త నక్షత్రం మృగశిర, జీవనక్షత్రం మంచిదగు నట్లేను; సూర్యాంగారక శశిరాహువు లుత్తరాషాఢా శ్రవణాశ్వినీ నక్షత్రముల నున్నారు గనుక జ్యేష్ఠా మృగశిరా నక్షత్రము దగ్ధ జ్వలిత ధూమిత శవరోగ తాడలుగా నట్లుగా ఫాల్గుణ శుద్ధ ౧౦ శుక్రవారం పూర్ణచంద్రుఁడు కర్తరాశి గ్రహ గణగ్రహములైన శుక్రబుధులు ఉచ్చస్థానగతులై శుభావస్థల నుండఁగా చంద్రతారాబలోపేతమై ఏకవింశన్మహాదోషములు పరిహరించి పంచక రహితమైన సుముహూర్తాన మత్కావ్యకన్యను చతుర్దశ భువనాధీశుండైన ఐహికాముష్మిక ఫలప్రదాతయైన శ్రీ వేంకటేశ్వరునకు సమర్పితము చేసియున్నది. ఈ సకల లక్షణ లక్షితములు [1]జ్యౌతిషవిశేషజ్ఞులు సుకవిరాజులు పరిశీలనముచేసి యనుగ్రహింపవలయు నిందులకు లక్ష్యము. 180

గ్రలక్షణ తిలకంబునందు —

సీ. వినుత పద్యాది నిల్చిన వర్ణమునకు నా
ఘుని వర్ణమున కరి దొడరకుండ

---

180. [1]జ్యోతిష (శా).

181. గ్రఇది సులక్షణసారములోనిదని (లం. ఛం. 2 : 263) లో సుదాహృతము.

మొదలి రెండక్షరమ్ములు గణద్వంద్వంబు
గ్రహవైరములు [1]చేతఁ గదియకుండ
కృతి నాయకుని పేరికిని బార్శ్వ వర్ణముల్
క్రూరగ్రహ ప్రాప్తి గూడకుండ
దగ్ధజ్వలిత ధూమిత వ్యాధి నిర్జీవ
తారక లాదులు చేరకుండ

తే. గణ జనన యామములు తత్త్వగతులు రసము
[2]లొప్పఁగా వాని పొంతువ ల్దప్పకుండఁ
[3]గలుగు శబ్ద మొక్కటి చాలు గంపెఁడేల
లక్షణ విహీనము ల్జగద్రక్ష రామ! 181

వ. అన్నారు కాబట్టి 182

సీ. గ్రాస కక్ష్యార్తి [1]బేగ్మాదిగా కవిచేతఁ
బద్యమందినను ప్రాభవము చెడును
కాదు నానావిధ కష్టహేతువులకు
మూలంబు కవిదాఁకి మొఱఁగి తిరుగు
లాక్షణికుఁడు గాక లాఘవం బెఱుఁగక
యొరులు దాఁజెడుటయు నెఱుఁగలేక
యల్లనఁ బద్యంబు లందిన నుభయత్ర
నాపదవాటిల్లు టరిది మిగులఁ

తే. దెలిపి కృతులందు వలయుఁ దాఁ దెలివి కవిత
భువిని రచియింప వలయు నగ్గువ తరంబు
కవులు దాతలు గల్గుటఁగాదె చెన్ను
మీఱుటలు దాత కవులౌట మితమె కృష్ణ! 183

---

181. [1]తోడ (రం. ఛం.), [2]లొప్పఁగాఁ బొత్తువులు తప్పకుండఁ, [3]బలుకు శబ్ద మొక్కటియేచాలు (రం. ఛం.).

183. [1]సరియగు పాఠము తెలియరాదు.

క మిడుకుచుఁ జిడుముడి పడుచుఁ
తడఁబడుచుఁ దొడఁబడి విడిచి తడఁబడు పెదవుల్
దడుపుచు నెడనెడ సంధులు
చెడ నదుకుచు మొఱఁగి తిరుగు చెనఁటి న్గవియే! 184

తే పృథివి నెవ్వరి పెండ్లిండ్లు పెన్నఁ గలిసె
నేని తేవయ్యరూకన్న [1]సామెతగను (?)[1]
గ్రాస కక్కూర్తి కృతిదరిచేసి కవులు
చావ నొల్లరు [2]బ్రతుకుపేక్షింవి కృష్ణ! (?)[2] 185

*లక్షణతిలకము —

క ధరపై గురకుర కవితల
నరసిన శుభలక్షణంబు లబ్బవు సుమ్మీ
పరిపరి గతుల మహాకవి
వరుల కవిత్వంబు నున్న వైఖరిరామా! 186

వ మఱియును, 187

[సులక్షణసారము] —

క [1]లక్షణ మెఱుగని కవి యవ
లక్షణుఁడు తదీయ కవిత లాఘవమగుఁ బ్ర
త్యక్షముగఁ గీడుఁ జూపఁ బ
రోక్షంబున స్వర్గసౌఖ్య మబ్బదు రామా! 188

[1][సులక్షణసారము] —

ఆ గ్రుడ్డియెద్దు జొన్నఁ బడ్డట్లు సన్మార్గ
మెఱుఁగలేక కవితలెట్లు చెప్ప

---

185 (?)[1], [2] యతిభంగము 1 నానుడిగను - సవరణ 2 బ్రతుకు
పేక్షఁగోని - సవరణ

186 *ఇది 'సులక్షణసారము' లోనిదని (రం. ఛం 2 257)

188 [1]ఇది 'సులక్షణసారము' లోనిదని (రం ఛం 2 259)

189. [1]ఇది సులక్షణసారము లోనిదని (రం. ఛం 2 260).

నగును జెప్పెనేని హాస్యాస్పదము గావ
లాక్షణికుఁడు గావలయును [2]గృష్ణ! 189

క *తిట్టిన దీవించిన భువి
గట్టిగఁ దత్ఫలము లొసఁగుఁగద కబ్బంబుల్
నెట్టన లక్షణ మర్థిగఁ
బట్టుగ నేర్చినను దీనపాలన రామా! 190

## శత్రువధోపాయలక్షణక్రమము

అరువడ చక్రంబు నందలి స్థానాక్ష
రములన్ని గగన బీజములు నిలిపి,
దగ్ధజ్వలిత ధూమిత వ్యాధి నిర్జీవ
శవతార లాదుల సంఘటించి,
శరసహ్ఞశ మృత స్వరముల సంధించి
వృద్ధమృత స్వర వేళ లరసి,
[1]ఋ, ౠ, ఌ, ౡ, ఙ, ఞ త న ల శ చ ఛ యు ర ఢ ఫ
ధ జ ట (బ) అమ్మ షతతి విధించి

తే మొదటి పాశ్వార్ధముఖ మధోముఖ విధాక్ష
రములు విషదీర్ఘ సంగతి క్రమము దెలిపి
కటచశహలాది మూఁటనైదిట రసాద్రి
రుద్ర సంఖ్యల నిడుతత్స్వరూప మెంచి 191

సీ మగణ భగణములు మగణ రగణములు
మగణ తగణములు జగణ సగణ

189. [2]రామ (రం ఛం 2 260).

190. *రామ సుబుద్ధి గలదనుట సులక్షణసారములోనిదిగా నొప్పును.

191. [1]సాధుపార మూహ్యము.

రగణ భగణములు మగణ జగణములు
భగణ యగణములు సగణ యగణ
సగణ రగణములు రగణ తరణములు
యగణ తగణములు [1]యగణ (జ)గణ
యగణ భగణములు పగయొక్క టొకటికిఁ
గావున మగణ భగణము లందు
వెసనొప్పు భ్రమర విలపిత వృత్తము జల
ధరమాలికనెడు వృత్తంబు క్రౌంచ
పదము మందాక్రాంత విదిత వృత్తంబులు
మగణ రగణయుగమైన చంద్ర
లేఖయు స్రగ్ధరావృత్త సువదనముల్
మగణ తగణ యుక్తమైన శాలి
[2]నీ కుసుమితలతా వృత్తము రెండిట (?)
జగణ ద్వయమ్మునఁ జనెడు పృథ్వి
తగు రభరజగణ ద్వయములఁ గల పారి
జాత వృత్తము పాంచజన్య సింహ
విక్రమ వృత్తముల్ వేనిడి యిరువది
యాఱు ఛందమ్ముల వేఱు పఱచి
మఱియుఁ దక్కినయట్టి మజ, భయ, సయ, సర
రభ, రత, యర, యత, యభ గణములు
గల వృత్తములను సీకరణిరా నన్యోన్య
శత్రుగణగ్రహ సరణి నునిచి
అది దైన్య మృత దరిద్రావస్థ లొనఁగూర్చి
సంహార వచనము ల్సంఘటించి
కారాని పొంతువ ల్చేరికగాఁ జేసి
వృద్ధ మృత స్వరవేళ లరసి

192. [1]యగణ తగణ - లిఖితప్రతి — ఇది పునరుక్తి. యగణ జగణములకు విరోధము గలదని లక్షణదీపిక (40) - దానింబట్టి జగణమని సవరింపఁ బడెను. [2]యతిభంగము.

సత్త్వ రజస్తమస్సరణులు మృతపంచ
కము లగ్ని వాయుతత్త్వములు ³రక్త
శ్యామచంద్రులును నీచస్థాన గణములు
ప్రథమ వర్ణద్వయ బంధకములు
కృతిపతి పేరిటికిని బార్శ్వ వర్ణ ద్వి
తయమునఁ గల విరోధక్రమములు
శాపించి యాగతి సన్నిహితము గాఁగ
విరచించు వేళఁదా వెదకి మొదల
సన్నియుఁ జేరఁగా నిడఁ గూడ దనఁ గొన్ని
ముఖ్య ప్రయోగము ల్మొదటఁ గూర్చి
ప్రతినచే నొసఁగిన బ్రహ్మరుద్రాంతక
మృత్యువుల్గాచిన మృతము సతము

తే. కణఁగి యాగతి యిఁకఁ గొన్ని కంద విషయ
సీసగీతుల యందైనఁ జెప్పఁ దగును
నిటుల గణ వర్ణ విషమంబు లెన్నఁ బడిన
పద్యదోషంబు లెల్లను బరిహారంబు
మిమ్ము నుతియించు కతన నిజమ్ము కృష్ణ ! 192

*భీమనగారు —

సీ. తొలుత శత్రు గృహంబు లలవడ గాలించి
తుదమృత్యుగణముతోఁ గదియఁగూర్చి
వైరి నక్షత్రంబు వైరి నామంబును
మృత్యు బీజంబున మేళవించి
ఆ గణం బఱుతఁ దా నరి గణంబును నిల్పి
విషదగ్ధ వర్ణముల్వెనుక నునిచి

192. ³రక్తశ్యామ — ఇందు 'క్త' లఘువుగా నెన్నవలెను, లేకున్న గణభంగమగును.

193. * ఈ పద్యము కవిజనాశ్రయమున లేదు.

హాకచటతపలైది టాఱిట నేడింటఁ
బదునొకొండింటను బవిల పఱచి
తిలతైల మెక్కింత తలమీఁద నిడుకొని
మూఁడు శిఖలుగాను ముళ్ల వేసి
భానుదగ్ధములు కపాలంబు మోనిది (?)
దుత్తూర కలమునఁ దూలవ్రాసి

తే. గగన మార్గంబు గనుఁగొని పగతులడఁచి
కడఁగి యేడిచి పద్యంబు గాలవేయ
నఱఁడు [1]గాచిన హరిహరు లడ్డపడిన
చిచ్చుపడు మిత్తకైవడిఁ జచ్చు నరుఁడు. 193

వ. అన్నారు. ఏతల్లక్షణ లక్షిత దీక్షాదక్షుండై దక్షిణైశాన్యాభిముఖంబున రచియింపవలయు నిది బ్రహ్మాస్త్రప్రయోగమనఁబడు నీఁక నందు — 194

కవిరాజగజాంకుశమున - (ప. 8)

క. నక్షత్రగ్రహ రసభూ
తాక్షర గుణదోష నిర్ణయం బొనరింపకా
దక్షులుగా రిది గాదని
శిక్షించిన కమ్మ లెట్టసేతురు కుకవుల్. 195

అన్నారిఁక మదీయము —

చ. గణము తుపాకి తారక చొకాటపు మందు విషాక్షరమ్ములకా
పెను కొడి త్రాడు రంజకము బీజము రాశి. గజంబు వర్ణ మా
యనలము వేళ బాదరగ్రహంబది సీసపు పట్టు గుండు దు
ర్జనుఁడు తదీయ లక్ష్య మటలాక్షణి కుండిల వేఁటకాఁడగుకా. 196

193. [1]గాంచిన (శా) - గాచిన (రా) 'కాపాడు' అను నర్థమున — ఇది నిర్బిందుకము.

193. (?) 'మోనిది' - అర్థము విచార్యము.

క. ఘటనా ఘటనాద్య[1](ఖిలం
బటు) మత్పటులక్ష్య లక్షణాబ్ధిగత ప్ర
స్ఫుటమతి(ని) జేయు భువిన
న్నిటఁ గల లక్షణము లిందు నిలుపుటఁ గృష్ణా! 197

తే. గ్రంథ విస్తరమగును లక్ష్యముల ననుచు
వ్రాయలేదిందు బహుగాను వసుధఁ గల్గు
లక్షణములున్న వన్ని పరీక్షఁ జూడుఁ
డఖిల లక్షణముల యందు నార్యులార! 198

తే. జగతి గతి నాలవాలమై సద్వివేక
జనన గుణగణ లక్షణ స్థాన మిదియుఁ
జక్కఁగాఁ జూడుఁ డీ! కవి చక్రవర్తు
లారా! వందనమిదె, కవిరాజులార! 199

మ. శరణార్థీకృతమౌని నిర్జర! జరాసంధాది భంగప్రదా
కరదీభూత సమస్త భూవర! వరగ్రైవేయ కేయూర నూ
పుర సత్కంకణ కింకిణీధర! ధరాపూర్ణ ప్రజాభార సు
స్థిరతా మోచన ధిక్కృతాదర! దరస్మేరాననాంభోరుహా! 200

పంచచామరవృత్తము.

ధరాధరా వరాపహాని ధైర్యధుర్య రుగ్జరా
హరాహరాది వర్ణనీయ హార్యవార్య సంగరా
చరాచరాద్యనంత జంతు సంతతావనాదరా
పరాపరా పరాంబు రాశి బాడబీ భవత్సరా! 201

గద్య. ఇది శ్రీమ ద్వేంకట కరుణాకటాక్ష వీక్షణ సంప్రాప్త సహజ సారస్వతాశ్రాంత విశ్రాణన సంతత సంతోషిత, అమందానంద కందళిత నిఖిల ధరాబృందారకబృంద నందవర వంశోత్తంస, సకలకవిరాజమిత్ర, పౌత్తపి వంశ పవిత్ర, గౌతమసగోత్రాశ్వలాయన సూత్ర, సుచరిత్ర,

---

197, [1]బలంబడు (శా).

పసిండి కొండ దుర్గరాజ వేంగనమంత్రి పౌత్ర, రామయామాత్య పుత్ర, మడూరి రఘునాథ ప్రధాన దౌహిత్ర, యశేష విద్వత్కవిజన కృతాదరణ పాత్ర, చతురుపాయధురీణ, కావ్యఖడ్గప్రవీణ, సకల కవిజనాంగీకృత నిశ్శంకలక్షణ చక్రవర్తి బిరుదాంక, వేంకటరమణాచార్యప్రణీతంబైన సకల లక్షణ సంయుత సుధాబ్ధి సంపూర్ణ చంద్రోదయంబగు లక్షణ శిరోమణియందు వర్ణగణవృత్త విశ్రమాధికారమ్ము లను చతుర్విధా శ్వాసముల విస్తరిల్లు నందు గణనిరూపణంబును, తదుద్భవలక్షణంబును, తజ్జన్యజనక క్రమంబును, తద్గణ నియమంబును, తత్సూర్యేంద్ర చంద్ర గణ నిర్ణయంబులును, తద్గణ సంఖ్యయు, గురులఘు వర్ణసంజ్ఞలును, తద్గణబోధక పద్ధతియు, తజ్జాతిరీతులును ఉపరిగణప్రవణయు, తన్మగణాది గణమ్ములకు ప్రణవాది సప్తస్వర ప్రకారంబును, తద్గణజనన యామ భేదమ్ములును, తత్కులగోత్రనామ యామ సుమగుణగణమణివార వర్ణ గ్రహ తద్గ్రహకాంతి రాశి రససాధనాధిదేవతా ఫల చందన తార యోని రాజ్య వస్త్ర లింగ సంగతులాదిగాఁ గలుగు వివిధ భేదమ్ముల విలసిల్లునట్టి యష్టగణాధికార ప్రకారంబును, అందు నగణగుణగణ మహిమయు, తల్లక్ష్య నిరీక్షణ లక్షణ విధంబును, తత్ప్రయోగ సరణి తెఱంగును, గణ బాంధవ సందర్భ శుభాశుభ విధానమ్మును, జ్యోతిష కవితావిశేషంబు లును, కవితా కన్యకా నాయకులకుఁ గూర్పును, దినగణ స్త్రీ దీర్ఘ మాహేంద్ర యోని రాశి రాశ్యధిపతద్గ్రహమిత్ర తచ్ఛత్రు తత్సమ తత్సమ మిత్ర శాత్రవ తత్ఛత్రు మిత్ర తదన్యోన్య సమత్వ రూపంబగు గ్రహ మైత్రియు, వశ్యరజ్జు వేధా నాడి కూటము లనఁదగు ద్వాదశవిధ పొంతు వుల పొందులును, రాశికూటాది నక్షత్ర సంగతులును, తద్భేదాది ప్రకా రంబులును, తదుదాహరణమ్ములైన మహాకవి ప్రయోగములును, తద్గుణ వర్ణగ్రహ రాశిసంధాన విధులును, అవకహడ చక్రరీతియు, రాసులేర్పఱచు కరణియు, మఱియు షడ్వర్గమార్గ పుష్కరగతులును, లగ్నఘటికా ప్రమాణంబులును, నక్షత్రాక్షర వేధా విధానమ్ములకు నంశచక్రప్రక్రియయు, తత్ఫలమ్ములును, తల్లక్ష్యంబులును, చంద్రతారాబల నిశ్చయంబు, బాల కుమార రాజ్యవృద్ధమృతస్వర పంచక సంచయంబులును, తల్లక్ష్యంబు లును, తద్దశాభిముఖ ఫలాఫలంబుల చొప్పును, తల్లక్ష్యంబులును,

తద్గ్రిహదృష్టులును, తద్దూషణ విశేణభాషణములును, పంచతత్త్వ మహాత్త్వ వృత్తులును, తత్ఫలమ్ములును, లగ్నవిశుద్ధులును, దుర్ముహూర్త ప్రవర్తనంబును, దగ్ధజ్వలిత ధూమితజీవ నిర్జీవ శవరోగ ఋక్షము లనందగు చుక్కలచక్కియు, రక్తశ్వేతపీత కృష్ణచంద్రుల చందంబును, తల్లక్ష్యంబును, సత్త్వరజస్తమోవేళా విధమ్ములును, తత్ఫలాఫలమ్ముల యొప్పును, తద్గణకాలలీలలును, పంచకఫల ప్రకృతియు, ఉచ్ఛనీచస్థానగణ సంధానప్రాధాన్యమ్ములును, తదుదాహరణమ్ములగు మహాకవి ప్రయోగమ్ములును, అందు దోషస్వల్పతాగుణాధిక్య వియతియు, దేవభద్రశుభవాచక ప్రచుర రచనానిచయమ్ములును, తత్ప్రియోగమ్ముల జాతులును, సంహార [1]వచనరచనమ్ములును, కవితాకన్యక నొసంగు శుభలగ్నమునకు నిర్దేశమ్మును, తత్కన్యకా పరిగ్రహదక్షుండైన నాయకు విధంబును, కావ్య కన్యకా కన్యకోల్లేఖా కౌశలంబును, ప్రబంధాది నాందీ పద్యాది గణ గుణాదులు మొదలుగా సకల లక్షణంబులును బ్రత్యక్షంబుగా నుండఁ జూపుటయు, లక్షణ కవిత్వ లక్ష్యంబులును, కుకవి లోభి ప్రభు వ్యాపారంబులును, కుకవి నిరసనంబు లగు మహాకవుల లక్ష్యంబులును ఘటనాఘటనా లక్ష్యలక్షణ సంఘటనా చమత్కృతి పటిమయు సకలసుకవి రాజ లాక్షణికజన వినుతియుం గల్గు గణాధికారమను నిది ద్వితీయాశ్వాసము.

---

1 వచనారచనమ్ము (వ్రాతప్రతి).

శ్రీరస్తు

శ్రీ శారదాంబాయై నమః

# లక్షణశిరోమణి

## తృతీయాశ్వాసము

### వృత్తాధికారము

క. శ్రీరామా రమణ జయ
శ్రీరమ్య గుణాభిరామ! [1]శ్రిత భక్తమునీం
ద్రారాధ్య! ప్రోవుమమ్మ, ద
యారస సుమదామ! వేంకటాచల ధామా!

క. విక్రమ నిర్వక్రగుణో
పక్రమ శక్రప్రశిష్యబలధిక్కారణ
ప్రక్రమ నక్రాపహ చ
క్రాక్రమణక్రమణ! వేంకటాచల రమణా!

తే. తరుణివాయాన్వయాబ్ధి సుధాంశుఁడనఁగ
వెలయు మద్గురుఁ [1]జాతుర్య వివిధకవిత
శబ్దతర్కాది సకలశాస్త్ర ప్రవీణుఁ
గవిజన బ్రహ్మ నరసింహకవిఁ దలంతు.

వ. అని యిట్లు మదీయ గురువందనం బాపాదించి వెండియు నేతత్కృతిప
సంవిధానంబు విధించెద నవధరింపుము. తత్క్రమం బెట్టిదనిన,

---

1. [1]శ్రీవేంకటలోకారాధ్య (తి).
3. [1]చాతుర్యశృత్తకవిత (తి).

క. వృత్తమ్ములు కవిరచనా
యత్తమ్ములు కావ్యకన్యకాలంకరణో
దాత్తమ్ములు చిగురెత్తఁగఁ
జిత్తమ్ములు వరుసఁదేటఁ జేసెదఁ గృష్ణా! 5

వ. అది యెయ్యది యంటేని — 6

సీ. సమవృత్తగతులు, స్వస్థాన, పరస్థాన
విషమ, వృత్తోపరివృత్తములును,
షట్ప్రత్యయమ్ముల సంజ్ఞలు, గురులఘు
పరిణామములు, పంచపాదభేద
ములు, కందములు, గీతములు, సీసములు, షట్ప
ద, త్రిపద, ద్విపదములు, చౌప
దమ్ములు, రగడ పద్ధతులు, నార్యాప్రకా
రంబులు, శతక తారావళిని

తే. దానము లుదాహరణ సప్తతాళ వృత్త
గద్య తర్వోజ పద యక్షగాన తురగ
శంఖ మండూక డింకిణీ చక్రవాళ
వృత్తభేదము లాదియై వెలయు మఱియు. 7

క. లలిని ప్రాకృత వాక్యమ్ముల
కళికగతుల్ కుఱుచబోఁడ కందములు భువిన్
గలవైతాళీయ [1][విధ]
మ్ములు [ను] జతుర్భద్రకాది ముఖ్యములు హరీ! 8

సీ. వెండియు న్మంజరి ద్విపద గానశీ
మంజరి, కలియుగ మంజరియును,
గణపతి గతి బిరుదావళి(?) చతురుత్త
రము జయఘోషయు రంగఘోష

8. [1]శరం (అ. శి. వ్రాఁతప్రతి).

త్యాగఘోషయును జిహ్వాచల జిహ్వాచ
లోష్ఠ్య నిరోష్ఠ్యములు త్వకంద
ముమ బాదగోపనమును భద్రకాళివృ
త్తము పద్యగుణితంబు లటహిపటహి (?)

తే. వృత్తకమ్ములు చిత్రకవిత్వవృత్త
బంధరీతులు నల్లంట్ల పద్ధతియుఁ ద్రి
పాదసంఘట్ట నోత్కళికాది వివిధ
వృత్తరీతులు తేటగావింతుఁ గృష్ణ !

క. ౹౹పదుమూఁడు కోటులును నలు
వదిరెండగు లక్ష లవలఁ బదియేడ్వేలా
తుద [మఱియు] నేడు నూఱిరు
వదియాఱును వృత్తజాతి వర్గము *భర్గా ! 10

[సమవృత్తాధికారము]

వ. అన్నా[రు.] అది యెటువలెనంటేని క్రమంబుగా నిరువదాఱు ఛందమ్ములం గల సమవృత్తమ్ములు ౧౩ కోట్లు ౪౨ లక్షల ౧౭ వే(ల) ౭౨౬ సమవృత్తమ్ములు నాలుగేసి పాదమ్ములై యొక్క అక్షరమ్ము మొదలుకొని క్రమంబుగా నొక్క గణాక్షరమ్ములు సమానమై యిరువదాఱు ఛందంబులు వేఱువేఱ [1]విరచించియుండు నవియెయ్యవి యంటేని, ఉక్త, అత్యుక్త,

9. (?)అర్థము విచార్యము. యతిభంగము.

10. *ఈ పద్యము ల. శిరోమణికారుని పద్యముకాదు. దీని యాకరము తెలియరాదు. 'భర్గ' సంబుద్ధిగల] ఛందోగ్రంథములు కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహము, నైషధము తిమ్మకవి గరళపురీచ్ఛందము. కూచిమంచికవి కృతిలో వృత్తప్రకరణము లేదు. గరళపురీచ్ఛందమున వృత్తప్రకరణము గలదు, ఈ పద్యమా ఛందములోనిది కానోపును.

11. [1]వివరించి (తి).

మధ్య, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి, అతిజగతి, శక్వరి, అతిశక్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి, కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, సంకృతి, అభికృతి, ఉత్కృతి, యను ఛందస్సు లిరువదాఱును, తదుపరి యిరువది యేడవ భూశ్ఛందస్సును, ౨౮ వ భువశ్ఛందస్సును, ౨౯ వ సువశ్ఛందస్సును, ౩౦ వ మహాశ్ఛందస్సును, ౩౧ టో జనశ్ఛందస్సును, ౩౨ వ తపశ్ఛందస్సును, ౩౩ వ సత్యచ్ఛందస్సును, ౩౪ వ భూర్భువశ్ఛందస్సును, ౩౫ వ స్వరశ్ఛందస్సును, ౩౬ వ విరాట్ఛందస్సునుంగూడి ౩౬ ఛందస్సులనని ట్లుత్త[రోత్తర]ముగ నూత్న ప్రయత్న వృత్తరత్నంబులు వర్తిల్లుటకాకరంబైన ఛందస్సముద్రంబునందునొందు వృత్తరత్న ప్రవర్తకంబులు వివిధమ్ములు వేఱువేఱ ప్రశస్తమ్ములై విస్తరితంబులై ప్రవర్తిల్లునవి యెట్లంటేని పర్యాయంబుగా తేటగావించెద నవధరింపుము 11

క. ఎక్కువ తక్కువ [1]లేకను
జక్కఁగ గణనియమ యతులు సమవృత్తములం
దొక్క సమంబుగ వచ్చును
జక్కటి యా యిరువదాఱు ఛందములుహరీ[1] 12

అందు గురులఘుసంజ్ఞ

తే వసుధ గురులఘుసంజ్ఞ గవర్ణమునకుఁ
దెలియఁ దలకట్టు నొక గురు దీర్ఘమైన
వఱలు గురువులు రెండు లవర్ణమటులె
గణము లీరీతి సంజ్ఞ లీకరణిఁ గృష్ణ[1] 13

[నూతన కల్పిత సమవృత్తములు]

వ అందు క్రమంబున మొదలి ఉక్తాఛందస్సునందు ఒక్కొక్క యక్షరంబై యొక్క పాదంబుగా వృత్తమ్ములు పుట్టె నందు, 14

12. [1]'లేకను' — ద్రుతాంతముగఁ బ్రయుక్తము.

మొదలి శ్రీయను గురువృత్తము —

[1]శ్రీ, లుం, బ్రో, వుఁ

[గ] 15

అందు రెండవదియగు హారి యను లఘువృత్తము —

ము, ర, హ, రి

[ల] 16

వ అందు రెండవ అత్యుక్తా ఛందస్సునందు రెండేసి యక్షరమ్ము లొక్కొక్క
పాదమ్ముగాఁ గలుగ వృత్తములు పుట్టెనందు, 17

మొదలి శ్రీపెంపను గురువృత్తము —

శ్రీపెం, పోపుఁ, [1]ప్రాపుఁ, గాపుఁ

[గ, గ] 18

అందు రెండవదియగు రమా యను వృత్తము —

రమా, యమా, నమో, నమో

[ల, గ] 19

వ అందు మూఁడవ మధ్యాఛందస్సునందు మూఁడేసి యక్షరమ్ము లొక్కొక్క
పాదమ్ముగా ౮ వృత్తములు పుట్టె నందు, 20

మొదలి శ్రీకారయుక్త యను గురువృత్తము —

శ్రీకాంతా, లోకైకా, శ్రీకీర్తుల్, మాకిమ్మా

[మ] 21

అందు మూఁడవదియగు భారతి యను వృత్తము —

భారతీ, సారథీ, వేళమే, కోరితిఁ

[ర] 22

---

15. [1]శ్రి, మం, బ్రో, వుఁ (తి)

18. [1]ప్రోపుఁ (తి).

వ. అందు నాలుగవ ప్రతిష్ఠాఛందస్సునందు నాలుగేసి యక్షరమ్ము లొక్కొక్క పాదమ్ముగా ౧౬ వృత్తములు పుట్టె నందు, 23

నాలుగవదియగు [1] హేయగ మను వృత్తము —

జగతిఁ హే, యగమయ్యెఁ.
సగమింపుఁ, దగఁగృష్ణా!

[న, గ.] 24

అయిదవదియగు సుకాంతి యను వృత్తము —

జకారముఁ, గకారముఁ
బ్రకాశమౌ, సుకాంతికిఁ. [జ, గ.] 25

వ. అందు అయిదవ సుప్రతిష్ఠాఛందస్సునందు అయిదేసి యక్షరమ్ము లొక్కొక్క పాదమ్ముగా ३౨ వృత్తమ్ములు పుట్టె నందు, 26

౧౨ వదియగు కలహంస మను వృత్తము —

సలగమ్ములఁ, విలసిల్లగాఁ
నిలుపఁభువిఁ, గలహంసగుఁ.

[న, వ.] 27

అందు పదహారవదియగు మలహరి యను వృత్తము —

చెలువలరఁ, నలగములఁ
నిలుపవలెఁ, మలహరికిఁ.

[న, వ.] 28

వ. అందు ఆఱవదియగు గాయత్రీ ఛందస్సునందు ఆఱేసి యక్షరము లొక్కొక్క పాదమ్ముగా ౬౪ వృత్తములు పుట్టె నందు, 29

౧౬ వదియగు హయపద మను వృత్తము —

ప్రియగతితోడఁ, నయయుతమైనఁ
హయపదమొప్పుఁ, జయజయకృష్ణా!

[న, య.] 30

---

24. [1] సోమగ మను (లి).

అందు ౨౮ వదియగు ప్రసవంబను వృత్తము —

వసుధంగృతినిం, బొసఁగంబొసఁగన్
ససలింబొసఁగున్, బ్రసవంబునకున్.

[స, స.] 31

వ. అందు ఏడవ ఉష్ణిక్ఛందస్సునందు ఏడేసి యక్షరము లొక్కొక్క
పాదమ్ముగా ౧౨౮ వృత్తమ్ములు పుట్టె నందు, 32

౩౨ వదియగు కుసుమశర వృత్తము —

రసికవరులెన్నన్, బొసఁగుఁగృతులందున్
నసగయుతమైనన్, గుసుమశరముర్విన్.

[న, స, గ] 33

అందు ౪౦ దవదియగు సుధాధామ యను వృత్తము —

క్షితిని రంజిల్లున, తత్కృతులఁ బ్రఖ్యాతమై
నతగలింబొందుసం, తతసుధాధామకున్.

[న, త, గ.] 34

వ. అందు ఎనిమిదవ అనుష్టుప్ఛందస్సునందు నెనిమిదేసి యక్షరము
లొక్కొక్క పాదమ్ముగా ౨౫౬ వృత్తములు పుట్టె నందు, 35

౫౫ వదియగు షట్పద మను వృత్తము —

భాగగముల్ రచియింపన్, బాగగు షట్పదమయ్యెన్.

[భ, భ, గ, గ.] 36

అందు ౧౨౮ వదియగు కనకలతిక యను వృత్తము —

ఘనకృతుల నెనయన్, బెనఁగొనఁగ వరుసన్,
ననలగము లిడినన్, గనకలతి కమరున్.

[న, న, వ.] 37

వ. అందు తొమ్మిదవ బృహతీఛందస్సునందు తొమ్మిదేసి యక్షరమ్ము
లొక్కొక్క పాదమ్ముగా ౫౧౨ వృత్తములు పుట్టె నందు, 38

౧౮౪ గవదియగు రాజమరాళ వృత్తము —

నభరముల్ చెలువందు ది

క్ప్రభల రాజమరాళకుఁ

[న, భ, ర ] 39

అందు ౨౨౦ దగు మంజుల వృత్తము —

సగణత్రయముం బొసఁగిం

పఁగ మంజుల వృత్తమగుఁ

[స, స, స ] 40

అందు ౨౨౧ దియదు సుధారసలహరి యను వృత్తము —

వాసవార్చిత ర, న సలుఁ

[[1]ఆసుధార] సలహరికిఁ

[ర, న, స ] 41

తే ప్రాసగణములు నింత పర్యంత మిఁకను
విశ్రమస్థాన గణప్రాస వితతి నిలుప
వలయుఁ గావున నెయ్యెడ నిలుపఁదగిన
నయ్యెడన వాని నిలిపెద నరసి కృష్ణ! 42

వ అందు పదవ పంక్తిచ్ఛందస్సునందు ౧౦ పి యక్షరమ్ములు ఒక్కొక్క-
పాదమ్ముగా ౧౦౨౪ వృత్తములు పుట్టె నందు, 43

౧౬ వదియగు ప్రియవచన మను వృత్తము —

నయమగము ల్పా - ర్ణంబైయున్నఁ

ప్రియవచనంబఁ - పే రిద్ధాత్రిఁ

[న, య, మ, గ *6+] 44

---

41 వసుధ్రస (౪ శ వ్రాఁతపతి)

44 *సంస్కృత లక్షణానుసారము ప్రాచీనులగు తెలుఁగు లాక్షణికు లెన్నవ యక్షరము యతిస్థానమందురో, దాని తరువాతిది ప్రథమాక్షర మైత్రికలదిగ నుండవలెనని యర్థము దానిని సూచించుటకై యిందు యతిసంఖ్యపై '+' గుర్తుంచఁబడెను ఉదా 6 + = 6 అక్షరముల తరువాత నఁగా 7-వ అక్షరము యతి.

అందు ౨౨ వదియగు భాసుర మను వృత్తము —

సంతత భా మ గ - సంయుక్తంబై
వింత[గ]భాసుర - వృత్తంబొప్పున్.
[భ, భ, మ, గ. 6+] 45

అందు ౪౩౯ దియగు గంధగజేంద్ర మను వృత్తము —

చేరును గంధగ - జేంద్రమునాఁగన్
సార భ భా గ గ - సంయుతమైనన్.
[భ, భ, భ, గ, గ. 6+] 46

వ. అందు ౧౧ వ త్రిష్టుప్ఛందస్సునందు ౧౧ పి యక్షరమ్ము లొక్కొక్క
పాదమ్ముగా ౨౦౪౮ వృత్తమ్ములు పుట్టె నందు, 47

౨౦౮ దవదియగు కంఠీరవ మను వృత్తము —

రయమున కంఠీ - రవ మిద్ధాత్రిన్
న య స గ గల్ చె - న్నగు శ్రీకృష్ణా!
[న, య, స, గ, గ. 6+] 48

అందు ౧౩౬౨ దియగు వనమాలి యను వృత్తము —

రహిఁజెందన్ స భ - ర ల్లగన్ దగున్
మహినెన్న న్వన - మాలి కందమై.
[స, భ, ర, లగ. 6+] 49

అందు ౮౨౩ దియగు గజరాజ మను వృత్తము —

రాజితమై గజ - రాజం బలరం
గాఁజను భా త ల - గ మ్ముల్పెనఁగన్.
[భ, భ, త, లగ. 6+] 50

వ. అందు ౧౨ వ జగతీ ఛందస్సునందు ౧౨ పి యక్షరమ్ము లొక్కొక్క
పాదమ్ముగా ౪౦౯౬ వృత్తమ్ములు పుట్టె నందు,

౭౭౦ వదియగు మృగమద మను వృత్తము —

న గణము జా యగ - ణం బొనఁగూర్పన్
మృగమద వృత్తము - మేదిని నొప్పున్
[న, జ, జ, య 7+] 52

అందు వెయిన్ని తొమ్మిదివందలదెబ్బదియేనవది యగు* కోకనద మను వృత్తము —

ప్రాభవమొప్పఁగ - భావజ జనకా
భాభసలిమ్ముగఁ - బద్మిని కలరున్
[భ, భ, భ, స 6+] 53

౧౩ వ అందు ౧౩ వ అతిజగతి యను ఛందస్సునందు ౧౩ యక్షరమ్ము లొక్కొక్క పాదమ్ముగా ౮౧౯౨ వృత్తమ్ములు పుట్టెను అందు, 54

౨ వేల ౫౨౦ దియగు మత్తమయూర మను వృత్తము —

న న భ భ గురువుం - దగ నందమునన్
దనరఁగనిది మ - త్తమయూర మగున్
[న, న, భ, భ, గ. 7+] 55

అందు ౪ వే ౪౭ వదియగు సలలిత మను వృత్తము —

జయయుతభాతిన్ - సలలితమనఁగాన్
నయననగ[1]ల్గి - న్నగఁదగును హరీ!
[న, య, న, న, గ 6+] 56

అందు ౭ వే ౯౫ వదియగు బలభిన్మణి యను వృత్తము —

---

53. *శిక్షికలో "కోకనదము" అనియు, పద్యమున "పద్మిని" అనియు కలదు.

56. [1]లిన్నఁగ - సార్ధబిందుకముగ అ. శి. వ్రాఁతప్రతి.

క్రగ్కు న భ స నా - గ యుతములిడినఁ
మక్కు వ బలభి - న్మణి యనఁ దనరుఁ.

[భ, స, న, న, గ. 6+] 57

వ. అందు ౧౪ వ శక్వరీ ఛందస్సునందు ౧౪ వి యక్షరమ్ము లొక్కొక్క
పాదమ్ముగా ౧౬ వేల ౩౮౪ వృత్తములు పుట్టె నందు, 58

౪ వే ౯౬ వదియగు సురతరునికర మను వృత్తము —

గరిమను ననన(న) - గగయుతమైనఁ
నిరతము సురతరు - నికరముకృష్ణా!

[న, న, న, న, గ, గ. 8+] 59

అందు ౮ వే ౧౯౬ వదియగు విద్రుమలత యను వృత్తము —

జగతినిడంగ న - జననగణములఁ
లగమున విద్రుమ - లతయనఁదనరుఁ.

[న, జ, న, న, లగ. 7+] 60

అందు ౮ వే ౧౮౮ దవది యగు కలరవ మను వృత్తము —

సననాలగములఁ - జనునిడఁబడమిఁ
గనకాంబరధర - కలరవమునకుఁ.

[స, న, న, న, లగ. 7+] 61

వ. అందు ౧౫ వ అతిశక్వరీ ఛందస్సునందు ౧౫ వి యక్షరమ్ము లొక్కొక్క
పాదమ్ముగా ౩౨ వేల ౭౬౮ వత్తమ్ములు పుట్టెనందు, 62

౧౦ వే ౯౨౩ ది యగు పారిజాత మను వృత్తము —

సారసాక్ష! వే[రజల్]ర - జల్ రసంయుతంబున
త్పారిజాతమొందు [1]విశ్రు - తం బదెన్మిదింటిపై.

[ర, జ, ర, జ, ర. 8+] 63

---

63. [1]"విశ్రుత" మనఁగా విశ్రమము = యతి. యతికి పర్యాయపదముగా విశ్రుతపదమును పొత్తపికవి పేర్కొనెను. (ల. శి. 4-15.) విశ్రుత శబ్దమునకు "విశ్రమము", (యతి) అను నర్థము లేదు. "విశ్రుత" మను

అందు ౧౫ వే ౭౮౮ వదియగు [బాల]కౌముది యను వృత్తము —

సదయాంతరంగ వి - న్సజభా సహితమై
ముదమొందు బాలకౌ - ముది సప్తవిరతితో
[స, జ, భ, భ, స 7+] 64

అందు ౧౬ వేల ౩౮౪ వదియగు కిసలయ మను వృత్తము —

సతతము ననసన - సగణములిడ స
త్కృతులను వసుయతి - కిసలయమునకుఁ
[న, న, న, న, స 8+] 65

వ అందు ౧౬ వ అష్టిచ్ఛందస్సునందు ౧౬ పి యక్షరము లొక్కొక్క
పాదమ్ముగా ౬౫ వే ౫౩౬ వృత్తములు పుట్టెనందు, 66

౨౧ వే ౮౪౮ వదియగు చక్రవాక మను వృత్తము —

వనజనాభకృష్ణ [1]చక్ర - వాక నామధేయమై
చనునరజ్జరజ్జ[గల్]ర - సాఖ్య విశ్రమంబునఁ
[న, ర, జ, ర, జ, గ 8+] 67

అందు ౨౧ వేయి ౮౮౩ వదియగు చంద్రరేఖ యను వృత్తము —

చంద్రరేఖ రసయతి న్ర - సద్రహోభిరామతా
సాంద్రమై రనజరజల్గ - సంయుతంబుగానిడఁ
[ర, న, జ, ర, జ, గ 9+] 68

అందు ౧౦ వే ౯౨౩ వదియగు సింహావిక్రమ వృత్తము

శ్రీరమాధవా బుధేశ - సింహ విక్రమఁ బెడంగై
[యా]రజాలజలగల్ గ - జాఖ్యవిశ్రమం [బెసంగుఁ]
[ర, జ, ర, జ, ర, గ 8+] 69

---

యతికిఁ బర్యాయముగ లాక్షణికు లెవ్వరునుఁ జేర్కొనలేదు, ఇం దీ రూపము యతిస్థాన ప్రయుక్తమగుటచే నిర్ధారకము అ శ 3-168 పద్యమందును నిది ప్రయుక్తము.

67. [1]చక్రవాళ (తి).

అందు ౩౨ వే ౨౨౪ వదియగు హారిహాయ మను వృత్తము —

ఎనసి ననసల్ భనగ - లిమ్ముగను గృతులఁ
దనరువడి పద్మజయు - తంబు హారిహాయమై.
[న, స, న, భ, న, గ. 9+] 70

వ. అందు ౧౭ వ అత్యష్టిచ్ఛందస్సునందు ౧౭ సి యక్షరము లొక్కొక్క
పాదమ్ముగా ౧ ల ౩౧ వే ౭౨ వృత్తమ్ములు పుట్టెనందు, 71

౪౩ వే ౬౬౮ వదియగు మేఘరంజి యను వృత్తము —

నభసము జ్జరలగము ల్వె - నంగ విశ్రమంబున
ద్రభసమొందుఁ బదిట మేఘ - రంజి భంజితాసురా!
[న, భ, స, జ, ర, లగ. 10+] 72

అందు ౪౪ వే ౨౬ వది యగు దేవదత్త మను వృత్తము —

దేవదత్త మనఁగఁబరఁగు - దిగ్విరామమొప్పఁ [1]గ
ల్క్యవతార, రననజరల - గమ్ము లిమ్ముగా నిడఁ.
[ర, న, న, జ, ర, లగ. 10+] 73

అందు ౬౪ వే ౫౧౭ వదియగు చమరివాల మను వృత్తము —

నననజనలగములఁబె - నంగిదశవడిగాఁ
వనజభవనుత చమరి - వాలమనఁబరఁగుఁ.
[న, న, న, జ, న, లగ. 10+] 74

అందు ౬౪ వే ౯౯౨ వదియగు గగనమణి యను వృత్తము —

గగనమణి వృత్తమనఁ - గాఁదగు నసనభనల్
లగయుతముగా విధివి - రామమిడఁ బుడమిలోఁ.
[న, స, న, భ, న, లగ. 9+] 75

---

73. [1]కల్కి + అవతార = కల్క్యవతార అనునది సాధురూపము. ఈ సాధురూపమును గ్రహించిన గణభంగ మగును.

వ. అందు ౧౮ వ ధృతిచ్ఛందస్సునందు ౧౮ ది యక్షరమ్ము లొక్కొక్క-
పాదమ్ముగా ౨ ల ౬౨ వే ౧౪౪ వృత్తములు పుట్టెనందు,

౧ ల ౨౫ వే ౯౧౨ వ పుష్పమాలిక యను వృత్తము —

♦♦పొసఁగుఁ బుష్పమాలికయనఁ - బొందు నందు నరనజల్
భసయుతమ్ముగాఁగ నిడినఁ - బద్మనాభ[1] దశయతిఁ
[న, ర, న, జ, భ, స 10+] 77

♦♦అందు ౧ లక్ష ౩౦ వే ౪౨౭ వదియగు వేణునాద మను వృత్తము —

వేణునాద మనెడుపేర - వృత్తమలరు సభలలో
జాణలెన్ననిధి విరామ - సంఖ్య రనజభనసలుఁ
[ర, న, జ, భ, న, స 9+] 78

అందు ౧ ల ౩౧ వే ౭౨ వదియగు కవివినుత మను వృత్తము —

భువికవులు దశవిరమ - మున ననననసల్
కవివినుత మనఁదనరు - ఘనకృతుల నిడఁగాఁ.
[న, న, న, న, న, స 10+] 79

వ. అందు ౧౯ వ అతిధృతిచ్ఛందస్సునందు ౧౯ ది యక్షరము లొక్కొక్క-
పాదమ్ముగా ౫ ల ౨౪ వే ౨౮౮ వృత్తమ్ములు పుట్టెనందు, 80

౨౦ ల ౯౬ వే ౯౯౧ వదియగు సింహనందన మను వృత్తము —

నందకధ[ర][1] సింహనందన - మున భసజననగల్
పొంది విరతి తొమ్మిదింటఁ - బొసఁగునని కవివరుల్.
[భ, స, జ, న, న, న, న, గ 9+] 81

అందు ౨ ల ౬౨ వే ౧౨౩ వదియగు పాంచజన్య మను వృత్తము —

అంచ తేజినెక్కి తిరుగు న - తని మితి నియతిదగుఁ
పాంచజన్య వృత్తమునకుఁ - [1]బరఁగు రజననననగల్.
[ర, జ, న, న, న, న, గ 9+] 82

---

82 [1]'పరంగు' - అనునది అ ౩ వ్రాఁతప్రతి పాఠము ఈ శబ్దము సార్ధ-
బిందుక మనుట కీ లేఖన సంప్రదాయము ప్రమాణము.

అందు ౨ ల ౬౨ వే ౧౪౪ వదియగు మణినిచయ మను వృత్తము —

మణినిచయ మనఁదగు - మహి నననననగల్
దనర దశవిరమణయు - తఘుగ నిలిపిన హరీ!

[న, న, న, న, న, న, గ 10+] 83

వ అందు ౨౦ దియగు కృతిచ్ఛందస్సునందు ౨౦ పి యక్షరమ్ము లొక్కొక్క
పాదమ్ముగా ౧౦ ల ౪౮ వే ౫౭౬ వృత్తములు పుట్టెనందు, 84

౫ ల ౩ వే ౮౦౮ దవదియగు పంచబాణ మను వృత్తము —

ద్విరదవరద! శరధిశయన! - వేదవేద్య! మునిమనో
భరిత! నననవరనలగలఁ - బంచబాణ మినయతిన్

[న, న, న, న, ర, న, లగ 12+] 85

అందు ౫ ల ౨౨ వే ౨౩౯ వదియగు మురళి యను వృత్తము —

శౌరి! దనుజహరణ! భనన - సల్ ననలగములను గం
సారి! పదియునొకటి విరతి - నందమరయ మురళికిన్

[భ, న, న, స, స, న, లగ 11+] 86

అందు ౫ ల ౨౨ వే ౧౭౬ వదియ[గు] లలిత మను వృత్తము —

అమరవినుత శేషనగవి - హార ననభసననముల్
గ్రమతలగము రుద్రవిరతి - గల్గ లలిత మనఁదగున్

[న, న, భ, స, న, న, లగ 11+] 87

అందు ౭ ల ౮౬ వే ౧౧౯ దియగు *రతివిలసిత మను వృత్తము —

రామనామ! భవవిరామ! - రనజనననగలములన్ వి
రామ మబ్జభవగణాఖ్య - రతివిలసితమ[గును]శౌరి

[ర, న, జ, న, న, న, గల 9+] 88

---

88 *రతివిలసితము లఘ్వంత వృత్తము మఱి యే తెలుఁగు ఛందోగ్రంథము
నందును లఘ్వంత వృత్తప్రసక్తి గోచరింపదు, [1]మనఁగ (తా).

వ. అందు ౨౧ టగు ప్రకృతిచ్ఛందస్సునందు ౨౧ పి యక్షరము లొక్కొక్క-
పాదమ్ముగా ౨౦ ల ౯౭ వే ౧౫౨ వృత్తములు పుట్టె నందు, 89

౩ ల ౨౩ వే ౫౨౧ గు భూధర మను వృత్తము —

శ్రీలక్ష్మీప్రాణేశా - స్థితమమననభల్ - చెలువుమీఱన్ యయమ్ముల్
ఫాలాక్షాస్త్రా షట్స - ప్తవిరమములభూ - ధరమనన్ వృత్తమయ్యెన్.
[మ, మ, న, న, భ, య, య. 6+, 7+] 90

అందు ౬ ల ౭౭ వే ౧౮౪ వదియగు రతిరాజ మను వృత్తము —

క్రమమున న్రతిరాజరాజము - ఘనకృతులనిడఁగా న్రమా
రమణ రుద్రవిరామమైన భ - రనననరయుతమై తగున్.
[న, భ, ర, న, న, న, ర. 11+] 91

అందు ౧౦ ల ౪౭ వే ౫౬౭ వదియగు మదగజ మను వృత్తము —

నలిననాభ! సుకవివరులు - నభననననసయుతమై
మలయు రుద్రవిరమణమున - మదగజమనిరి నృహరీ!
[న, భ, న, న, న, న, స. 11+] 92

వ. అందు ౨౨ వ ఆకృతిచ్ఛందస్సునందు ౨౨ పి యక్షరమ్ము లొక్కొక్క-
పాదంబుగా ౪౧ ల ౯౪ వేల ౩౦౪ వృత్తములు పుట్టె నందు, 93

౯ ల ౭౨ వే ౬౩౧ దగు సుగంధి యను వృత్తము —

నందకకరాభజస - నమ్ములుభజల్ సగగ - [ణ]మ్ములు చెలంగన్
మందరధరా విరమ - ణమ్ములు గజాష్టగణ - నందగు సుగంధిన్.
[భ, జ, స, న, భ, జ, స, గ. 8+, 8+] 94

అందు ౧౪ ల ౨౩ వే ౬౩౨ దియగు హల్లకమాలిక యను
వృత్తము —

దినకరకులజ! మౌనినుత - దేవ! విరామము రుద్రసంఖ్యయున్
ననజససజగమ్ముల ఘ - నమ్ముగ హల్లకమాలికై తగున్.
[న, న, జ, స, స, స, జ, గ. 11+] 95

అందు ౨౦ ల ౯౭ వేల ౧౫౨ వదియగు కుసుమవిశిఖ మను వృత్తము —

నలిననయన! తరణి విరమ - ణము, ననననననగల్
వెలయునిడఁగఁగవులు గుసుమ - విశిఖమనిరి తగహరీ!
[న, న, న, న, న, న, న, గ. 12+] 96

వ. అందు ౨౩ వదియగు వికృతి చ్ఛందస్సునందు ౨౩ పి యక్షరమ్ము లొక్కొక్క పాదమ్ముగా ౮౩ ల ౮౮ వే ౬౦౮ వృత్తంబులు పుట్టె నందు, 97

౪౧ ల ౨౮ వే ౬౦౫ దవదియగు ౙజలీల యను వృత్తము —

శౌరి హరికృష్ణని - ర్జర వంద్యభజభభన - జల్నలగయుతమై
¹మీఱిగిరిధాత్రృని - ర్మిత విశ్రమములగజ - లీల యనఁబరఁగుఁజూ.
[భ, జ, భ, భ, న; జ, న, లగ. 7+, 9+] 98

♦♦అందు ౪౧ [ల] ౯౩ [వే] ౭౮౪ వదియగు కుముద వృత్తము —

తరుచరార్చితచరణ సారస - తరణి! విరమము నభనభల్
వరుసనానలగములచేఁ గవి - వరులు కుముదమనఁగహరీ!
[న, భ, న, భ, న, న, న, లగ. 12+] 99

అందు ౪౧ ల ౯౪ వే ౧౩౨ వదియగు విజయశంఖ మను వృత్తము —

విజయశంఖమనంగఁదగు విన - విరతి నలవడి జగతిలో
భజనసేయఁగఁ గావ్యముల నభ - భననననలగ యుతముగాఁజూ.
[న, భ, భ, వ, న, న, న, లగ. 12+] 100

---

93. ¹ఇందు "గిరిధాత్రృయతి" యనఁగా 7+, 9+: మీ - ర్మి - లీ. మొదటి యతిస్థానమున (మీ - ర్మి.) మకారమునకు, మకారమైత్రి సరియే. రెండవ యతిస్థానమున (ర్మి - లీ) ర - ల అను యతి. ఇది సంయుక్తయతినియతికి భంగము. ఇందు 'ర - ల' ప్రాసయతి గాననగును.

వ. అందు ౨౪ వ సంకృతి చ్ఛందస్సునందు ౨౪ పి యక్షరమ్ము లొక్కొక్క-పాదమ్ముగా ౧ కో ౬౭ ల ౭౭ వే ౨౧౬ వృత్తమ్ములు పుట్టె నందు, 101

౩౫ ల ౩౬ వే ౬౩౭ వదియగు జగద్ధిత మను వృత్తము —

[1]శ్రీవేంకటగిరి నిలయా - శ్రితపోషకవిధి విధా - తృసీమల వళ్ల
న్గావింపనమరు [తసము - న్నసముల్ ననజయముల - న్జ] గద్ధిత
మొప్పన్.

[త, న, స, స, న, స, జ, య. 9+, 9+] 102

అందు ౪౧ ల ౯౩ వే ౩౮౦ వదియగు ఆనంద మను వృత్తము —

జగదాధారా నిగమోదారా - సతయ
భననయ - సహితములై నన్
దగు నానందం బొగినిద్ధాత్రిం - దళవసు
విరతులం - దనరుచుం గృష్ణా!
[స, త, య, భ, న, న, న, య. 10+, 8+] 103

అందు ౪౦ ల ౪౩ వే ౭౨౮ వదియగు కలకంఠ మను వృత్తము —

గరుడతురంగా - కలితశుభాంగా
కలకంఠంబనం - గా ఋతుమతష
ట్పరితయతుల్లా - ర్నయనయల్ సల్ -
భభసల్ చెల్వగు - బంధురతహారీ!
[న, య, న, య, స, భ, భ, స. 6+, 6+, +] 104

అందు ౨౫ వ అభికృతి చ్ఛందస్సునందు ౨౫ పి యక్షరమ్ము లొక్కొక్క-పాదమ్ముగా [1]౩ కోట్ల ౩౫ ల ౫౪ వే ౪౩౨ వృత్తములు పుట్టె నందు, 105

---

102. [1]ఈ వృత్తిగతినిబట్టి 9+, 10+ అను యతిస్థాననియతి రమ్యతరము.

105. [1]౩, ౩౫, ౫౪, ౪౩౦ (తి).

౪౧ ల ౭౫ వే ౫౦౪ వదియగు సురభి యను వృత్తము —

వనభసతనలుఁ - నయగలిడఁ
శ్రీ - నాయక! ముని ఋతు - నగయు[క్తం]బై
తనరు విరతులం - దముగభువిఁ
జం - దమ్ముల సురభనఁ - దగు వృత్తంబై.
[న, న, భ, స, త, న, న, య, గ. 7+, 6+, 7+] 106

అందు ౧ కో ౬౬ ల ౪౪ వే ౩౧౧ వదియగు విభవ మను వృత్తము —

*పన్నగ శయనా పన్న శరణ్యా! -
భసభతనసనల్ - పరఁగఁగ నగలఁ
జెన్నగు విభవం బెన్నఁ గవీంద్రుల్ -
శివనగముల రం - జిలు వడులిడఁగాఁ.
[భ, స, భ, త, వ, స, న, న, గ. 11+, 7+] 107

అందు ౧ కో ౬౮ ల ౮౬ వే ౬౦౧ యగు జలరుహ మను వృత్తము —

పారావార విహారా కనకాం - బరధర హరి మస -
భభననననగల్
సారంబై యవతారాష్టయుతుల్ - జలరుహమునకవి -
చదివిరి కృతులఁ.
[మ, స, భ, భ, న, వ, న, న, గ. 10+, 8+] 108

వ. అందు ౨౬ వ ఉత్కృతి చ్ఛందస్సునందు ౨౬ సి యక్షరమ్ము లొక్కొక్క పాదమ్ముగా ౬ కో ౭౧ ల ౮ వే ౮౬౪ వృత్తమ్ములు పుట్టె నందు, 109

---

107. *విభవ వృత్తమునకు శివనగ యతి, అనఁగా 11+, 7+ యతులు. ఇందు క్రౌంచపదమునవలె 6 మీఁద ప్రాసయతి కనఁబడుచున్నది.

౩ కో ౨౩ ల ౩౦ వే ౪౯౬ వదియగు సురభూరుహ మను వృత్తము —

♦♦వననిధిశయనా - వారిజనయనా -
వరముని షడ్గిరి - వళ్ల నమరుచుꣲ
ననతనభససల్ - [నల్గురు] యుతమై -
ననుసురభూరుహ - నామము వెలయుꣲ
[న, న, త, న, భ, స, స, న, లగ 7+, 6+, 7+] 110

♦♦అందు ౩ కో ౩౫ ల ౪౮ వే ౨౧౫ వదియగు దినమణి వృత్తము —

పంకజ లోచన - భావజ జనకా -
భాభస భననన - భరిత లగములꣲ
[1]సంకలితంబగు - *షడృతుమునిస -
త్పంజ్ఞల విరతులు - దగు దినమణికిꣲ
[భ, భ, భ, స, భ, న, న, న, లగ 6+, 6+, 7+] 111

అందు ౩ కో ౬౫ ల ౫౪ వే ౪౬౨ ది యగు కవిజనముదిత మను వృత్తము —

నవన నవన నన లగలꣲబె - నꣲగ రవిమునిగ -
ణన యతులను బెం
పునను నునుపుదనరి కృతులꣲ - బొనꣲగꣲగవిజన -
ముదిత మనꣲదగుꣲ
[న, న, న, న, న, న, న, న, లగ 12+, 7+] 112

వ ఇవి యిరువైయాఱు ఛందస్సుల నూతన కల్పిత సమవృత్తములు 113
ఇꣲక మొదలి యుక్తచ్ఛందస్సున రెండు వృత్తము లాదిగా నిరువది యాఱవ ఉత్కృతి చ్ఛందస్సు పర్యంతముగా నుద్భవిల్లిన,

---

111 [1]బహుయతి నియతి భంగము, *"షడృతు" — వ ట్రసుడికి పూర్వాక్షరము గురువను భ్రాంతిచే భగణముగ బ్రయుక్తము.

## సమవృత్తసంఖ్య

క. చతు ఋతు వసు గజఋనిశా
పతిగిరి మతసంజ్ఞవృత్త పరిమితముక్త
ద్వితయాదిగఁదగు షడ్వ్రిం
శతి సమపాదాఖ్య వృత్తసంఖ్యగుఁ గృష్ణా! 114

[26 ఛందముల సమవృత్తసంఖ్య = 67103864]

మఱియు నుక్తాదిగా నుత్కృతి చ్ఛందస్సు పర్యంతంబైన యిరువదాఱు ఛందమ్ములంగల,

## సర్వసమవృత్తసంఖ్య

క. ధర [1ఋతు]యుగగిరి నగశశి
కరవేద కృశాను చంద్రగణనఁ వృత్తా
కర షడ్వింశతి ఛందము
లరయఁగ సమవృత్తసంఖ్య నలవడుఁ గృష్ణా! 115

[సర్వసమవృత్తసంఖ్య = 134217726]

వ. ఇఁక పురాతనమైన భీమనగారు రచియించిన సమవృత్తాధికారమునందుఁ బ్రశస్తమైన వృత్తము లెవ్వియంటేని, 116

[భీమన ఛందమునందలి ప్రసిద్ధ సమవృత్తములు]

అందు ౧౧ వ త్రిష్టుప్ ఛందస్సునందు ౬౩౭ వదియగు ఇంద్రవజ్ర మను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 42]
ఇత్తాజగా సంగతి - నింద్రవజ్రా
వృత్తంబగు 1న్నన్నుత - వృత్తరేఖా!

[త, త, జ, గ, గ. 7+] 117

115. 1 ×జ (అ. శి. వ్రాఁతప్రతి.)

అందు ౩౫౮ది యగు ఉపేంద్రవజ్ర మను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 43]
స పద్మ పద్మా! జత - జల్గగంబుꣳ
ఉపేంద్ర వజ్రాఖ్యము - నొప్పుఁజెప్పꣳ.
[జ, త, జ, గగ. 7+] 118

అందు ౩౫౮ ది యగు ఉపజాతి యను వృత్తము —

[కవిజనాశ్రయము - ప్రక్షిప్త పద్యము. 4]
ఈరెండు వృత్తమ్ములు - నిందుఁ గూర్పꣳ
సరోజ నేత్రా! యుప - జాతి యయ్యెꣳ.
[బేసి పాదములలో, త, త, జ, గగ. (ఇంద్రవజ్ర) 7+
సరిపాదములలో, జ, త, జ, గగ. (ఉపేంద్రవజ్ర) 7+] 119

అందు ౪౩౯ వదియగు [1]తోయద మను వృత్తము —

శ్రీయుత భత్రయ - సేవ్యగగంబుల్
తోయజలోచన! - [2]తోయదమయ్యెꣳ.
[భ, భ, భ, గగ. 6+] 120

మఱియు ౧౨ వదియగు జగతీ ఛందస్సునందు ౫౮౬ వదియగు భుజంగప్రయాత మను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 51]
జగద్గీత కీర్తీ! భు - జంగప్రయాతం
బగు న్రేచనా! యద్వ - య ద్వంద్వమైనꣳ.
[య, య, య, య. 7+] 121

---

117. [1]సంగతి (ల. శి. ప్రాఁతప్రతి).

120. [1]తోటకమను వృత్తము (తి), [2]తోదరమయ్యెꣳ (తి), తోదశ మైత్రిꣳ (శా).

అందు ౧౧౭౧ యగు స్రగ్విణీ వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 57]

వాగ్వధూ వల్లభా! - వార్ధి రేఫా వళుల్
స్రగ్విణీ వృత్త [1]వి - శ్రాంతమున్గా మహిన్.

[ర, ర, ర, ర. 6+] 122

అందు ౧౭౫౬ వదియగు తోటక మను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 52]

తుదినాఁక సకార చ - తుష్కముగా
విదితమ్ముగఁ దోటక - వృత్తమగున్.

[స, స, స, స. 8+] 123

అందు ౧౪ వ శక్వరీ ఛందస్సునందు ౨౯౩౩ వదియగు వసంతతిలక మను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 69]

సారమ్ముగాఁ దభజ - జంబు వసంత రాజా
కారా! వసంత తిల - కంబగు గాయుతంబై.

[త, భ, జ, జ, గగ. 7+] 124

అందు ౭ వే ౯౧౯ వదియగు వనమయూర మను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 71]

నందితగుణా! భజస - నంబులు గగం బిం
పొంది చనఁగా వనమ - యూరమగు ధాత్రిన్.

[భ, జ, స, న, గగ. 8+] 125

అందు ౧౫ వదియగు అతిశక్వరీ ఛందస్సునందు ౪ వే ౬౭౨ వదియగు మాలిని యను వృత్తము —

---

122. [1]విశ్రాంతి యూతింటిపై (సు. అ. సా.)

[కవిజనాశ్రయము - ప్రక్షిప్త పద్యములు. 17]
ననమయయ యుతంబై - నాగ విశ్రాంతమై యి
ట్లనుపమగుణ! మాలి - న్యాహ్వయంబయ్యె ధాత్రిన్.
[న, న, మ, య, య. 8+] 126

అందు ౧౬ వదియగు అష్టిచ్ఛందస్సునందు అనంతనగారు ౨౧ వే ౮౪౬ వదియగు పంచచామర మను వృత్తము —

[ఛందోదర్పణము. 2-76]
జరేఫలన్ జరేఫలన్ జ - సంయుతమ్ములై తగన్
గురూపరిస్థితిం బొసంగి - గుంభనం బెలర్పఁగా
విరించి సంఖ్యనందమైన - విశ్రమంబులం బ్రములన్
బ్రరూఢమైన పద్మనాభ - పంచచామరంబగున్.
[జ, ర, జ, ర, జ, గ. 9+] 127

అందు ౧౮ వదియగు ధృతిచ్ఛందస్సు [నందు] ౯౩ వే ౧౯ వదియగు మత్తకోకిల యను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 92]
శ్రావకాభరణాంక! విశ్రమ - జాభరేఫల దిగ్విరా
మావహంబుగ మత్తకోకిల - యండ్రు దీనిఁగవీశ్వరుల్.
[ర, స, జ, జ, భ, ర. 10+] 128

అందు ౧౯ దవ అతిధృతిచ్ఛందస్సునందు ౧ ౪ ౯ వే ౩౩౭ వదియగు శార్దూలవిక్రీడిత వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 95]
సారాచారవిశారదా! యిన యతిన్ - శార్దూల విక్రీడితా
కారంబై మసజమ్ములిమ్ముగ సతా - గప్రాప్తమై చెల్వగున్.
[మ, స, జ, స, త, త, గ. 12+] 129

అందు ౧ ౪ ౭౯ వే ౪౦ దియగు తరళ మను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 97]
ప్రవరరుద్రవిరామ యుక్తిన - భమ్ములున్ రసజాగముల్
కవిజనాశ్రయ! పొందియందము - గా నిడం దరళంబగున్.
[న, భ, ర, స, జ, జ, గ. 11+] 130

అందు ౨౦ వదియగు కృతిచ్ఛందస్సునందు ౨ ల ౯౮ వే ౬౭౬ వదియగు మత్తేభవిక్రీడిత మను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 101]
స్మయదూరా! విలసత్త్రియోదశయతిన్ - మత్తేభవిక్రీడితా
హ్వయమయ్యెన్ సభరమ్ములన్నమయవ - వ్రాతమ్ములం గూడినన్.
[స, భ, ర, న, మ, య, వ. 13+] 131

అందు ౩ ల ౫౫ వే ౭౯౯ దియగు ఉత్పలమాలికా వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 102]
భానుసమాన! విన్భరన - భారలగమ్ములఁగూడి విశ్రమ
స్థానమునందుఁ బద్మజయు - తమ్ముగ నుత్పలమాలయైచనున్.
[భ, ర, న, భ, భ, ర, వ. 9+] 132

అందు ౨౧ దియగు ప్రకృతిచ్ఛందస్సునందు ౩ ల ౨ వే ౯౯౩ వదియగు స్రగ్ధరా వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 106]
శ్రీమన్మూర్తీ! మకారా - శ్రిత రభనయయా - సేవ్యమైసానుమద్వి
శ్రామంబున్ సానుమద్వి - శ్రమమునమరఁగా - స్రగ్ధరావృత్తమయ్యెన్.
[మ, ర, భ, న, య, య, య. 7+, 7+] 133

అందు ౭ ల ౧౧ వే ౬౦౦ దియగు చంపకమాలికా వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 107]

నజభజజజ్జరేఫలఁబె - నంగి [1]దిశాయతితోడఁ గూడినన్
త్రిజగద [2]భీష్టదా! బుధని - ధీ! వినుచంపకమాలయైచనున్.
[న, జ, భ, జ, జ, జ, ర. 10+] 134

౨౨ వదియగు ఆకృతిచ్ఛందస్సునందు ౬ ల ౫ వే ౯౦౭౦ దియగు మహాస్రగ్ధరా వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 112]
లసదుద్యత్కీర్తివల్లీ - లలితగుణగణా - లంకృతాంగా! [1]సతానాం
తసరాగమ్ముల్ మహాస్ర - గ్ధరకు [2]వసుముని - స్థాన విశ్రాంతినొప్పున్.
[స, త, త, న, స, ర, ర, గ. 8+, 7+] 135

అందు ౧౬ ల ౯౩ వే ౩౫౯ వదియగు మానిని వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త. 114]
[1]కారకముల్ క్రియ - గన్గొననేడు భ - కారములొక్కగ - కారముతో
గౌరవమైచనఁ - గావళు [2]లన్నియుఁ - గల్గినమానిని - కామనిభా!
[భ, భ, భ, భ, భ, భ, భ, గ. 6+, 6+, 6+] 136

అందు ౨౩ వ వికృతి చ్ఛందస్సునందు ౩౫ ల ౯౫ వే ౧౨౮ దియగు కవిరాజవిరాజితము —

క్రమమున నొక్క న - కారము నాఱుజ -
కారములున్ బరఁ - గంగ వకా
రమును నొడంబడి - రాఁ గవిరాజ వి -
రాజిత మన్నది - [1]రాజనిభా!
[న, జ, జ, జ, జ, జ, జ, వ. 7+, 6+, 6+] 137

---

134. [1]దశాయతి (అ. శి. వ్రాఁతప్రతి), [2]త్రిజగదభిస్తుతా (క. జ. ఆ.)
135. [1]సతానస్థ (క. జ. ఆ), [2]వసుమతి (అ. శి. వ్రాఁతప్రతి).
136. [1]కారభభాల్గ్రియగా మన్నాభభ, గణములు నొక్కగకారముతో (అ. శి. వ్రాఁతప్రతి), [2]యతి పంద్రెడెట (క. జ. ఆ.)
137. [1]కామనిభా (క. జ. ఆ.) రామనిభా (సు. అ. సా.)

అందు ౨౪ వ సంకృతి చ్ఛందస్సునందు ౪౧ ల ౯౩ వే ౪౭౯ దియగు
క్రౌంచపద వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త 119]

పంచశరాభా! సంచితపుణ్యా! -
భమసభనననయ - [1]పరివృతమైనన్
క్రౌంచపదాఖ్యం బంచిత మయ్యెన్ -
[2]గ్రమదశవసుయతి - కవితలుసేయన్

[భ, మ, స, భ, న, న, న, య *10+, 8+] 138

అందు ౨౬ వ ఉత్కృతి చ్ఛందస్సునందు ౧ కో ౫౬ ల ౫౮ వే ౭౩౫
దియగు మంగళమహాశ్రీ యను వృత్తము —

[కవిజనాశ్రయము - వృత్త 124]

శ్రీమహిత! [1]లోకనుత! - శిష్టజనసేవిత!
వి - శేషగుణ! మంగళమహా శ్రీ
నామమగు నబ్భజస - నమ్ములకడన్
భజస - నంబులు గగంబులు పెనంగన్

[భ, జ, స, న, భ, జ, స, న, గగ 8+, 8+, 8+] 139

[వృత్తరత్నాకరమునందలి ప్రసిద్ధ వృత్తములు]

వ ఇరువదాఱు ఛందమ్ముల నివి భీమనగారు రచియించిన సమవృత్తములందు
ప్రసిద్ధ వృత్తములు మఱియును, 140 కేదార భట్టాచార్యుల వృత్తరత్నా

---

138 [1]పరిమితమైనన్ (క జ అ), [2]గ్రమయతి దశవసు కలితము
గాఁగన్ (క జ అ), *లక్షణమునఁ జెప్పఁబడలేదుగాని లక్ష్య
మునఁ గ్రౌంచపదమునకు అయిదక్షరములపైఁ బ్రాసయతి గాన
వచ్చును.

139. [1]లోకహిత (క. జ అ),

కరమందు ౧౧ వ త్రిష్టుప్ఛందస్సునందు ౨౮౯ దియగు శాలిని యను వృత్తము. [*3-7]

మ, త, త, గగ లు. యతి ౫ టను.

అందు ౪౪౩ దియగు స్వాగత మను వృత్తము. [3-11]

ర, న, భ, గగ లు.

అందు ౪౮౭ వదియగు [1]మౌక్తికమాలా వృత్తము. [3-17]

భ, త, న, గగ లు.

అందు ౮౮౦ వదియగు సుముఖి యను వృత్తము. [3-5]

న, జ, జ, లగ లు.

అందు ౧౦౦౯ యగు భ్రమరవిలసిత మను వృత్తము. [3-9]

మ, భ, న, లగ లు. 141

ఇఁక నందు ౧౨ వ జగతీ ఛందస్సునందు ౨౪౧ వదియగు జలధరమాలా వృత్తము. [3-18]

మ, భ, స, మ లు. యతి ౬ టను.

♦♦అందు ౫౮౫ వదియగు వైశ్వదేవి యను వృత్తము. [3-1.]

మ, య, య, య లు. యతి [1]౬ టను.

అందు ౭౮౧ దియగు *పుష్పవిచిత్ర యను వృత్తము.

త, య, త, య లు.

అందు ౭౮౧ దియగు *మణిమాలా వృత్తము. [3-13]

---

141. *వృత్తరత్నాకరమున 3-వ అధ్యాయమున 11-వ ఛందస్సునందు 7-వ వృత్తము. ఇట్టిందలి రెండవసంఖ్య నా యా ఛందస్సులక్రిందఁ జూచుకొనవలయును. [1]మౌక్తికమాల (శా) శ్రీ (తి).

142. [1]5 మీఁదనని వృత్తరత్నాకరము, "పంచాశ్వైః" = 5+, 7+. ఇందు రెండవది సంస్కృతసంప్రదాయ పాదాంతయతిసూచకము. *"పుష్పవిచిత్ర, మణిమాల" యను రెండు వృత్తములు నొక్కటియ.

త, య, త, య లు యతి ౭ టను

అందు ౯౭౬ వదియగు కుసుమవిచిత్ర మను వృత్తము [3-8]

న, య, న, య లు.

అందు ౧౩౮౧ యగు [1]ఇంద్రవంశ మను వృత్తము [3 3]

త, త, జ, ర లు

అందు ౧౩౮౨ దియగు వంశస్థ మను వృత్తము [3-2]

జ, త, జ, ర లు

అందు ౧౩౯౨ దియగు మాలతి యను వృత్తము [3-21]

న, జ, జ, ర లు

అందు ౧౩౯౭ దియగు లలిత మను వృత్తము [3-1]

త, భ, జ, ర లు

అందు ౧౪౦౦ దియగు ప్రియంవద యను వృత్తము [3-14]

న, భ, జ, ర లు

అందు ౧౭౭౨ దియగు ప్రమితాక్షరా వృత్తము [3-15]

స, జ, స, స లు 142

ఇక నందు పదుమూఁడవదియగు అతిజగతిచ్ఛందస్సునందు ౧౧౫౪ దియగు చంచరీకావళి యను వృత్తము [3-1]

య, మ, ర, ర, గ లు

అందు ౧౪౦౧ యగు ప్రహర్షిణి యను వృత్తము [3-3]

మ, న, జ, ర, గ లు. యతి ౩ టను.

అందు ౨౭౯౦ దియగు *మత్తహాసిని యను వృత్తము

జ, త, స, జ, గ లు

---

143 *ఈ వృత్తము వృత్తరత్నాకరమున మృగ్యము.

అందు ౨౭౯౬ దియగు మంజుభాషిణి యను వృత్తము [3-6]

స, జ, స, జ, గ లు 143

ఇఁక నందు ౧౪ గవ శక్వరీ ఛందస్సునందు [1]౨౦౯౭ వదియగు [2]ఆలోల యను వృత్తము [3-6]

మ, స, మ, భ, గగ లు యతి ౭ టను

అందు ౮ వే ౧౨౮ వదియగు [3]ప్రహర్షణకలిత యను వృత్తము [3-4]

న, న, భ, న, లగ లు యతి ౭ టను 144

ఇఁక నందు ౧౫ అతిశక్వరీ ఛందస్సునందు ౪౬౨౫ దియగు చంద్రరేఖ యను వృత్తము [3-5]

మ, ర, మ, య, య లు యతి ౭ టను

అందు ౧౧ వే ౧౮౪ దియగు ప్రభద్రక మను వృత్తము [3-5 నాగరలిపి వృత్త - రత్న ]

న, జ, భ, జ, ర లు

అందు ౧౬ వే ౩౮౪ దియగు మణిగణనికర మను వృత్తము [3-3]

న, న, న, న, స లు 145

ఇఁక నందు ౧౬ వ అష్టిచ్ఛందస్సునందు ౧౧ వే ౧౮౪ దియగు [1]సతీ వృత్తము [3-2]

న, జ, భ, జ, ర, గ లు 146

ఇఁక నందు ౧౭ వ అత్యష్టిచ్ఛందస్సునందు ౧౮ వే ౯౨౯ దియగు మందాక్రాంత మను వృత్తము [3-4]

మ, భ, న, త, త, గగ లు యతి ౬ టను [illegible] టను

---

144. [1]౩౦౯౭ (తి), [2]'అలోలము' అని వృత్త - రత్న, [3]'ప్రహర్షణకలిక' యని న్నాగరలిపి వృత్త - రత్న 'ప్రహర్షణతిలక' యని తెనుఁగులిపి వృత్త - రత్న

146 [1]'వాణిని' అని వృత్త - రత్న.

అందు ౩౮ వే ౭౫౦ దియగు పృథ్వీ యను వృత్తము. [3-2]

జ, స, జ, స, య, లగ లు. యతి ౯ టను.

అందు ౫౬ వే ౨౪౦ దియగు నర్కుటు మను వృత్తము. [3-6]

న, జ, భ, జ, జ, లగ లు.

ఇఁక నందు ౧౭ వే ౩౩౦ దియగు శిఖరిణి వృత్తము. [3-1]

య, మ, న, స, భ, లగ లు. యతి ౬ టను.

అందు ౬౪౯౮౩ దియగు వంశపత్రపతిత మను వృత్తము. [3-3. నాగరలిపి వృత్త - రత్న.]

భ, ర, న, భ, న, లగ లు. 147

ఇఁక నందు ౧౮ వ ధృతిచ్ఛందస్సునందు ౩౭౮౫౭ వదియగు కుసుమితలతా వృత్తము. [3-1. నాగరలిపి వృత్త - రత్న.]

మ, త, న, య, య, య లు. యతి ౫ టను, ౬ టను.

అందు ౭౪ వే ౯౪౪ దియగు నిశా యను వృత్తము. [3-2]

న, న, ర, ర, ర, ర లు. యతి ౧౦ టను. 148

ఇఁక నందు ౧౯ దవ అతిధృతిచ్ఛందస్సునందు ౭౫౭౧౪ దియగు మేఘవిస్ఫూర్జిత మను వృత్తము. [3-1]

య, మ, న, స, ర, ర, గ లు. యతి ౬ టను, ౬ టను. 149

ఇఁక నందు ౨౦ దియగు [1]కృతి యను ఛందస్సునందు ౪౬ ల ౬ వే ౮౩౩ దియగు (సు)వదన మను వృత్తము. [3-1. తెలుఁగులిపి వృత్త - రత్న. వ్యాఖ్య.]

మ, ర, భ, న, య, భ, లగ లు. యతి ౭ టను, ౭ టను. 150

---

150. [1]కృతియను ఛందస్సునందు ౪౬౬౮౩౩ వదియగు పదస మను వృత్తము — మ, ర, భ, న, య, భ, లగ లు (తి).

ఇ౹క నందు ౨౧ వదియగు ప్రకృతి చ్ఛందస్సునందు ౧౦ ల ౪౮ వే ౫౭౬ దియగు *కనకలతా వృత్తము

న, న, న, న, న, న, స లు 151

ఇ౹క నందు ౨౨ వ ఆకృతిచ్ఛందస్సునందు ౧౦ ల ౪౮ వే ౫౭౬ దియగు [1]ప్రభద్రక మను వృత్తము [3 1]

భ, ర, న, ర, న, ర, న, గ లు యతి ౧౦ టను 152

ఇ౹క నందు ౨౩ వికృతిచ్ఛందస్సునందు ౩౮ ల ౬౧ వే ౪౨౪ వదియగు *అశ్వఖిలసిత మను వృత్తము [3-1 నాగరలిపి వృత్త-రత్న]

న, జ భ, జ, భ, జ, భ, లగ లు 153

ఇ౹క నందు ౨౪ వదియగు సంకృతి చ్ఛందస్సునందు ౪౧ ల ౫౫ వే ౩౬౮ దియగు తన్వీ యను వృత్తము [3-2]

భ, త, న, స, భ, భ, న, య లు యతి ౫ టను, ౭ టను 154

ఇ౹క నందు ౨౬ వ ఉత్కృతిచ్ఛందస్సునందు ౨ కో ౩౮ ల ౫౪ వే ౪౩౨ దియగు భుజంగవిజృంభిత మను వృత్తము [3-1]

మ, మ, త, న, న, న, ర, స, లగ లు [1]యతి ౧౧ టను 155

వ ఇవి వృత్తరత్నాకరమున కేదారభట్టాచార్యులు చేసిన [1]ప్రసిద్ధ వృత్తములు 156

---

151 *ఈ వృత్తము నేఁటి వృత్త-రత్న న మృగ్యము.

152 [1]'సుభద్రక' మని వృత్త-రత్న

153 *ఇది వృత్త-రత్ననలేదు అందిగణములతో 'అశ్వలలిత' మను వృత్తము కలదు

155 [1]8+, 11+ అని వృత్త-రత్న.

156 ప్రయోగ (కా).

క. ఎక్కువ తక్కువ లేకఁ
జక్కఁగ గణనియమ యతులు సమవృత్తములం
దొక్కసమంబుగ వచ్చుఁ
జక్కటి యా యిరువదాఱు ఛందముల హరీ! 157

వ. ఇది సమవృత్తాధికారము. [సనయతినియమపద్ధతి]

ఈ సమవృత్తములకు యతులు నిలుచుటకు లక్షణము.
అనంతనగారు —

క. *వరగణ వర్ణము దీర్ఘ
స్వరమగుచును గణయుగంబు సనయతుల సుధా
కరకరగుణ గతి శరరుచి
గిరిగజ రంధ్రాది సంజ్ఞ కేశవనంతా! 158

వ. అని యీ పద్యార్థము — గణ నిర్ణయాక్షరము దీర్ఘస్వరాలై రెండు గణములని తెలియవలె ననుట. [1]సమయతులు సుధాకర ౧ కర ౨ గుణ ౩ గతి ౪ శర ౫ రుచి ౬ గిరి ౭ గజ ౮ రంధ్ర ౯, యీ సంజ్ఞప్రకారము మొదటి ఉక్త ఛందస్సునుంచి తొమ్మిదో బృహతీ ఛందస్సుదనుక నీ వ్రాసిన లెక్కప్రకారము క్రమముగా యతులు చెప్పవలెననుట. మొదటి ఛందస్సు వృత్తాన కీ మొదటి యక్షరమే యతి. రెండో ఛందస్సు వృత్తమునకు రండో అక్షరమే యతి. ఈ ప్రకారము ఎన్నో ఛందస్సయితె అన్నో అక్షరమే తొమ్మిదో ఛందస్సు పర్యంతము యతులని తెలియవలెను. ఈ లెక్కలన్ని కూడితే యెన్ని అవుచున్నవో అన్ని యతులని యతి నిర్ణయము తెలియవలె ననుట. ఉక్తాది బృహతీ ఛందస్సు దనుక తొమ్మిది ఛందస్సులకు యతి నియమప్రకారము లక్షణకారకులు చెప్పలేదు.

యతులు నిలుపుటకు సనయతులు అన్నాడు గనుక సా ౭ నా ౧౦ అనే సంకేతము.

---

158. *ఈ పద్యము నేఁటి ముద్రితచ్ఛందోదర్పణమునఁ గానరాదు.

159. [1]సనయతులు (తి).

ఇఁక ౧౦ పంక్తిచ్ఛందస్సునుంచి యతులు నిలుపుటకు నిర్ణయం ౯౦ న్ని అనే సంకేతము. ఆ పదో పంక్తిఛందస్సునుంచి యెంచఁగా ఏడోది అయిన ౧౬ అష్టిచ్ఛందస్సుదనుక ౭ టను ౮ టను ౯ టను పదింట ౧౧ టను ౧౨ టను ౧౩ డింటను యతిరాఁ జెప్పవచ్చునమట.

ఇఁక సా అనేడి అత్యష్టి అనేడి ౧౭ వ ఛందసారభ్య. తక్కిన ఉత్కృతి అనే ౨౬ వ సా అనే ఛఁదస్సు పర్యంతము ౧౦ ఛందస్సులకు ఈ క్రిందటి సా అనే సంకేతమునకైన మఱియు ౧౪ ట ౧౫ ట ౧౬ ట ౧౭ ట ౧౮ ట ౧౯ ట ౨౧ టను మఱి యేఱు లెక్కలు హెచ్చించి యతులఁ జెప్పవచ్చును. ఇరువదాఱు ఛందస్సుల మీఁదటి ౭ ఛందస్సులకున్ను ఈ సంఖ్యప్రకారము యతుల నిర్ణయము.

ఇఁక ద్వంద్వయతులు వస్తున్నవి గనుక మొదటి ౨ ఛందస్సుల సంజ్ఞ రావచ్చునట. తొమ్మిదో బృహత్ ఛందస్సునుంచి సనా తక్కిన ౧౬ ఛందస్సులలో సనా ౧౧౭ వృత్తములకు ఈ యతి నియమ మనుట. ఈ యతి నియమం చేసిన ౧౧౭ వృత్తములకు వివరము, 10 దో పంక్తి ఛందస్సునందు మయూరసారణి యను వృత్తము — త్రిష్టుప్ఛందస్సునఁ గల శాలిని, వాతోర్మి, ఇంద్రవజ్రము, ఉపేంద్రవజ్రము, ఉపజాతి, తోదక, స్వాగత, రథోద్ధత, చంద్రికా, కాంతా, మందారదామ అనే వృత్తములు ౧౧. జగతీ ఛందస్సున విశ్వదేవి, జలధరమాలా, భుజంగ ప్రయాతము, దోదక, చంద్రవర్త్మ, హయరచితప్రభా, ఇంద్రవంశ, పుట, కుసుమవిచిత్ర, ప్రియంవద, కలహంస, ప్రమితాక్షర, జలోద్ధతము లనియెడి వృత్తములు ౧౩. అతి జగతీఛందస్సునందు ప్రభాత, ప్రహర్షిణి, మత్తమయూర, మంజుభాషిణి, రుచిర, జలద, ప్రీతి, క్షమా అనెడి వృత్తములు ౮; శక్వరీ ఛందస్సున అసంబాధా, వసంతతిలక, సింహోద్ధత, మధుమాధవి, ఉద్ధర్షిణి, భ్రమిత, వనమయూర, సుందరి, అపరాజిత, ప్రహరణకలిత, పుష్పదామము లనియెడి వృత్తములు ౧౧; అతిశక్వరీ ఛందస్సున మాలిని, సుకేసరి, మణిభూషణ, మనోజ్ఞ, మణిగణనికర, ప్రభద్రకము లనియెడి వృత్తములు ౬; అష్టిచ్ఛందస్సున చంద్రశ్రీ, మేదిని, ప్రియకాంత, పద్మా, పంచచామర, మదనదర్పణ, అశ్వగతి అనెడి

వృత్తములు ౭; అత్యష్టిచ్ఛందస్సున మందాక్రాంత, శిఖరిణి, పృథ్వీ, ఫలసదన, త్వరితపదగతి, హరిణి, సుగంధి, నర్కుటం, వంశపత్ర, పతిత, పలాశదళ, సరసిరుహము లనియెడి వృత్తములు ౧౨; ధృతిచ్ఛందస్సున కుసుమితలతావేల్లితము, మత్తకోకిల మను రెండు వృత్తములు; అతిధృతిచ్ఛందస్సున [1]మేఘవిస్ఫూ[ర్జిత], శార్దూలవిక్రీడిత, భూతిలక, తరళ, చంద్రకళ లనెడి వృత్తములు ౫; కృతిచ్ఛందస్సున మత్తేభవిక్రీడిత, ఉత్పలమాలిక, అంబురుహ, ఖచరప్లుత, [సువదన], భుజగవృత్తము లనెడు వృత్తములు ౬ ను; ప్రకృతిచ్ఛందస్సున స్రగ్ధర, లాటీవిట, చంపకమాలిక, వనమంజరి, మణిమాలిక, భ్రమరకూజిత, కలిబృంహితము లనెడి వృత్తములు ౭; ఆకృతిచ్ఛందస్సున మహాస్రగ్ధర, అష్టమూర్తి, మానిని, చంద్రిక, మృగనాభి, తురగ, విచికిలస్తబకము లనెడి వృత్తములు ౭;

**వికృతిచ్ఛందస్సున కవిరాజవిరాజిత, పద్మనాభ, అశ్వలలితము లనెడి వృత్తములు [౩];

సంకృతిచ్ఛందస్సున క్రౌంచపద, సరసిజవృత్తము లనెడి వృత్తములు ౨; అభికృతిచ్ఛందస్సున బంధుర, భాస్కరవిలసితము లనెడి వృత్తములు ౨; ఉత్కృతిచ్ఛందస్సున భుజంగవిజృంభిత, మంగళమహాశ్రీ యను వృత్తములు ౨; అందు ౧౦ దో పంక్తి ఛందస్సు మొదలుగా ఇరువదాఱవది యగు ఉత్కృతిచ్ఛందస్సు పర్యంతము ఛందస్సులు ౧౭౦ ట వృత్తములు ౧౦౭ న్ను, సనయతి నియమప్రకారము యతులు గలుగు ననుట. మఱియు నుంగల కవికల్పిత ప్రక్షిప్తవృత్తములు ఈ సనయతులనే వృత్తములు రచియింపవలెననుట. మఱియు గణసమక నిబద్ధములైన వృత్తములకున్ను మాత్రాసమక నిబద్ధములైన కంద, గీత, సీస, రగడ, చౌపదాదులు మొదలయిన జాతులకున్ను ఈ సనయతి నియమప్రకారమే కృతుల యతులు రచియింప వలయుఁగావున మూలమర్మభేదంబులు తెలిసి, యతులు నిలుప వలయును. 159

159. [1]మేఘవిస్ఫూర్తి (అ. శి. వ్రాఁత ప్రతి).

160. *ఈ పద్యము నేఁటి ముద్రిత ఛందోదర్పణమునఁ గానరాదు.

అనంతన్నగారు --

క. *యతికందసీసవృత్త
ప్రతతికి సన సంజ్ఞ మొదలిబ్రహ్మచ్ఛంద
స్థితి శశికర [1]{పు]ర [బ]ల శర
ఋతుగిరి కరి రత్నశోభ నేర్పడుఁ గృష్ణా! 160

ఈ సనయతులకే భీమనగారు,
[కవిజనాశ్రయము - సంజ్ఞ. 75]

క. హిమకరకరవైశ్వానర
సముద్రబాణర్తుముని భుజంగమనందా
ద్యమిత గణితోక్తి సంజ్ఞా
క్రమ మెఱుఁగఁగవలయు నెన్నఁగాఁ దగునెడలన్. 161

వ. అన్నారు. ఇది సనయతి నియమపద్ధతి. ఇఁక నందు 162

## [ప్రాసభేద వృత్తప్రకారము]

## మలహారి వృత్తము

వ. ధృతిచ్ఛందస్సున నాలుగు పాదములకు ప్రాసము ప్రత్యేకము వచ్చిన మ, జ, భ, ర, భ, ర. గణములును, యతి పదింటను నిలుచును. ఇది మల హారి వృత్తలక్షణము. ఇఁక, 163

---

160. [1]ఖర జల (అ. శి. వ్రాఁతప్రతి). ఈ పాఠము అర్థవంతము కాదు, ఇందు, '3, 4' అను సంఖ్యల యర్థముండవలయును. సవరణలోని 'పుర, బల' ములకు త్రిపురములు, చతురంగబలము అని యర్థము. 'ఖర జల' అను పాఠమును సహితము గ్రహింపవచ్చును. ఖర = అగ్ని - త్రేతాగ్నులు [ఖరాః రుద్రాగ్ని గర్దభాః - నానార్థ రత్నమాల] జల - జ్యోతిశ్శాస్త్రమున లగ్నమునకు చతుర్థస్థానమని యర్థము కలదు. (సూర్యరాయాంధ్రనిఘంటువు.)

## తురంగ వృత్తలక్షణము

తే. దళమునకుఁ [1]బంచవర్ణము(ల్భ)లల యుక్తి
పరఁగునట్టి దళంబులు పదియు నాఱు
గూర్చి తుద మూఁడు లఘువు[2](ల) గుచ్ఛముగను
ఏకప్రాసంబునఁ దురంగ వృత్తమండ్రు 13

[పంచవర్ణములగు భలల గణమొక దళము అట్టి దళములు పదునాఱు వ్రాసి, తుద మూఁడు లఘువులు గుచ్ఛముగాఁ గూర్చి యేకప్రాసముగా వ్రాయవలెనని పై లక్షణము దెల్పుచున్నది ఇందు లక్ష్యము గానరాదు లోపించెనేమో ఈ లక్షణ మస్పష్టము

గణపవరపు వేంకటకవిప్రణీత ప్రబంధరాజవేంకటేశ్వర విజయ విలాసమున[3] తురంగవృత్తమొకటి కలదు

(808 వ పద్యములోని సీసగర్భితమైన తురంగవృత్తము - పుట 256) అది యిట్లున్నది

సారస సమనేత్రయుగళ నారదరుచికాంతి నరఘనపనిత
ధీర విశద పీనతురగ భైరవ భవజైత్ర భరశుభకర
హారవిసరచారణహరి సారసహితచంద్ర శరజజయనుత
నారదవరపూజితపద గౌరవకటిఖడ్గ గరళపఖ

పై లక్షణమునకు నీలక్ష్యమునకు కించుక భేదమున్నది ఈ లక్ష్యమునుబట్టి లక్షణ మిట్లుండవలెను పాదమునకు భలల గణములు నాలుగు వరుసగా నిలిపి, తుద మూఁడు లఘువులు (నగణము) గూర్పవలెను ఇట్లు నాలుగు పాదములు వ్రాసి, ప్రతిపాదమున రెండు సగములలో ప్రాస ఘటింప వలెను దీనికి యతి నియతి లేదు ]

ఇది ప్రాసభేద వృత్తప్రకారము

164. [1]పంచవర్ణము తలలయుక్తి (తి) వర్ణము ఖలలయుక్తి (శా), [2]లఘువులు (శా), [3]ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ ప్రచురణము - 1977.

మఱియు ప-వ లకు శబ్దశాసనుఁడు ఆరణ్యపర్వము చంపకము ౨-వ పాదమున అభేదయతిప్రయోగము లక్ష్యము [3-78]

చ సతత [1]కృతోపవాసముల శాకఫలోదక మూలపారణ
వ్రతముల [2]దేవపూజల నపార జపంబులఁజేసి నిష్ఠతో
నతుల తపంబుచేసె నమరాపగనుర్వికిఁదేర వేడ్కతో
ధృతియుతుఁడై దిలీపకులదీపుఁడు దివ్యసహస్రవర్షముల్ 173

మఱియు ప-వ లకు [*శబ్దశాసనుఁడు ఆది]పర్వము కందము ౨-వ పాదమున అభేదయతిప్రయోగము లక్ష్యము [7-109]

క [1]వీరుండగు నరుఁడేయు న
పారశరావళుల నడుమ వారింపంగా
నేరక యేటుడిగి మహా
శూరుఁడు రాధేయుఁ డింద్రజున కిట్లనియెన్ 174

మఱియు ప-వ లకు ఆంధ్రకవితాపితామహుండు ఆముక్తమాల్యదయందు చంపకము ౨-వ పాదమున నభేదయతిప్రయోగము లక్ష్యము [4-85]

చ ఎడపకమున్న మింటిపయి నేతగులంబును లేక మూర్ఛతన్
వెడలెడుచోఁ గఠోరఘనబృందము లడ్డమువడ్డ, వానిమై
యిడియె జవోర్మిఁ బాఱెడు రవీందుల దట్టపు బండికండ్ల చ
ప్పుడుగతిమ్రోసె [1]రేవగలు భూరిభయంకర గర్జలత్తఱిన్ 175

వ ఇవి యభేద యతిప్రాస ప్రయోగ లక్ష్యములు ఇఁక నందు, 176

---

173 [1]కృతోపచారముల (శా)
[2]దేవపూజల నపారజలంబులనిల్చి నిష్ఠతో (శా)

174 *సోమయాజి విరాటపర్వమని అ శి వ్రాఁతప్రతి
[1]వీరుఁడగు నరుని యేయు (సంశో భా)

175 [1]రేఁబగలు అని అ శి వ్రాఁతప్రతి.

177 [1]నియమమునూ అని అ శి వ్రాఁతప్రతి

## (12) వృద్ధియతి ప్రయోగ లక్ష్యములు

క. లోకైకపద బిడౌజో
నాకౌకశ్శబ్దములకు [1]నయముగవృద్ధుల్
చేకుఱును నకారేకా
రోకారములెనయు యతుల నొక్కొకటహరీ! 177

వ. మఱియును, 178

సీ. ఉగ్రారిశైల బిడ్డౌజుఁడౌశ్రీహరి
యనుజుఁడై కలిగె బిడౌజునకని
యుత్సుకులగుచు నాకౌకసుల్ వినుతింప
నభయంబులిచ్చె నాకౌకసులకు
నింద్రోపమాన భోగైక పరాయణుం
డక్రూరుఁబ్రోచె లోకైక నుతుఁడు
ఈశజన్మశతార్జితైనోహరణ యన్న
నతఁడు హరించు జన్మైనసములు

తే. ఉదధిశయనుండు వాంఛితార్థౌఘదాయి
యస్మదీయ మనోవాంఛితౌఘ మెలమి
నిచ్చుశరవహ్ని దగ్ధాసురైధసుఁడన
నవని నీగతి వృద్ధివళ్లమరుఁ గృష్ణ! 179

*అనంతన్నగారు —

క. లోకైక ముఖ్యపదములు
నాకౌకః ప్రభృతులును జనస్తుత! వృద్ధుల్
[1]జోక నికారము కారము
గైకొనఁదగు వడుసయతి నకారము చెల్లుఁగా. 180

---

180. *ఇది నేఁటి ముద్రిత ఛం. ద. నలేదు.
[1]జోకఁగా ఇకారము ఉకారము, గైకొన ... యతిఁగా అకారము.

ముద్దరాజు రామభద్రయ్యగారు కవిసంజీవనియందు. [1.69]

క. ఏకృతులయందు నేకా
రైకారంబులును వృద్ధియతి యిడఁజెల్లున్
కాకోల ధురంధర [1]విది
తైక పరాక్రముఁడు హలధరానుజుఁ డనఁగన్. 181

చిత్రకవి పెద్దనగారు [ల. సం. యతులు. 1.9]

తే. ఏకమోజంబు మొదలుగా నెసఁగు సంధి
వృద్ధియతులగు దేవలోకైక మాన్య
యున్నతాహితశైల బిడౌజ యనఁగ
భంజితాసుర సముదాయ! యాంజనేయ! 182

రఘునాథయ్యగారు దీపికయందు ఆంధ్రకవితాపితామహాని అలంకారమున గీతి లక్షణముగా ప్రయోగము వ్రాసినది. [ల. దీ. ప. 339]

తే. ఇందురేఖాకలాప లోకైకసేవ్య
ఉరగకంకణనుత విబుధౌఘ యనిన
నెఱుఁగ నివి వృద్ధియతులయ్యె నరయవీని
నెలవున నకారమైనను నిలుపవచ్చు. అన్నారు. 183

ఇఁక సోమయాజి విరాటపర్వము ఉత్పలము ౨-వ పాదమున వృద్ధియతి ప్రయోగము లక్ష్యము. [3-33]

ఉ. ఆకమలాక్షి రూపమహిమాతిశయంబు మనోహరంబు భో
గైక పరాయణుల్పురుషు లంగజుఁ డప్రతికారచేష్టిత
స్వీకృతసర్వలోకుఁ డటు చేటు పురంబున వారికిమ్మెయిన్
గాకెటులుండు నిట్టియవగాఢపువొత్తు మనంగవచ్చునే? 184

భాస్కరుఁడు రామాయణము విభీషణవాక్యము శార్దూలవృత్తము ౨-వ పాదమున ఓకళ్ళబ్దమునకున్ను వృద్ధియతి ప్రయోగము లక్ష్యము. [సుందర కాం. ప. 443]

---

181. [1] శిథిలైక. (క. జ. నీల.)

శా నీకంఠార్పిత కాలపాశము శిరోనిర్ఘాతపాతమ్ము లం
క్లాకస్పంచయ కాలరాత్రి [1]కరబద్ధోదగ్ర కాలాహిక
న్యాకారాగతమృత్యు వి జనకకన్యన్వేగ మొప్పించి లో
[2]కైక క్షత్రాఘుని రాముని౦గనుము నీకీబుద్ధిగాకుండినన్ 185

సూరపరాజుగారు రాఘవపాండవీయము తృతీయాశ్వాసము కందము ౭-వ పాదమున ఏకశబ్దమునకు వృద్ధియతి ప్రయోగము లక్ష్యము [3_9]

క జనులందఱు నీయం ద
త్యనురాగము కలిమి నెఱపెదరు [1]సత్యమహా
త్త్వ నిరూఢిఁ బొప్పుచుఁగు నీ
యనుజులు భవదీయ శాసనైకాయత్తుల్ 186

వ ఇది వృద్ధియతి ప్రయోగ లక్ష్యము ఇఁక నందు, 187

(13) మకార బిందుయతి లక్షణము

తే యరలవల యందు శషసహాక్షరములందు
నాదిబిందు[1]యుతమునైమయతి (యొసంగు)
యరలవ శషసహల బిందులందుఁ గదియ
నిడకయుండిన యశవర్గవడులు కృష్ణ ! 188

ఈ మకారయతి కుదాహరణము మదీయము

సీ మదన గోపాల ! సంయమిజాలనుతశీల !
మదగజత్రాణ సంరంభ నిపుణ !
మారుక్మిణీ స్వయంవర విశేషామోద !
మదనారివంద్య సంశ్లాఘ్యపాద !

185 [1]గళ (భాస్క రామా)
[2]లోక + ఎక . నీవ + ఈ ఇందు సహితము వృద్ధియతి యున్నది.
186 [1]సత్త్వ (రా పాం)
188. [1]యుతమ్మునై మయతి యగును. (ల. శి వ్రాఁతప్రతి)

మధు విరోధి! యదువంశ పవిత్ర! [1]హరమిత్ర
మహిత భూభరణ దంష్ట్రాధురీణ!
మాధవ! దుష్టకంసహర! దైత్యాంతక!
మానినీ కలుషసంహరణ చరణ!

తే. యనిన నీరీతిఁ గృతులందు య ర ల వ శ ష
స హ ల కొండొంటి తోఁ దదక్షరములందుఁ
గదియబిందువులిడిన మకారబిందు
యతులనఁగఁజెల్లు సుకవిసమ్మతిని గృష్ణ! 189

అనంతనగారు [ఛం. ద. 1-117]

తే. య ర ల వ ల శ ష స హ లను నాదిబిందు
యుతములై మకార విరామయుక్తిఁదనరు
నూరుతాత్మజుఁ దరిసెసంయమి యనంగ
మదనజనకుఁడు దనుజసంహారుఁ డనంగ. 190

భీమనగారు చంపకము ४-వ పాదమున మకారయతి ప్రయోగము లక్ష్యము [చాటుధార]

చ. గరళపుముద్ద లోహ, మవగాఢ మహాశనికోట్లు నమ్మెటల్,
హరునయనాగ్నికొల్మి, యురగాధిపుకోఱలు పట్టుకార్లు, ది
క్కరటి శిరంబు దాయి, లయకాలుఁడు కమ్మరి, వైరివీరసం
హరణ గుణాభిరాముఁడగు మైలమభీమన ఖడ్గవృష్టికిన్. 191

వ. అన్నారు. ఇవి మకారయతిప్రయోగ లక్షణములు. ఇఁక నందు, 192

## (14) ప్లుతయతి లక్షణము

క. ప్లుతయతుల గతులు తెలియఁగ
నతులిత కృతులందు నాలుగనఁబడుఁ గవిస
మ్మతముగ దూరాహ్వానం
బతిరోదన గీత సంశయములనఁ గృష్ణా! 193

ఈ నాలుగు తెఱఁగుల కుదాహరణములు —

సీ. సరవి దూరాహ్వాన సంగీత సంశయ
రోదనమ్ముల నాఁగ రూఢి నాల్గు
తెఱఁగులై ప్లుతము దీపించు సంగీత
మున ... ... .. .. ... .. ... ...
గాన సాహిత్యమార్గములలేదు నిజంబు
తక్కిన మూఁటి [1]ఉదాహరణలు
ఏమినాస్వామి రా కేయన నొప్పు దూ
రాహ్వాన మనెడి ప్లుతాహ్వయంబు
తే. ఆశ్రితుల సేవ నీకు మే. గా [illegible]రాదె
యనఁగ రోదన ప్లుతమగు నంబుజాక్ష!
ఎటులఁ బ్రోచెద వానతీ వే యటన్న
సంశయప్లుత మనఁజను జగతిఁ గృష్ణ! 194

భీమనగారు [క. జ. ఆ. సంజ్ఞ. పుట. 21. అథస్సూచి. 1917]

క. ప్లుతమనఁబరఁగుఁ ద్రిమాత్రా
న్వితవర్ణము దానిమీఁద వితతస్వరముల్
గృతిపై యక్షరమునఁ జనుఁ
జతురానన [1]సదృశ వళ్లి చక్కటిఁ జెల్లున్. అన్నారు. 195

దూరాహ్వాన ప్లుతానకు సోమయాజి అనుశాసనికము ఉత్పలము ౪-వ పాదమున ప్రయోగము లక్ష్యము. [1-53]

ఉ. అనరనాయకుండొక మహాధ్వర మెంతయు పేర్కఁజేయఁగా
బూని మహీసురావళికిఁ బూజయొనర్పఁగఁ దాను బ్రాహ్మణుం
డై నయమారఁగా ననలుఁ డాతని పాలికివచ్చి నాకు నీ
వే నృపనీదు పుత్త్రి ప్రియ మేర్పడ దానముగాఁగ నావుడున్. 196

---

194. [1]ఉదాహరణలు - చరిత్రాది గణమున గ్రహింపనగును.

195. [1]జతురానన చతుర (యతులు) (క. జ. ఆ.)

రోదనప్లుతానకు భాస్కరరామాయణము ఉత్పలము ౨-వ పాదమున ప్లుత యతి ప్రయోగము లక్ష్యము. [యుద్ధ. కాం. ప. 41]

ఉ. ఏజనకాత్మజ దశరథేశ్వరు కోడల రాముభార్యఁ జుం
డో జనులార! యడ్డపడరో సురలార ! సురారి కంచు నం
భోజదళాక్షి శైలవనభూములు దాఁటుచు భీతినేఁగుచో
నీజలరాశిఁ జూచి మదినెంత దలంకెనొ యేమిసేయుదు౯. 197

సంశయప్లుతమునకు సోమయాజి ఉద్యోగపర్వము ఉత్పలము ౨-వ పాదమున ప్లుతయతి ప్రయోగము లక్ష్యము. [2-162]

ఉ. ఒక్కఁడొకం డనేక విధ యుద్ధజయంబులు గొన్నవారు దా
రెక్కడ నేమిసేసెనితఁ డీతని తమ్ముని నాజిఁగూల్చి యు
క్కెక్కిన పార్థుపైఁ గవిసె నేపసి నాతఁడు గ్రమ్మఱింపఁగా
నక్కడలేఁడె వీడు భవదాత్మజుఁగోల్పడె ఘోషయాత్రలో. 198

మఱియు సంశయప్లుతమునకు సోమయాజి ద్రోణపర్వము ౫-వ ఆశ్వాసమందు అశ్వత్థామ వాక్యము ఉత్పలము ౪-వ పాదమున ప్లుతయతికిన్ని, ౨-వ పాదమున వ-బ ల అభేదయతికిన్ని ప్రయోగము లక్ష్యము. [5-336]

ఉ. చావులు లేవెయందు ననిఁ జచ్చుట యొప్పదె యిట్లు లోకసం
భావితు నమ్మహాత్ముఁ దలవట్టి నొకండను [1]వాఁడిమాట య
మ్మైవడి దాఁకి చిత్తమునకార్తి యొనర్ప సహింపరాదుగా
కేవిన నుక్కు వాఁడెఱుఁగఁడే నను నిమ్మెయి భంగపెట్టునే. 199

మఱియు సంశయప్లుతము సోమయాజి కర్ణపర్వము ౩-వ ఆశ్వాసము చంపకము ౨-వ పాదమున ప్లుతయతి ప్రయోగము లక్ష్యము. [3-188]

చ. హయములఁ జంపి, ముప్పది శితాస్త్రములం దెగటార్పఁ జూచి, తం
త్రియముని చందమై [1]తెగితినేశని వీరుఁడనంచు వేయుడు౯

198. [1]వారిమాట. (అ. శి. వ్రాఁత ప్రతి).

200. [1] తెగితి రే. (సంశో. భా.)

భయదమహోగ్రతఁ నిగుడ నారసముఁ నడుమఁ శిలీముఖ
త్రయమునఁద్రుంచి మేనఁ బ్రదర త్రితయంబు శిఖండిఁగ్రుచ్చినఁ. 200

వ. ఒక్కొకదిక్కున ఈప్లుతయతిన్ని కాకుస్వరయతిన్ని ఒక్కరీతిగా కనఁ
బడును. ఇవి ప్లుతయతి లక్షణ లక్ష్యములు. ఇఁక నందు, 201

## (15) నిత్యసమాసయతి లక్షణము

సీ. శబ్దముల్ విభజింపఁ జనరాక నన్యశ
బ్దంబుఁజేకొని చెప్పఁబడిన యతు
రమ లు సమాస మధ్యమమునఁ గనుపట్టి
నాస్తి నారాయణానంత పదము
లేపఱు నుక్కఱు లెన్నఁగఁ బిన్నది
రూపఱు చూపఱు కాపదియనఁ
గ్రిక్కిఱించెను ధిక్కరించెఁ దెమ్మెర ప్రస
రించెఁ గట్టిఁడి యలరించె ననెడి

తే. శబ్దములు పోల్కిగలయన్ని శబ్దములకు
వచ్చుహాల్లైన సంధిసేయంగఁ గృతుల
మహిని రంజిల్లు నిత్యసమాసయతులు
సకల లక్షణములు దీనిజాదకృష్ణ! 202

తే. మఱియుఁ బ్రభునామ నిత్యసమాసవిరతు
లొక్కవిధమునమందు నొక్కొక్కయెడల
నట్టి తద్భేద వాదము లరసి విశ్చ
యింపవలెఁ జూపె యవి విభజించికృష్ణ! 203

వార్తాకవి రఘునాథయ్యగారి దీపికయందు

తే. ఒరుల నమ్మయ్యయనుచోట నూఁదఁబడక
ద్వివిధమైనట్టి ప్రభునామ విరమణంబె
యూఁదినను రెంట నూఁదక యున్నరెంట
డాపి యతులొంద నిత్యసమాసమగ్యో. 204

గోకర్ణచ్ఛందంబునందు —

క ¹[సుకవుల్] పిన్నక్కను బి
న్నకయనగా రన్నగార(నన్) గృతుల(ను) నొ
క్కొకచో నిత్యసమాసము
లకు నీగతి వళ్లఁ జెల్లు లక్షణమహిమన్ 205

*మఱియు నంద, [కావ్యాలంకారచూడామణి 7-70]

క చెన్నక్కకుఁ జెన్నకమా
చన్నన మాచన యనంగ నచ్చట వళియై
చెన్నగు నకారమార్యుల
మన్నన హల్లేని గలుగు మఱియొక్కొకచోన్ 206

అనంతన - ఉక్కఱ - ఏపఱ లను నీరెంటికి లక్షణ లక్ష్యములు [ఛందో దర్పణము 1-101]

తే ¹అఱయనుట పోవుటయె యర్థమరయ నట్టి
సంధి నిత్యసమాసోక్తి జరుగు రెండు
నసురవీరులనెల్ల నుక్కఱ వధించె
భానుకులుఁడు రావణుని నేపఱిచె ననఁగ 207

మఱియు ననంతనగారు [ఛందోదర్పణము 1-103]

ఆ ఏనియను పదంబుతో నాది పదమంది
సంధి నిత్యయతులు జరుగురెంట
నెట్టి క్రూరకర్ముఁడేని సద్గతి నొందు
నిన్ను నాత్మఁ దలఁచె నేని కృష్ణ! 208

205 ¹సుకలాపిన్నక్కను బి
న్నక యనగా రన్నగారన యనఁగృతుల (అ శి వ్రాఁతప్రతి).

206 *ఇది గోకర్ణచ్ఛందములోనిదిగ అ శి వ్రాఁతప్రతి.

207. ¹అఱయనంగను బోవుటకర్థమైన (ఛం. ద.)

చిత్రకవి పెద్దనగారు [లక్షణసారసంగ్రహము. 1-5]

తే. పదము లేర్పాటుగాఁజేయ బాగుగాని
సంధి నిత్యసమాస విశ్రమము దనరు
నవ్వ సద్గుణరత్న రత్నాకరయన
భంజితాసురసముదాయ! యాంజనేయ! 209

ముద్దరాజు రామభద్రయ్యగారి కవిలోకసంజీవనియందు. 1-98]

క. చను నాపోశన వాతా
శన వాతాయనములను వెసం గృతి రామా
యణము పరాయణ నారా
యణ నిత్యసమాసములకు యతులిరుదెఱఁగై. 210

*విక్రమార్కచరిత్ర [సింహాసన ద్వాత్రింశిక. 4-208]

క. ఇది చేతిది పోచకపి
న్నది [1]కట్టఁడి దానికంటె [2]నల్లన యను నీ
పదములు నుభయము గొనను
న్నది [3]నిత్యసమాసమగును నరలోకేంద్రా! 211

వ. ఇవి [నిత్యసమాసయతి] లక్షణములు. ఇఁక నందుకు లక్ష్యములు. 212

గోకర్ణచ్ఛందస్సునందు —

తే. ఇనుఁడు పూర్వాచలం బలరింపఁజేసె
మించె వనరాజి కమ్మఁ దెమ్మెరల చేత

---

211. *ఇయ్యది జక్కన విక్రమార్కచరిత్రలోనిది కాదు. కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికను విక్రమార్కచరిత్రయన్నది నామాంతరముని యెన్నదగును. [సింహా. ద్వా. 1-59]

[1]కట్టెఁడు. (సింహా. ద్వా.)

[2]నల్లని. (సింహా. ద్వా.)

[3]వెల్లను ననుమతంబు. (సింహా. ద్వా.)

ఇంతి చనుదోయి దాఁ గ్రిక్కిఱించె ననఁగ
మనుజవర! యొప్పు నిత్యసమాసయతులు. 213

నాస్తి. నారాయణ, అనంత, రసాయన శబ్దములు. నిత్యసమాసయతికి లక్షణమున్ను లక్ష్యమున్ను. [*ఛందోదర్పణము. 1-97]

ఆ. నాస్తియనక మహి ననంత సంపదలు నా
రాయణుం డొసంగు రమ్యముగ ర
సాయనంబు బుధుల కతఁ డొసఁగు నిత్యస
మాసయతుల రెంట నంటియుండు 214

మఱియు వామనచరిత్ర నాస్తి శబ్దంబునకు కందము ౪-వ పాదమున అచ్చునకు నిత్యసమాసయతి ప్రయోగము లక్ష్యము.

క. స్వస్తియని పలుకుచుం గమ
లాస్తన కస్తూరికాప లాంఛనుఁడగు శ్రీ
హస్తంబు సాఁచి వేఁడిన
నాస్తి యనం బలుకనగునె యాదిమ పురుషుల్. 215

మఱియు నారాయణ, పరాయణ శబ్దములకు ప్రబంధపరమేశ్వరుఁడు అరణ్యపర్వం నాంది కందమున ౨-వ పాదమున ౪-వ చరణంబున హల్లుకు నిత్యసమాసయతి ప్రయోగము లక్ష్యము. [5-1]

క. శ్రీయువతీ ప్రియనృప నా
రాయణ బిరుదాంక భీమ! రమణీయ గుణ
శ్రీయుత! నిర్మలధర్మ ప
రాయణ! రవితేజ! రాజరాజ నరేంద్రా! 216

మఱియు నేకాంత శబ్దమునకు శబ్దశాసనుఁడు ఆదిపర్వము గీతి ౧-వ పాదమున నిత్యసమాసయతి ప్రయోగము. హల్లుకు లక్ష్యము. [8-74]

214. *లక్షణసారము అని ల. శి. వ్రాఁతప్రతి.

తే. కామదేహంబులకును నేకాంత గృహము
పొలిచెఁబో మోక్ష ధర్మార్థములకు నిదియె
యాస్పదంబన వర్గత్రయానిరుద్ధు
లైన జనులకెంతయు నొప్పు నప్పురంబు. 217

జనార్దన శబ్దమునకు ప్రబంధ పరమేశ్వరుఁడు ఆరణ్యపర్వము చంపకము ౧-వ పాదమున నిత్యసమాసయతి ప్రయోగము లక్ష్యము. [4-396]

చ. నగినగియేనియుణ్ విను జనార్దన యెన్నఁడు బొంకుఁబల్క మ
త్యగణిత విక్రమోరు బలధైర్య సమగ్రుల మట్లుగాక కా
లగతి తొలంగఁద్రోవఁగఁ దలంబగునే యగుఁగాక నీకు మె
చ్చగ నిదె ప్రాణ మిచ్చెదము స్రుక్కము చావున కాత్మనేమియుణ్. 218

వార్తాకవి రఘునాథయగారి దీపికయందు,

తే. సరవిమించు విశ్వామిత్ర శబ్దమునకు
అప్పుహల్లైన యతియయ్యెనాది కృతుల
నదియె నిత్యసమాసంబయండ్రు బుధులు
దీనిధుల నీనిలెప్పగాఁ దెలియవలయు. అన్నారు. 219

విశ్వామిత్ర శబ్దమునకు భాస్కరుఁడు రామాయణము మత్తేభము ౨-వ పాదమున నిత్యసమాసయతి ప్రయోగము హల్లుకు లక్ష్యము. [సుందర. కాం. 263]

మ. హరకోదండ విఖండనుండు జనకక్ష్మాధీశజామాత భా
స్కరవంశాగ్రణి జానకీప్రియుఁడు విశ్వామిత్రయాగాహితా
సురసంహారి విరాధకాలుఁడు ఖరాసుధ్వంసి మారీచ సం
హరుఁ డన్యప్రమదాపరాఙ్ముఖుఁ డయోధ్యానాయకుండావటణ్. 220

అప్పవెల్ల రంగనాథుఁడు రామాయణము, ద్విపద. విశ్వామిత్ర శబ్దమునకు రెండవ యర్ధచరణాది అప్పుకు నిత్యసమాసయతి ప్రయోగలక్ష్యము.

ద్వి. ఎక్కడా గురుఁడని యెఱుఁగని నీకు
అక్కటా, గురుఁడు విశ్వామిత్రుఁడయ్యె. 221

వ. అనుట నివి నిత్యసమాసయతి లక్షణ ప్రయోగములు. ఇఁక నందు, 222

## (16) గూఢస్వరయతి లక్షణము

తే. తగు విసర్గలు దొలఁగు నోత్వంబుతోడ
హల్లుపై స్వరమందిన యట్టి సంధి
యదియె గూఢస్వరయతినాఁ బొదలుఁగృతుల
నెన్న గూఢస్వరవిభేద మిటులఁ గృష్ణ ! 223

[ఛందోదర్పణము. 2-86]

తే. స్వరము తుదనుండ లుప్తవిసర్గ కోత్వ
మైన స్వరవిరామంబు దాసోఽహమనఁగ
అచ్యుతాశ్రితు లర్వి నన్యోన్య మిత్రు
లనఁగ నమ్మకుందుండు యశోఽర్థియనఁగ. 224

(*అథర్వణచ్ఛందంబున - రం. ఛం. 3-119)

తే. అరయ నన్యోన్య శబ్దపరోక్షములకు
న్యోరు వర్ణంబులగు నుర్వినుతచరిత్ర
వినుము గూఢస్వరములగు వీనియందు
అచ్చులకు హల్లులకు వళలగునటండ్రు. 225

సర్వదేవుఁడు ఆదిపురాణము కందము ౪-వ పాదమున పరోక్ష శబ్దమునకు అచ్చుకు గూఢస్వరయతి ప్రయోగము లక్ష్యము.

క. శిక్షణము ధృతియు నాప
ద్రక్షణమును జేయు తల్లిదండ్రులు నను ప్ర
త్యక్షపు దైవములుండఁ బ
రోక్షపు దైవములఁ గొలుచు నలజడి యేలా ? 226

---

225. *మతియము రఘురాఘవ్యగారి దీపికయందె - అని అ. శి. వ్రాఁతప్రతి. ఇది దీపిక వ్రాఁతప్రతిలోఁ గానరాదు. (మద్రాసు ఓరియంటలు లైబ్రరీ. డి. 1319)

అన్యోన్య శబ్దమునకు పెద్దిరాజు అలంకారము ఉత్పలము ౩-వ చరణమున ౪-వ అడుగునను, గూఢస్వరయతి ప్రయోగము లక్ష్యము. [కావ్య. చూడా. 7-68]

ఉ. ధన్యుఁడు విశ్వభూవిభుఁడు ధారుణినేలఁగ భూజనంబు ల
న్యోన్య హితత్వ సంపదల నొందిరి, దంపతులింపునింప న
న్యోన్య సుఖానుకూలతలఁ గోమిరి, విప్రులు వేల్పుఁబిండు న
న్యోన్య సుపుష్టితుష్టికుశలాదులఁజెందిరి నాఁడు నాఁటికిన్. 227

ఇఁక నందు, (17) వ్యంజనస్వరయతి లక్షణము

తే. వ్యంజన స్వరమున నధికాదులైన
హల్లులందులఁ బైస్వరమందెనేని
యదియు దా వ్యంజన స్వరయతి యనఁజను
వ్యంజన స్వరయతిభేద మదియు కృష్ణ! 228

అనంతనగారు [ఛందోదర్పణము. 1-91]

క. స్వరములు కాదుల నొందిన
నరయఁగ స్వరయతులె నిలుచుఁ బ్రాములఁగాకా
స్వరముల నిత్యసమాసా
క్షరసంధుల రెండునగు భుజంగమ శయనా! 229

భీమనగారు, కందము ౨-వ పాదమున వ్యంజన స్వరయతి ప్రయోగము లక్ష్యము.

... ... ... ... ...

(సోమయాజి భీష్మపర్వము ఉత్పలము ౨-వ పాదమున వ్యంజన స్వర యతి ప్రయోగము లక్ష్యము.) [1-71]

ఉ. ప్రాంశుపయోదనీలతనుభాసితు నుజ్జ్వల దండధారుఁ బిం
గాంశు జటాచ్ఛటాభరణు నాగమపుంజ పదార్థతత్త్వని
స్సంశయకారుఁ గృష్ణమృగచర్మకృతాంబరకృత్యు భారతీ
వంశవివర్ధనుం ద్రిదశవందితు సాత్యవతేయుఁ గొల్చెదన్. 230

*భాస్కరుఁడు రామాయణము కందము ౨-వ పాదమున వ్యంజన స్వర యతి ప్రయోగము లక్ష్యము.

క. ఓ కాకుత్థ్సపతీ నీ
కాకపివరుతోడి సఖ్యమర్హము సుమ్మా
నాకుం దోఁచిన విధమిది
నీకార్యంబతఁడె తీర్చు నిక్కము కడిమిన్. అన్నారు. 231

వ. ఇది వ్యంజన స్వరయతి ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు. 232

## (18) ఋత్వయతి లక్షణము

తే. గరిమ స్వరరూపమైన ఋకారమునకు
రేఫతోఁగూడ వడి యొనరించిరేని
ఋత్వయతియన నదియొప్పుఁ గృతులయందు
ఋషిమనోంబుజ మత్తద్విరేఫ కృష్ణ! 233
చిత్రపు భీమన్నగారు —

క. అచ్చులలోని ఋకారం
బచ్చుపడన్ రేఫతోడ ననువైన యెడన్
బెచ్చెర వడిగా నిలుపుట
పొచ్చెము గా దావికావ్యముల మున్నునికిన్. 234
అనంతన్నగారు. [ఛందోదర్పణము. 1.87]

తే. క్షితి ఋకారరూప స్వరయతులు జరుగు
ఋగ్యజుస్సామ వినుతుండు కృష్ణుఁడనఁగ
వృష్ణికులజుండు కరుణాసమృద్ధుఁడనఁగ
హేమపీతాంబరుఁడు దేవ[1]వృషభుఁడనఁగ. 235
కవికంఠపాశమున చంపకము ౧-వ పాదమున రెండవ చరణమునను ఋత్వయతిన్ని నాల్గవ పాదమున రివడికిన్ని ప్రయోగము లక్ష్యము.

---

231. * ఈ పద్యము నేఁటి ముద్రిత భాస్కరరామాయణమున మృగ్యము.
235. [1] ఋషభ (ఆ. శి. వ్రాఁతప్రతి).

చ. *కృతిపతి నామ[1]తార (గణ) ఋక్షములంగల రెంటియందుఁ ద
త్కృతిముఖపద్య ముఖ్యగణ ఋక్షమునన్ మెలఁగంగఁజూచు త
త్కృతి ముఖమైన పద్యమునఁ గీలితవర్ణము తారఁ బొందుత
త్కృతిపతినామఋక్ష మురరీకృతభంగిగఁజెప్పు పెంపుగన్. 236

శబ్దశాసనుఁడు సభాపర్వము రాజసూయ యాగము పట్టున సీసము ౨-వ పాదమున ఋత్వయతి ప్రయోగము లక్ష్యము. [2-11]

సీ. ఈతని వృద్ధని యెఱిఁగి పూజించితే
వసుదేవుఁడుండంగ వసుమతీశ
ఋత్విజుండని విచారించి పూజించితే
ద్వైపాయనుండుండ ధర్మనియతి
[యాచార్యుఁడని వినయమునఁ బూజించితే
కృతమతుల్ ద్రోణుండుఁ గృపుఁడునుండ
భూనాథుఁడనియెడు బుద్ధిఁ బూజించితే
యాదవుల్ రాజులే యవనిమీఁదఁ

ఆ. బూజనీయులైన పురుషులలోపల
నెవ్వఁడయ్యెఁ గృష్ణుఁ డిట్టులేల
పూజ్యులయిన వారిఁ బూజింప నొల్లక
భీష్మపనుపుఁజేసి బేలవయితి.] 237

వరాహపురాణము గీతి ౧-వ పాదమున ఋత్వయతి ప్రయోగము లక్ష్యము. [5-10]

తే. ఋషికులైక వతంస నిస్స్పృహుఁడవైన
నిను విచారించకొని మేదినీజనావ
నానుభావ ధురంధరుఁడైన దుర్జ
యుని విచారించి దయతోడ నెనయవలయు. 238

236. *ఇందు ఋత్వయతికి, రివడికి రెంటికి లక్ష్యములు గలవు. ఋత్వయతి రివడి – ఇవి వేర్వేఱు యతిభేదములు. చూ. రివడి.
[1] తారతిని. (అ. శి. వ్రాఁతప్రతి).

మఱియు నందే కందము ౨-వ పాదమున ఋత్వయతి ప్రయోగము లక్ష్యము. [1-138]

క. మీరెఱిఁగినంత యెఱుఁగుదు
[1]నీరాజీవాక్షమహిమ - ఋషులార! వినం
గారా దిదిగో శ్రీమ
న్నారాయణుఁబోల వచ్చునా యెవ్వరికిన్. 239

వ. ఇవి ఋత్వయతి ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు 240

## (19) విభాగయతి లక్షణము

తే. సంఖ్య కొలఁదులు నొడివెడి శబ్దవితతి
పై విభాగోక్తి పరఁగు శబ్దముల తుద వి
ధించిన విభాగయతులు [1]రెండ్రేసి కృష్ణుఁ
డిదె కలికి మాడలిడు [2]జాలెఁడేసి యనఁగ. 241

మఱియు [అనంతన్నగారు. ఛందోదర్పణము. 1-121]

తే. సంఖ్యకును బరిమాణ సంజ్ఞలఁ దనర్చు
శబ్దములపై విభాగోక్తి సరణి సంఘ
టించు నప్పుడు యతులు రెండ్రేసియగు ను
పేంద్రుఁడిచ్చు నర్థము మోపెఁడేసి యనఁగ. 242

చిత్రకవి పెద్దనగారు [లక్షణసారసంగ్రహము. యతులు. 1-2]

---

239. [1]ఇది (ఏ - ఋలకు మైత్రి) అ. శిరోమణి మతమున సహజస్వరయతి యగును. ఋత్వయతిక్రిందఁ జెప్పుట సరిగాదు.

241. [1]విధించిన ... రెం*డేసి - ఇందు ఇంచులోని ఇకారమునకు యతిలోని ఏకారమునకు మైత్రి.

[2]జాలెఁడేసి - జాలె = వలవంటి సాలెములుంచు సంచి అని సూ. ని; జాలె + ఎఁడు = జాలెఁడు.

తే. సంఖ్యయందును బరిమాణసంజ్ఞసంఘ
టిల విభాగాఖ్య యతులు రెండ్రేసి యగుఁ గ
పీశ్వరుల కర్థమీ గంపెఁ డ్రేసి యనఁగ
భంజితాసుర సముదాయ! యాంజనేయ! 243

వ. ఇవి విభాగయతి ప్రయోగ లక్షణ లక్ష్యములు. ఇఁక నందు, 244

## (20) కాకుస్వర యతి లక్షణము

వ. కాకుస్వరయతియును వ్యంజన స్వరయతియును నొకవిధంబునై కానఁ బడును గావున తద్భేదంబులు వివరించెద; నందు కాకుస్వరయతి సంబోధ నాంత పరమయ్యును దీర్ఘవర్ణంబై స్వరముగాన్పించు నదియే కాకుస్వర యతి యగుఁగాని కాదులైన హల్లులపై స్వరమందిన అదియు కాకుస్వర యతి యనఁబడు, కాదులపై స్వరమందిన యది వ్యంజనస్వరయతియై సిద్ధంబగుఁ గావున నట్టి కాకుస్వరయతికి లక్షణము, 245

అనంతనగారు. [ఛందోదర్పణము. 1-97]

తే. వరుస దీర్ఘాంత సంబుద్ధి వచన [1]రచన
కమరుఁ గాకుస్వర [2]విరామమై సహస్ర
నామశోభిత గోపకృష్ణాయనంగ
(నమర వందిత గోప కృష్ణాయనంగ.) 246

వార్తాకవి రఘునాథయ్యగారు దీపికయందు [లక్షణదీపిక. 321]

తే. [1]తుదల దీర్ఘంబు లందినఁ దోఁచు నిడుద
[2]యచ్చు ప్రశ్న కాకుస్వరయతికి రెండు
వర్ణములు చెల్లు హరిఁ జూడవాలతాంగి
యతివ చూచితె లెస్సవాఁడా యనంగ. 247

---

246. [1]యతులు (ఛం. ద.)
[2]స్వరంబు పరమసహస్ర. (ఛం. ద.)

247. [1]తొలుత. (ల. శి. వ్రాఁతప్రతి).
[2]అచ్చు హల్లు కాకుస్వర. (ల. శి. వ్రాఁతప్రతి).

[*అనంతన్నగారు ఛందోదర్పణము 1-96]

ఆ ఏలదు కృష్ణయొఱుఁగవా నన్ను నిది తగ
వా విరుద్ధ భాషలాడనేల
లోననెట్టి యలుకలో నాఁగఁగాకుస్వ
రోక్తి తెంటఁజెల్లు నొగిధరిత్రి 248

వెండియు ననంతనగారు [ఛందోదర్పణము 1-95]

క కాకుస్వరయతి యగు నితఁ
డేకద జలనిధిని బవ్వడించె ననం బ్ర
న్నాకలిత దీర్ఘమున నితఁ
డేకవ్వడి రథము గడపె నిమ్మల ననఁగన్ 249

ఇందుకు ప్రయోగము సోమయాజి ఉద్యోగపర్వము కందము ౪-వ పాదమున కాకుస్వరయతి ప్రయోగము లక్ష్యము [2-250]

క నీచెప్పిన వీరలు ద్రో
ణాచార్యులు మొదలుగాఁగ నని కొల్లని వా
రైచన్నవారలం గని
యే చక్కంబెట్టు వాఁడ నే పాండవులన్ 250

భాస్కరరామాయణము కైకసి వాక్యము గీతి ౪-వ పాదమున కాకుస్వరయతి ప్రయోగము లక్ష్యము [యుద్ధ కాం 156]

ఆ అన్ననీవు బుద్ధులన్నకుఁ జెప్పుదు
నన్నమాటచేను విన్నఁగోలె
పొగులుచున్నదాన మొగమొప్పకున్నది
యేమి తెలుఁగుఁ జెప్పవే కుమార! 251

శ్రీనాథుఁడు నైషధము శార్దూలము ౪-వ పాదమున కాకుస్వరయతి ప్రయోగము లక్ష్యము [2-32]

248. *మతి యీరఘునాథయ్యగారు. (అ. శి. ప్రాఁత ప్రతి).

శా. కాలాంతఃపుర కామినీ కుచతటీ కస్తూరికా సౌరభ
శ్రీలుంటాకము చందనాచలతటీ శ్రీగంధసంపుష్పిత
వ్యాళస్ఫారఫణాకఠోరవిష నిశ్వాసాగ్నిపాణింధమం
బ్బేలా నాపయి దక్షిణానిలము పక్షీచేయు దాక్షిణ్యముఙా. 252

వ. ఒక్కొక్క దిక్కున ఈకాకుస్వరయతిన్ని ప్లుతయతిన్ని ఒక్కతీరుగాఁ గానఁబడు; నివి కాకుస్వరయతి ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు, 253

(21) సావర్ణ్యయతి లక్షణము – అందు సమ్మతులు

ఇందుకు సమ్మతులు - ఆంధ్రకవితాపితామహుఁడు ఆముక్తమాల్యద ఉత్పలము ౧-వ పాదమున ట - త వర్గులకు సావర్ణ్యయతి ప్రయోగము లక్ష్యము. [5-122]

ఉ. డిగ్గిన యంచదూఁడు కొని క్షీర వనేక్షువు వంకమీఁదుగా
నగ్గెడ పుల్లకేసరము [నందు వసింపఁగ నెక్కునూలిను
న్బ్రిగ్గమునం దనారత మరంద సర స్యరవిందగోష్ఠికిఙా
వెగ్గలమాడుతేంట్లు మరువింటికిఁబూనె గుణద్వయత్వముఙా.] 254

సోమయాజి ఉద్యోగపర్వము ఉత్పలము ౧-వ పాదమున త - ట వర్గులకు సావర్ణ్యయతి ప్రయోగము లక్ష్యము. [2-52]

ఉ. దక్కను రాజ్యమంచు నకటా యిటు దమ్మునిభాగమీక నీ
వెక్కడ మ్రింగఁజూచెద వదేటికి (దక్కను మీనులోలతఙా
గ్రక్కున నామిషంబుచవి గాలము మ్రింగినచాడ్పుసూవె యి
ట్లుక్కివుఁడైన నీకొడుకు నుల్లమునున్నటు లాడఁగూడునే.) 255

మఱియు సోమయాజి ద్రోణపర్వము, అభిమన్యువాక్యము, చంపకము ౪-వ పాదమున లక్ష్యము ద - ట లకు ప్రయోగము లక్ష్యము. [2-11]

చ. ఇదియొక పిన్నవాఁ డదరి యెక్కుడు మూఁకల క్రందుదోలెడుఙా
గదుపులవెబ్బు గోపకునికైవడినంచు జనుల్నుతింపఁ (జే
సెద వినిమామప్రీతి విలసిల్లఁగఁ దంద్రియు సంతసిల్లఁ) బె
ట్టిదుఁడగు కౌరవేంద్రునకు [1] దెప్పరమయ్యెడు భంగిఁబేర్చెదఙా. 256

256, [1] దెప్పరః (సంశో. భా.)

మఱియును సోమయాజి ద్రోణపర్వము ద - ద్క్ష లకు సావర్ణ్యయతి ప్రయోగము చంపకము ౩-వ పాదమున లక్ష్యము. (1-109)

చ. అకట యజాతశత్రుఁడను నప్పలు కిప్పుడు నిక్కమయ్యెవా
నికిఁ గురునాథ! యిట్టులతనిం దెగఁజూచుట [1]గోరకాజి నొ
డ్డి కొనఁగఁ గోరితి విధము [2]దెప్పరమెంతయు నీతెఱంగు గో
ర్కికిఁ గతమేమొ పాండవులగెల్చి ధర న్నగమీఁ దలంచితే. 257

మఱియు సోమయాజి విరాటపర్వము ధర్మరాజ వాక్యము. ఉత్పలము ౩-వ పాదమున ద - డ లకు యతిప్రయోగము లక్ష్యము. [1-92]

ఉ. ఒప్పెడు మేనుఁ బెంపుగల యుల్లము నాగరికంపుఁ జందముం
జెప్పక చూపకీతని విశేషముఁ దెల్పెడుఁ గొల్చుటెంతయుం
దెప్పర మేమిసేయుదుఁ గడింది విచారము పుట్టె, నెట్లితం
డప్పురి సంచరించునొకొ యన్యులెఱుంగక యుండునట్లుగన్. 258

ప్రబంధ పరమేశ్వరుఁడు ఆరణ్యపర్వము మత్తేభము ౩-వ పాదమున కవర్గ తవర్గులకు బిందు సావర్ణ్యయతి ప్రయోగము లక్ష్యము,

మ. *వెలఁదింగానక బోటులయ్యెడల నన్వేషించు రారాజు మం
జుల కుంజంబులఁ గమ్మపుప్పొడుల సంక్షోభించి కల్హార జా
గల దేశంబుల మాధురీ ఘుసృణకాంతారాటవీ క్షోణులన్
గల సు ...డిత చక్రచక్రముల సత్కాసారాంతరాంతమ్ములన్. 259

మఱియు నాంధ్రకవితాపితామహుఁడు మనుచరిత్ర శా. ౪-వ పాదమున బిందుసావర్ణ్యయతి ప్రయోగము లక్ష్యము. [1-55]

శా. శీలంబుం గులముం శమంబు దమముం జెల్వంబు లేఁబ్రాయముం
బోలంజూచి యితండు పాత్రుఁడని యేభూపాలుఁడీ వచ్చినన్
సాలగ్రామము మున్నుగాఁ గొనఁడు మాన్యక్షేత్రముల్ పెక్కు చం
దాలంబందు నొకప్పుడుం దఱుఁగదింటం బాఁడియుం బంటయున్. 260

257. [1]సారకాంతి. (ఆ. శి. వ్రాఁతప్రతి).
[2]దెప్పర. (సంశో. భా.)

259. *ఈపద్యము నేఁటి ముద్రితభారతమున నపూర్వము.

రాయన భాస్కరుని చాటువారి మత్తేభము ౨-వ పాదమున టవర్గ
తవర్గులకు బిందు సావర్ణ్యయతి ప్రయోగము లక్ష్యము

మ సరిజేసైరిపుడేల భాస్కరుల భాషారాధ! పుత్రా! వసుం
ధర నందొక్కఁడు మంత్రియయ్యె వినుకొండన్ రాయనామాత్య భా
స్కరుఁడో? యౌ, నయితే సహస్రకరశాఖల్లే, వదే యున్నవే
తిరమై దానముసేయుచో, రిపులహేతిన్వ్రేయుచో, వ్రాయుచో 261

శ్రీనాథుఁడు నైషధము, ఉత్పలము ౨-వ పాదమున టవర్గ తవర్గముల
కున్న సావర్ణ్యయతి ప్రయోగము లక్ష్యము [2-137]

ఉ రాకసుధాంశు మండలము రాహువు మ్రింగఁగఁ బట్టుచో
డీకొని వచ్చు దండధర దిక్పవమాన మదక్షిణానిలుం
గాక వియోగినీ కుసుమకార్ముకశృంగము వంగఁజేయు నీ
కీకరపంకజాతము రతీశ్వర! దక్షిణమైన నాఁటికిన్ 262

*సారసంగ్రహము —

క వర్గాక్షర విపరీత మ
వర్గల బిందు ప్రశస్త మనికిన తగుచో
వర్గములకు సావర్ణము
భర్గప్రణిపాతచరణ పంకజనాభా! 263

వ అన్నారు డిగ్గి - [దిగ్గి], డక్కెను - దక్కెను, డీకొని - దీకొని, అని యిట్లు రెండు ప్రయోగములు గలవని యందురు. రూఢి పదములు డిగ్గి, దక్కెను, డీకొని యనునివి ప్రశస్తముగా వాడికి పదములు ముఖ్యముగాఁ దెలియు నట్లగుబంజేసిన నిది సావర్ణ్యయతి ప్రయోగ లక్షణ లక్ష్యములు. ఇఁక, 264

## (22) అనుస్వారోష్మయతి లక్షణములు

తే శషసహలు నాఁగ నవని నూష్మలు దనర్చు
బిందుయుక్తమైన శషసలఁ బెనఁచి యిడిన

---

263 *ఛందస్సారసంగ్రహము కానోపును.

నవి గృతుల ననుస్వారోష్మయతులనంగఁ
దనరు నూష్మల నాల్గింటఁ బెనుపఁగృష్ణ! 265

ఉదాహరణము —

తే. *శరధి నిభగాత్ర వినుత [1]సంగత చరిత్ర
సర్వగీర్వాణ మిత్ర పంకజ[2](వి) నేత్ర
హంస వంశ పవిత్ర సంభరిత గోత్ర
యనఁగఁదగు ననుస్వారోష్మయతులు కృష్ణ 266

ఛందస్సార సంగ్రహమున —

క. మిగుల ననుస్వారోష్మల
కగువళ్లు ఘటింప శషసహలు మాలతుకన్
బిగిగొని బిందువు గూర్పం
దగునది మవిరామ మసుర సమర విరామా! అన్నారు. 267

లక్ష్యము రామాయణము ౩-వ పాదమున సవర్ణమునకు అనుస్వారోష్మ యతి ప్రయోగము.

మ. సమరాగ్రమ్మున రాముఁడమ్ముఁదొడిగెన్ జాపంబునన్నాటిగా
నమరారిద్రుమరాజ దావదహన వ్యాలోల కీలచ్ఛటా
సమరోషోగ్రకషాయితేక్షణము[1]లం బ్రధ్వస్తదిక్పాలుఁ బం
క్తిముఖున్ దుర్విరసాభిదానమదసంకేతంబు లక్షించుచున్. 268

---

266. *ఈ యనుస్వారయతిమైత్రీ విశేషమునుగూర్చి పీఠికను చూచునది.
[1]సంకత (అ. శి. వ్రాఁతప్రతి).
[2]వినేత్ర. (అ. శి. వ్రాఁతప్రతి).

268. [1]అస్ఖ్రిధ్వస్త. (అ. శి. వ్రాఁతప్రతి).
*ఈ పద్యము నేఁటి ముద్రిత భాస్కరరామాయణమున మృగ్యము. లక్షణశిరోమణికిఁ బూర్వికములైన కవిచింతామణి, లక్షణదీపిక, ఆంధ్ర ప్రయోగ రత్నాకరము పై పద్యమును రామాయణములోనిదిగ నుదాహరించినవి. అందలి పాఠములెల్ల భిన్నభిన్నములై పొంది పొసఁగకున్నవి.

వ. అన్నారు. ఇవి అనుస్వారోష్మయతి ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు, 269

(23) *చుత్వానునాసిక యతిలక్షణము

తే. మత్ త్వత్ భవత్ యుష్మదస్మద్యత్ తత్ (?)
ఇవియు యుష్మదస్మ ద్విధములను గృతుల (?)
చజల ననునాసికల సంధి సంఘటింప
నవియె చుత్వానునాసిక యతులు కృష్ణ! 270

ఉదాహరణము —

తే. తలమె బ్రహ్మాదులకు నుద్వచ్చరణ మహిమ
దలఁప నేరికిఁ దీఱు మజ్జనక! సంత
తమును భజించుయింతునే భవచ్చరితలనిన
నటులు చుత్వానునాసిక యతులు కృష్ణ! 271

చుత్వానునాసిక యతిప్రయోగము లక్ష్యము. ఛందస్సారసంగ్రహమున —

తే. యుష్మదస్మత్ప్రకారమై యొనరు విరతి
చుత్వమనునాసికము పూనుచో ఘటింప
ధాత్రి నుభయము కృష్ణ మన్మానసాబ్జ
ధామమున నిల్పికొల్తుఁ ద్వచ్చరణమనఁగ. అన్నారు. 272

ఇందుకు శాకుంతలము కందము ౨-వ పాదమున లక్ష్యము.

.... .... .... .... ....

(24) ఆదేశయతి

మఱియు నాక శబ్దమునకు *గౌరన ఉత్పలము ౪-వ పాదమున ఆదేశయతి ప్రయోగము హల్లులకు లక్ష్యము.

---

*ఋచుత్వానునాసిక (ల. శి. వ్రాఁతప్రతి) 270, 271, 272. పద్యముల లోను వ్రాఁతప్రతులందు 'ఋత్వ' అనియే లిఖితమై యున్నది. (చూ. పీఠిక)

(?) ప్రథమపాదమున గణభంగము. ద్వితీయపాదమున యతిభంగము.

273. *ఇది గౌరన చాటుధార. (అప్ప. 3-158).

ఉ. ప్రాకటదర్పులై సకలరాయని లక్కనృపాలునాజిలోఁ
దాఁకు విరోధి సైన్యము ముదంబొదవ న్వరియింప వచ్చుచొ
నాకసమెల్ల నందుకొను నంచిత దివ్యవిమాన సంచర
న్నాక విలాసినీ చరణ హంసక భూరి ఝణంఝణధ్వనుల్ 273

ముద్దరాజు రామభద్రయ్యగారు కవిలోకసంజీవని యందు ఆదేశయతి ప్రయోగము

మ. *కృతలం గల్గిటఁజేఁ ద్వ్యేస్తరుపసర్గేభ్యోప ఈత్ప్రక్రియా
న్వితులౌటన్ యతు లచ్చు హల్లులసగన్ ద్వీపాంతరీపంబులన్
హితుఁడై ధర్మజుఁ బ్రోచి జాంబవమహాద్వీపంబొసంగెం గురు
క్షితిపవ్రాతము నేపడంచె గుణరోచిష్ణుండు కృష్ణుండనన్ 274

వ. ఒక్కొక్కదిక్కున ఈ ఆదేశయతి నిత్యసమాసయతి అఖండయతిన్ని ఈ మూఁడున్ను ఒక్కరీతిగా కనఁబడును రఘునాథయ్యగారు ఆదేశయతి నిత్యసమాసయతిలో భేదమగుఁ గనుక నాకశబ్దము అఖండయతి యనవచ్చు నన్నారు ఇవి ఆదేశయతి ప్రయోగలక్షణ లక్ష్యములు ఇఁక నందు, 275

(25) ప్రాసయతి లక్షణప్రయోగ లక్ష్యములు

తే. పదములను సీసముల గీతపద్యములను
వృత్తములలోన నొక కొన్ని వృత్తభేద
ముల లయగ్రాహి రగడల నిలుపఁగాని
యితరములఁ జెల్లదిడఁ బ్రాసయతులు కృష్ణ! 276

వ. ప్రాసయతి యనునది - యిరువది ప్రాసభేదము(లు) సమనామ విషమ మొదలుగాఁ బ్రాసమ్ములు పదగీత సీసమ్ములయందును ఉపరివృత్తాదులలో లయగ్రాహి మొదఁగు కొన్నివృత్తములను రగడభేదములను,

---

౨ ప్రాకటవర్గులై (అ శి వ్రాఁతప్రతి)

274. * ఈ పద్యము కోఁటి ముద్రిత క జ, సం అందు లుప్తము.

మఱియు సమవృత్తభేదములలోఁ గొన్ని వృత్తంబులను బ్రాసయతి చెల్లు నింతియేకాని తక్కినవానియందు ప్రాసయతులు చెల్లకుండుటను బ్రసిద్ధంబు లగు నిది ప్రాసయతి లక్షణము. ఇఁక నందు, 277

## (26) వికల్పయతి లక్షణము

తే. హల్లులందు [1]హకారంబునందు సంధిఁ
జేసిన వికల్పయతి (యనఁ) జెల్లు జ ఞ ణ
నమలనఁగ గల్గు ననునాసికములు గూర్చు
నదియె యనునాసిక వికల్పమయ్యెఁ గృష్ణ! 278

వ. మఱియును, 279

తే. హయుతమైనట్టి హల్లులయందు మఱియుఁ
గాక బిందువుతోడి జకారమునకుఁ
గలిసి యొక్కొక తఱిని వికల్పయతులు
దనరు నాదిమకవి సమ్మతమునఁ గృష్ణ! 280

అనంతనగారు [ఛందోదర్పణము. 1-124]

తే. హయుత వర్గహల్లు వికల్పయతుల జరుగు
దేవకీనందనుఁడు జగద్ధితుఁ డనంగ
హలధరుఁడు సంగరాంగణోద్ధతుఁ డనంగ
నవనిమోచినయవి కకుబ్భాస్తులనఁగ. 281

చిత్రకవి పెద్దనగారు. [లక్షణసారగ్రహము. యతులు. 1-11]

తే. సంధులను రెండు రూపముల్ జరుగు వర్ణ
మున వికల్పాక్షర యతులు దనరుఁ గృతుల
తలఁపు హరిపైన నిడిన సన్మతివి యనిన
భంజితాసురసముదాయ! యాంజనేయ! 282

---

278. [1]వకారంబు (అ. శి. వ్రాఁతప్రతి).

### జకారమునకు వికల్పయతి లక్షణము

[*ఛందోదర్పణము. 1-125]

తే. నలిజకార హ ల్లితరానునాసికాఖ్యఁ
గదిసి తత్పంచమముగా వికల్ప యతులఁ
గలుగుఁ జక్రి వల్లవసుదృగ్జ్ఞదనుఁడనఁగఁ
గమలనేత్రుఁడు సకల దిగ్జ్ఞహితుఁడనఁగ. 283

ఇందుకు సోమయాజి శాంతిపర్వము, కందము ౩-వ పాదమున జకారమునకు వికల్పయతి ప్రయోగము లక్ష్యము. [5-90]

క. జ్ఞానంబు వడయుటకు వా
జ్మానసములు సునియతములు గావింతు రొగి
న్మానితశాంతికొఱకు సు
జ్ఞానంబున నాత్మనియతి సలుపుదురు బుధుల్. 284

వ. ఈ వికల్పయతిన్ని, ఉభయయతిన్ని, జ్ఞయతిన్ని ఒక్కొక్కచిక్కున ఒక రీతిగాఁ గనఁబడును. ఇవి వికల్పయతి ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు, 285

### (27) ప్రభునామయతి లక్షణము

తే. ఏకశబ్దంబె ద్వివిధమై యూఁదఁబడక
యూఁదఁబడియున్న తెఱఁగున నొనరుఁగృతుల
విరతి పదములఁ బ్రభునామ విరమణంబు;
వీనిలక్ష్యంబు తేట గావింతుఁ గృష్ణ: 286

తే. అవనినాథుఁడు గోపకృష్ణయ యనంగ
జలజనేత్రుఁడు గోపకృష్ణయ యనంగ
అతనిపామేను రాము,*మాయమ యనంగ
హరికి గారాపురాశి *మాయమ్మ యనఁగ. 287

---

283. *వార్తాకవి రసు నాథ వ్యాగాను దీపక యందు (అ. తి. వ్రాఁతప్రతి).
287. *ఈ యాఁకు, నాలుగు పాదములలోని ప్రభునామయతికి లక్ష్యములు కాఁజాలవు.

వ. మఱియును, 288

తే. అహిగిరి నివాసుఁడవని వెంగన్న యనఁగ
గరుడగమనుఁడు పుడమి వెంగన యనంగ
కలిమి కల యలమేలు మంగమ్మ యనఁగ
అరయ సిరి యలమేలు మంగమ యనంగ 289

అనంతన్నగారు. [ఛందోదర్పణము. 1-120]

తే. ఒరుల నన్నమయనుచోట నూఁదఁబడక
ద్వివిధముగఁజెల్లుఁ బ్రభురామ విరమణంబు
మహిన యోధ్యకు రాజు రాముఁడ యనంగ
నతని పట్టపుదేవి సీతయ యనంగ. 290

వ. ఇది ప్రభురామయతి లక్షణము. 291

(28) [సంయుక్తయతి లక్షణము]

తే. (క)షల సంయుక్తికాక్షర గణన నొంది
[1](చఛజఝల కఖగఘల శషసలనందు)
కియ్యవచ్చు నక్రారయు గిలుక పలుకఁ
బడిన సంయుక్తయతుల కాస్పదము కృష్ణ! 292

భీమనగారు [కవిజనాశ్రయము సంజ్ఞ. 71. అథర్వుని]

క. వెలయఁగ సంయుక్తాక్షర
ములలో నేవానినైన మునుకొని వడిగా
నిలుపఁదగుం బాదమ్ముల
నలఘుపరాక్రముఁడ! దేవ! యరవృశ విభవా! అన్నాఁడు. 293

వార్తాకవి రఘునాథయ్యగారు దీపికయందు —

క. వసుమతి కషయోగజమై
యెసఁగిన క్షతోడి యతికి నెనయును శషసల్

292. [1]నజల కబలాలిగా పొల్లునందు నోతు. (ల. శి. వ్రాఁతప్రతి).

వసగల కఖగఘ చఛ(జ)ఝ
(ల)స దృశగతి నాదికవుల యనుమతి వలన౯ 294

వ మఱియును, 295

[*ఛందోదర్పణము 1-110]

క వడి నెలవులలోఁ జేరుప
యెడ నొకసంయుతమునొలయెడ నొకటినిఁ దా
రిడిరేని కవులు తప్పుట
యొడఁబడదు పృథగ్యతి ప్రయోగముల హరీ! 296

[ఛందోదర్పణము 1-109]

ఆ ఒక్కడుగున విశ్రాంతులు
పెక్కుడుచో సంయుతములు పెనుపకమును జ
డ్డక్కరమునఁ దానెత్తిన
యక్కరమే యనుపవలయు నన్నిటను హరీ! 297

[1]లక్ష్యము శ్రీరంగమహత్త్వము రగడ సంయుక్తమైన క్షకారమునకు ప్రయోగము [ఛందోదర్పణము 1-111]

క్ష్మావలయమంతయు విషాణముననెత్తు కిటి
మహామదిలపోయ నక్కజ మనుచు నిట్లిడక
క్ష్మావలయమంతయు విషాణముననెత్తుకిటి
సత్త్వమధుదన నొప్పు సంయుక్తవడి చెడక. 298

---

296. *దీపికయందే (ల శ వ్రాఁతప్రతి)

298 [1]ద్విరదగతిరగడ కుదాహరణముగ ఛందోదర్పణమున నీపద్యము కలదు [1-111] అనంతుఁడు స్వీయలక్ష్యములనే యొసఁగెను కాని యితరులవి గ్రహింపలేదు మఱి యీ పద్యము సంయుక్తయతి లక్ష్యలక్షణములఁ దెలుపుచున్నది కాన నిది శ్రీరంగమహత్త్వములోనిది కాఁ జేరదు.

*మఱియు నొకరగడ లక్ష్యము [ఛందోదర్పణము 1-112]

రంపముల వ్రచ్చుగతి వ్రచ్చె నఖముల రిపుని
వక్షము నృసింహుండన రావడియుఁ [1]జోరదుకృతి
ఱంపముల వ్రచ్చుగతి వ్రచ్చెనఖముల రిపును
రమ్ము నరసింహుఁ డన[2]వ్రాయ సంయుక్తయతి 299

భాస్కరుఁడు రామాయణము శా. [1]౪-వ పాదమున సంయుక్తయతి ప్రయోగము లక్ష్యము [యుద్ధకాం. 79]

శా. రక్షోనాయక మమ్ముమిమ్ము సచివవ్రాతంబు నీసేనల
న్రక్షింప న్వలతేని పుచ్చుమరల న్వైదేహి నీవెన్నినా
జిక్షోణి స్థలినల్పుఁడే [2]ఖరుఁడు ప్రస్ఫీతోగ్ర [3]కీలామరు
త్ప్రేక్షంబైన రఘుక్షితీశ శరవహ్నిం ద్రోపు గంటేగదా! 300

వ. ఇవి సంయుక్తయతి లక్షణప్రయోగ లక్ష్యములు ఇఁక నంత్య, 301

---

299 *"అట్లు మఱియొక విధంబగు రగడ" అని అనంతుఁడు దీని నుదాహరించెను (ఛం. ద 1-112).

[1]సొంపగుఁగృతి (అ శి వ్రాఁతప్రతి).

[2]గ్రాలు. (ఛం ద)

300 ఇందు నాలుగు పాదములందును సంయుక్తయతులు గలవు.

300 [2]పరుఁడు (అ శి వ్రాఁతప్రతి)

[3]కీలానల, ప్రేక్షంబైన (అ శి. వ్రాఁతప్రతి) ఈ పాఠమును గ్రహించిన "ప్రేక్ష్యంబైన" అను రూప ముండవలెనని వచ్చును. అప్పుడును ప్రాసభంగమగును ను, దుస్సులకు పరమైన ధాతువునకు యప్రత్యయము రాదు. దుర్ + ఉత్ప్రేక్ష్య = దురుత్ప్రేక్ష. కాన దురుత్ప్రేక్షమును పాఠము సమీచీనము.

(29) శకంధుయతి లక్షణము

తే ప్రౌఢకవు ల(చ్చు) హల్లులు భవ్యకావ్య
ములఁ బ్రయోగింతు రొకతఱి ముఖ్యకృతుల
యతులు చెల్లుటఁజేసి వేదండ వరద
([1]యవి శకంధ్వాది గణయతులగును గృష్ణ!) 302

వ అట్టి శకంధు గణశబ్దంబులెట్టి వంటేని, 303

సీ గణుతింపఁగ శకంధు కర్కంధు లాంగలీ
షాహలీ షా (మనీషలు నలక్త)
కులటాపతంజలి కుద్దాలకుత్కీల
సారంగసీమంత నారికేళ
మందారవేదండ మార్తాండ కర్పటి
ద్వీపాంతరీప ప్రతీప నాక
మంజీర కోష్ణిష మస్తిష్క ముఖములౌ
శబ్దంబులు శకంధు సంజ్ఞకములు

తే తనరునిందులఁ గొన్నిశబ్దము లఖండ
యతులు నిత్యసమాసంబు లంద్రుగృతుల
విరతు లొనరించుచోటఁ గవీంద్రులరయ
ధరశకంధ్వాది గణముల కరణిఁగృష్ణ! 304

మఱియు నిందు కుదాహరణము —

సీ అరయఁగా సిరికి మందారదామముచేత
దయమీఱభక్త మందారుఁడనఁగ
ఇందిరారమణు మనీషనర్చింతురు
నిరతంబు భక్తి మనీషులనఁగ
ఇష్టసిద్ధికి నారికేళార్పణం బా(ఖు)
క్షేత(మున కు నారికేళమనఁగ

302, [1]యును శకంధ్వాది గణయతులనఁగఁగృష్ణ! (అ. శ. ప్రాఁత ప్రతి).

అభవుఁడు వితత సారంగ చర్మాంబర
రతుఁడన భరితసారంగుఁడనఁగ

తే. ఈశ్వరుఁడు దాల్చెమంజు మంజీర మొకటి
జితదితిసుతుండు వేదమంజీరుఁడనఁగ
నవని నిట్లు శకంధ్వాది యతులు కృతుల
నచ్చునకు హల్లునకుఁ జెల్లునండ్రు కృష్ణ! 305

[*కవిచింతామణి 3-24]

సీ. అరయ శకంధు కర్కంధు సీమంత మ
[1]నీషలుఁ బెరసి హలీషలవట
కుత్కల లాంగలీ షోష్ణీషకులటలు
తెలియమంజీర మస్తిష్కములును
పరఁగంగఁ గుద్దాల [2]ప(ర్కటా)లక్తకం
బాదిగా నివి శకంధ్వాది గణము
మఱియు వేదండమ్ముఁ మందారనాకముల్
ద్వీపాంతరీప ప్రతీపములును

తే. నారికేళము లివియాదిగా [3]రసజ్ఞ
లన్వితములును, నిత్యషమాసములు, న
ఖండములునన వడులొప్పుఁ [4]గావ్యవశత
దగ్గరించిన స్వరమఖండంబుగాదు. 306

మఱియు నందే శకంధుయతి ప్రయోగము లక్ష్యము, [కవిచింతామణి 3-26]

306. *'లక్షణసారము - లింగముగుంట రామన్నగారు' అని అ. శి. వ్రాఁత ప్రతి. 306, 307 కవిచింతామణిలోనివి.

[1]'నీష పతంజలి హాలీష అవట' అను అ. శి. పాదమున గణభంగము.

[2]పర్కటా లక్తకము. (కా.)

[3]గాఁగ సంజ్ఞ (అ. శి. వ్రాఁతప్రతి, యతిభంగము).

[4]గావ్యమమర. (అ. శి. వ్రాఁత. ప్రతి.)

సీ.-కుత్కీల కన్యక కుడురాజధరుఁడిచ్చెఁ
గుత్కీల మంజులకుంజ విహృతి
హిమభూమి భర్త కుక్షీషంబు గంగగ్రొ
న్నెలపువ్వు పన్నగోక్షిష(¹తల)కు
(నిర్జరాచార్య మనీషమించిన యామ
నీషి వాగ్వైఖరు లెన్ననేల)
హరిరాణి పదము సీమంతినీ నివహా సీ
మంత్ర రేఖాధార్య మణి విశేష

తే. మెద్దిసరివచ్చు జాంబవద్వీపమునకు
వివిధ వస్తుచయంబు లీద్వీపమందె
నాకపతి తమ్మునిం దనయాత్మఁదలఁచు
నరుల కబ్బును గొబ్బున నాకసుఖము 307

ముద్దరాజు రామభద్రయ్యగారు కవిలోకసంజీవనియందు. [1-55]

తే. స్వాంత వేదండ మార్తాండ శబ్దములకు
యతులు నుభయంబునగు బుధస్వాంతములకు
అతిసుఖావహుఁడెపుడు వేదండ వరదుఁ
డనఁగ హరిదైత్య తిమిర మార్తాండుఁడనఁగ 308

చిత్రకవి పెద్దనగారు [లక్షణసారసంగ్రహము యతులు 1-24]

తే. అలశకంద్వాది గణమున కచ్చుహల్లు
యతులొనర్తురు సుకవి వేదండ రచిత
నిఖిల కృతులను జూచి మనీషివరులు
భంజితాసురసముదాయ ! యాంజనేయ ! 309

---

307 ¹అరవ (అ శి వ్రాఁతప్రతి)

శబ్దశాసనుఁడు ఆదిపర్వము [1]ఆశ్వాసగర్భము మత్తకోకిలలో ౪-వ పాదమున వేదండ శబ్దమునకు శకంధుయతి హల్లుకు ప్రయోగము లక్ష్యము [3 228]

మత్తకోకిల దండితాహితవీర ! సూరినిధాన ! దానవినోద ! కో
దండపార్థ ! పరాక్రమప్రియధామ ! దిక్పరిపూరితా
ఖండ పాండుయశోనిధీ ! పరగండభైరవ ! వైరివే
దండ గండ విదారి ఘోరతరాపి భూరిభుజార్గళా ! 310

సోమయాజి విరాటపర్వము స్వాంత శబ్దమునకు ఉదాహరణము - ఉత్పలము ౧-వ పాదమునను హల్లులకు శకంధుయతి ప్రయోగ లక్ష్యము [2-331]

ఉ స్వాంతము బాహుగర్వఘనసంతమసాంధముగాఁగ శంకయా
వంతయులేక కీచకుఁడ హంకృతి ముంగలిగాఁగ మండపా
భ్యంతరసీమఁజొచ్చి తఱియంజని యారసి సెజ్జఁగాంచి య
త్యంతముదావహంబగుడు నంతరయంబునఁ గేలుసాఁపఁగఁ 311

ఈ స్వాంత శబ్దమునకు శ్రీనాథుఁడు నైషధము గీతి ౧-వ పాదమున అచ్చునకు శకంధుయతి ప్రయోగము లక్ష్యము [2-82]

తే అధికరోషకషాయితస్వాంతుఁడైన
నరపతికి విన్నవింపకు నాయవస్థ
పైత్యదోషోచ్చయంబునఁ బరుసనైన
జిహ్వకును బంచదారయుఁ జేఁదుగాదె. 312

మఱియు నీ స్వాంత శబ్దమునకే [1]షష్ఠంలో ఉత్పలము ౩-వ పాదమున అచ్చుకు శకంధుయతి ప్రయోగము లక్ష్యము

310. [1]ఆశ్వాసగర్భమున ఆశ్వాసాంతమని కవి భావము కానోపును

313 [1]శృంగారషష్ఠమని స. ల. సా సం. 2-262 దీనినే కవుల షష్ఠమని లాక్షణికులు వ్యవహరించిరి.

ఉ సంతత భక్తియుక్తి కొనసాఁగకయుండిననుండ నిమ్ము దై-
త్యాంతక పాదపద్మముల(యందు) నొకానొకయప్పుడే నిజ
స్వాంతము తద్గుణాభి²నుతుఁడై నరుఁడెప్పుడు గీలుకొల్పువాఁ
³డంతక తద్భటాకలననైనను జూడఁడు భూవరోత్తమా! 313

మఱియు నందే మత్తేభము, ౧-వ పాదమున శకంధుయతి ప్రయోగము 'స్వాంత' శబ్దమునకు అచ్చుకు లక్ష్యము

మ అని యీ విద్యగురుప్రపన్నుఁడు పృథు స్వాంతుండునౌ చిత్రకే
తు నృపాలాగ్రణికిచ్చి నారదమునీంద్రుం డంగిరోయుక్తుఁడై
చనియెఁ బంకజగర్భగేహమున కాసర్వంసహాభర్తదా
(నినుపాసించి) చరించెనేకశహముల విద్యాధరా దక్షతన్. 314

'మార్తాండ' శబ్దమునకు సోమయాజి ద్రోణపర్వము మత్తేభము ౧-వ పాదమున హల్లుకు శకంధుయతి ప్రయోగము లక్ష్యము [5-378]

మ ధరణీచక్రము దిర్దిరందిరిగె మార్తాండుండు కుంఠీభవ
త్కిరణుండయ్యె దిశావితానము వడంకె న్వి¹న్న దల్చెన్మహీ
ధర సంతానముకోలి గ్రక్కదలె నుద్భ్రాంతంబులై యంబుధుల్
వారలెం గట్టులమీఁదఁ ²జేయిఁడుగుర్ మ్రోసె న్మహోగ్రంబుగన్ 315

మఱియు నీమార్తాండ శబ్దమునకే షష్ఠంలో గీతి ౪-వ పాదమున అచ్చుకు శకంధుయతి ప్రయోగము లక్ష్యము

తే వఱవదు భయంబు వారెంత వారలైన
నట్టివారలు మనకర్హమైనవారు

---

313 ²రతుఁడై నరుఁడెవ్వఁడు (సు. ఆ సా. సం)
³డంతకుఁదద్భటాలిఁగలనైనను (సు. ఆ సా. సం)

314 ¹నినుభావించి (ఆ శ వ్రాఁత ప్రతి)

315 ¹మిన్నదిర్చెన్ (సం శో భా).
²బిట్టపిడుగు (సం శో భా)

వారు నిరయంబునకుఁ గాపునచ్చువార
లనుచు బుద్ధిగఁజెప్పె మార్తాండ[1]సుతుఁడు 316

మఱియు వేదండ శబ్దమునకు సోమయాజి భీష్మపర్వము - ఉత్పలము ౪-వ పాదమున హల్లుకు శకంధుయతి ప్రయోగము లక్ష్యము [1-234]

ఉ పాండు నృపాలనందనులుపావని మున్నుగ నేచియిట్లు భీ
ష్మండు కడంకమై నడచుచోటికిఁ జక్కటిగాఁగఁ ద్రోచియొం
డొండకడంగి సేనతన యుబ్బునకుబ్బఁగ నన్యసైన్య వే
దండముఖాంగముల్ తృణవితానముగాఁగొని నిర్వికారులై 317

వ అన్నారు ఇవి శకంధుయతి లక్షణప్రయోగ లక్ష్యము(లు) ఇఁక నందు, 318

## (30) యశవర్గద్వయయతి లక్షణము

తే యరలవశషసహల బిందులాదినిడక
యున్న యశవర్గయుతయతు లొప్పుఁగృతుల
యరలవలయందు శషసహాక్షరములందు
వాదిబిందుయుతములైమయతియుఁగృష్ణ! 319

శ్రీధరుఁడు —

క యశవర్గద్వయ యతికిన్
విశదముగఁ దదక్షరములు వెలయఁగ వనిలో
కుశలత లమరును సంపద
శశినోఁదలఁ దాల్చునతఁడు హరుఁడను మాడ్కిన్ 320

ఎఱ్ఱాప్రగడ అరణ్యపర్వము గీతి ౧-వ పాదమునకు యశవర్గద్వయ యతి ప్రయోగము లక్ష్యము,

తే *యతులతోఁగూడి యతులిత శ్రమముతోడ
లలితమైపొల్చు నొకసరోవరమదెంత

---

316 [1]నిభుఁడు (అ ఆ వ్రాఁతప్రతి).

321. *ఈపద్యము నేఁటి ముద్రిత భారత ప్రతులందుఁ గానరాదు దీని తీరు నరయనిది యొక లక్షణగ్రంథములోనిదిగాఁ దోఁచుచున్నది.

రమణఁజూపుట విశ్రమస్థలమునందు
... ... ... ... ... .... ... 321

శబ్దశాసనుఁడు నన్నయభట్టు చంపకము ౨-వ పాదమున యశవర్గద్వయ యతి ప్రయోగము లక్ష్యము. [ఆది. 8-232]

చ. జలరుహనాభ రమ్యగిరి సానువనమ్ముల వేఁటలాడుచున్
[1]సలుపుద మీ నిదాఘ సమయమ్ముల నీవును నేను నెమ్మదిన్
(నలినరజస్సుగంధియమునాహ్రదతుంగతరంగసంగతా
నిలశిశిరస్థలాంతర వినిర్మితనిర్మల హర్మ్యరేఖలన్.) 322

వ. అన్నారు. ఇటువలెనే తెలియవలెను. ఇవి యశవర్గద్వయయతి ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు, 323

(31) చక్కటి యతి లక్షణము

తే. మునుల కథయంబులిడు పూర్వ పురుషుఁడనఁగ
మోక్షమీఁజాలు నీచతుర్భుజుఁడనంగ
మూఁడు మూర్తులు నీవంద్రు బుధులనంగ
మొనయుఁ జక్కటి యతు లతి స్ఫురణఁగృష్ణ! 324

[*సులక్షణసారము. వ. 101]

క. నిక్కంబుగ పుపుబుభులకుఁ
జక్కటి వడి యయ్యె శృంగ సహితమకారం
బక్కమల జాది దివిజుల
మ్రొక్కులు గైకొను సమస్త భువనాధీశా. 325

---

322. [1]జలుపుదమీ నిదాఘ దివసంబుల నీవును నేను నున్మిష — ఇది సం. శో. భా. పాఠము. ఇది సమయతి పాఠమగును. ఇందు అ. శి. లోని యశవర్గద్వయయతి పాఠము కానరాదు. (చూ. పీఠిక).

325. *“ అనంతనగారు ” అని అ. శి. వ్రాఁతప్రతి పాఠము.

వసంతవిలాసము - కందము ౪-వ పాదమున చక్కటియతి ప్రయోగము లక్ష్యము.

క. అత్తఱి విటనాగరికుల
చిత్తముల వసంతకేళి చిగురొత్తంగా
మొత్తముగఁ గట్టి తెచ్చిరి
ముత్తెపు ఝల్లరులతోడి బుఱ్ఱట కొమ్ముల్. 326

వ. ఇవి చక్కటియతి ప్రయోగ లక్ష్యములు. ఇఁక నంద్యు 327

(32) ఎక్కటి యతి లక్షణము

తే. మహిత మాయాచరిత్రుఁ డీ మాధవుండు
రక్కసులఁద్రుంచు యాదవరాజనంగ
లవణజలనిధి లోనుండు లంకనంగ
వఱలుఁజన నిట్టు లెక్కటివడులు కృష్ణ! 328

అనంతనగారు. [ఛందోదర్పణము. 1-118]

క. ధరనెక్కటి వళ్లె తగు
ళరమఱవలు వానిలోఁ [1](జెలంగును) లాకుఱా
సరి ళాయన విశ్రమపే
ళ రమాధిప రెండునుం గలసి వర్తించుఱా. 329

సోమయాజి ఆనుశాసనికము మత్తేభము ౧-వ పాదమున మకారమున కున్ను ఈ మూఁడింటికిన్ని ఎక్కటియతి ప్రయోగము లక్ష్యము. [1-44]

మ. మనువంశంబునఁబుట్టి సర్వజనతా మందారమైనేల యె
ల్లను బాలించి జగత్త్రయీప్రణుత లీలంబొల్చె దుర్యోధనుం
డను రాజద్విపుఁడొప్పు నర్మదకుఁగామావేశముఱా జేసినఱా
వనితారూపముదాల్చి పుచ్చెనతనిఱా వర్వర్థ మూహింపఁగఱా. 330

329. [1]దలంగక. (ల. ౪. వ్రాఁతప్రతి).

మఱియు మకారమునకుఁ బరతత్త్వరసాయనము చంపకము ౧-వ పాదమున ౨-వ చరణమున ౪-వ యడుగునను ఈ మూఁడంఘ్రులను మకార యెక్కటియతి ప్రయోగ లక్ష్యము

చ *ముదసలి గద్దియక్షరము ముక్షము వేల్పులలావు మేనిలో
మొదలి వెలుంగునెత్తి తుదమోవఁగుఁజేయుటచెర్చు జంత్ర మ
ఖ్యదిత తనూసరోజములనూనిన గాడ్పులయాటపట్టు సం
ముదమలరారఁగా ప్రణవమంత్రము మాకుఁ బ్రసన్నమయ్యెడుఁ 331

భీమనగారు కవిజనాశ్రయమను ఛందంబున కందము ౪-వ చరణమున రేఫకు ఎక్కటియతి ప్రయోగ లక్ష్యము [సంజ్ఞ ప 5]

క కడుఁ గవితా మహిమకుఁ దివి
[1]రెడుకవి కిచ్చదువు తెఱఁగెఱింగినఁగా కె
క్కడనుండి వచ్చు బెడఁగడ
రెడు కబ్బము సెప్ప నురు పరిజ్ఞానమిలన్ 332

వ అన్నాఁడు ఇవి యెక్కటియతి లక్షణ ప్రయోగ లక్ష్యములు ఇఁక నందు, 333

## (౩౮) పోలిక యతి లక్షణము

తే పోలు దేవర లీదైవమునకు సరియె
పోలు పురములు వైకుంఠమునకు సమమె
భువిని మఱి విద్యలు కవిత్వమునకు సరియె
యనెడి పోలిక పోలికయతులు కృష్ణ! 334

---

331 *ఈ పద్యము నేఁటి ముద్రిత పరతత్త్వరసాయనమునఁ గానరాదు (1941 Madras University Publication)

332 [1]ఇందు 'ర - ఱ' యతిమైత్రి కానవచ్చుచున్నది. పాఠాంతరము మృగ్యము.

[*భీమన కవిజనాశ్రయము. సంజ్ఞ. ప. 73]

క. పోలుఁగ పుఘుబుభులకు మూ
పోలికవడి శీలముల్లమున మోతురనఁగ
శీలమ్ము మలమ్మనఁగా
భూలోకంబమర లోకమున(కు) సమమనఁగ. 335

శబ్దశాసనుఁడు ఆదిపర్వము కందము ౪-వ పాదమున పోలికయతి ప్రయోగము లక్ష్యము. [2-38]

క. దారుణ కల్పాంత మరు
త్ప్రేరిత [1]హవ్యవహశిఖల పెల్లిదియని బృం
దారక ముని బృందస్తుతి
బోరనఁగా నగ్నిసూక్తములతో నెగసెఁగ. 336

మఱియు నందే కందము ౨-వ పాదమున పోలికయతి ప్రయోగము లక్ష్యము. [ఆది. 5-58]

క. ఎట్టి విశిష్టకులంబునఁ
బుట్టిన సదసద్వివేకములు గలిగియు ముఁగ
గట్టిన కర్మఫలమ్ములు
నెట్టన చొప్పడకయుండ నేర్తురె మనుజుల్. 337

మఱియు నందే కందము ౪-వ పాదమున పోలికయతి ప్రయోగము లక్ష్యము. [శాంతిపర్వము. 4-3]

క. రాజోచిత ధర్మంబుల
[1]యోజవిశదభ భంగిఁజెప్పి తుజ్జ్వల విలస

---

335. *"అనంతనగారు" అని ల. శి. వ్రాఁతప్రతి.

336. [1]హవ్యవహ శిఖాకలాప మిదిరో యని బృం. — అని ల. శి. వ్రాఁత ప్రతి. ఈ పాఠమును గ్రహించిన గణాధిక్యమగును.

338. [1]యోజనుదగు విశదభంగినుజ్జ్వల. (ల. శి. వ్రాఁతప్రతి).

త్తేజోధన నాకు సకల
భూజన వరమహిత ధర్మములు సెప్పు గృపన్. 338

[*కావ్యాలంకార చూడామణి] గీతి ४ పాదములను పోలికయతి ప్రయోగము లక్ష్యము. [7-46]

తే. పుడమి విశ్వవిభుని భుజమునకుఁ దొడవు
పుల్ల పద్మాలయ వితీర్ణమునకు టోటి
బుధులు విద్యావివేచనమునకు సాక్షి
భువనములు కీర్తికి నివాసములు దలంప. 339

వ. ఇవి పోలికయతి ప్రయోగము లక్ష్యములు. ఇఁక నందు, 340

(34) రివడి లక్షణము

తే. ఋత్వమును వఱువల్ వడిరీకినిడిన
గృతమహాకవి మతముల రివడి యదియు
... ... ... ... వలయేలు ఋత్వమునకు
నిడినవడి ఋత్వ(యతి) యనునిదియె కృష్ణ! (?) 341

వ. మఱియును, 342

తే. ... ... వఱువ లొండొంటి రీకి విరతి
గృతుల నిడఁజెల్లుఁ గవివ(రుల్) రివడి యనఁగ
మృతుల ధారాళియు మురారియే యనంగ (?)
ఋషనాథార్క నేత్రుఁడీ కృష్ణుఁడనఁగ. 343

అనంతనగారు [ఛందోదర్పణము. 1-87]

క. [1]వెలయంగ ఋకారము వ
ఱిలు రీవిరమణము శౌరి ఋషులకు శశ్వ

339. *ఆంధ్రభాషాభూషణమని. అ. శి. వ్రాఁతప్రతి.

344. [1]విలసద్రికారమును వ, ఱిల రీవిరమంబు (ఛం. ద.)

తప్పలభుండనఁగ ఇ, ఈ లకు
దలపఁగ రీతోడి విరతి [2]దలకొనదెందుఁ. 344

*వరాహపురాణము గీతిపాదమున [1]వ(ట్రువకు రివడి (ప్రయోగము లక్ష్యము.

గీ. పృథివి యిట్లను యజ్ఞమూర్తి స్తుతి (ప
కారమానతియిమ్మ భూదారవర్య
వినఁగవలెనన్న దేవుండు ఘనఘనా ఘ
నార్భటీ విస్ఫుటోక్తి నిట్లని వచించె. 345

అథర్వణాచార్యులు శార్దూలము ౨-వ పాదమున రివడి (ప్రయోగము లక్ష్యము.

శా. తృష్ణాతంతు నిబద్ధబుద్ధులగు [1]రాధేయాదులన్మించి (శ్రీ
కృష్ణంగేవల మర్త్యుఁగాఁ దలఁచి మర్దింపంగ నుత్సాహ వ
ర్ధిష్ణుండయ్యె [2]భవత్తనూజుఁడటు ధాత్రీనాథ యూహింపుమా
యుష్ణీషంబునఁగట్ట వచ్చునె మదవ్యాఘ్రోగ్ర శుండాలముఁ. 346

[*మనుచరిత్రము సీస.] ౪-వ పాదమున ఋకారమునకు రివడి (ప్రయోగము లక్ష్యము. [2-36]

సీ. (వదనప్రభూత ... ... ...)

---

[2]తలకొను సెందున్. (ల. శి. (వ్రాఁత(ప్రతి).

345. *ఈ పద్యము ము(ద్రిత వరాహపురాణమునఁ గానరాదు. ల. శి. (వ్రాఁత (ప్రతియం దపపాఠములతో నసమ(గముగనున్నది. తిరుపతి (ప్రా. వ. సంస్థలో హానుమచ్ఛందస్సునను సాధుపాఠ ముపలబ్ధము.

[1]వ(ట్రువునకు (ల. శి. (వ్రాఁత(ప్రతి).

346. [1]రాధేయాదులువ్వాచ్చి (స. ల. సా. సం. 2-224) రాధేయాదులున్ గూడి (రం. ఛం. 3-294).

[2]సుయోధనుండకట. (స. ల. సా. సం ; రం. ఛం.)

347. *వారాహపురాణము. (ల. శి. (వ్రాఁత(ప్రతి)

ప్రతిఘటించు చిగుళ్లపై నెట్టఁబారిన
రీతి నున్నవి వీని మృదుపదములు. 347

ఉభయకవి లక్కాభట్లు శతపక్షిసంవాదము శార్దూలము ౨-వ పాదమున రివడి ప్రయోగము లక్ష్యము.

శా. సీవీబంధము వీడుమోవియదురుఁ నేత్రంబు లల్లాడు చ౯
గ్రేవల్ గానఁగవచ్చుఁ గ్రొమ్ముడి విరుల్ పృథ్వీస్థలి౯ జెందు స
ద్భావాగారములోను చెమ్మగొనుఁ జిత్తంబుత్తలంబొందు నా
నావిభ్రాంతులు పుట్టు నింతులకుఁ జెంతన్వింత వారుండిన౯. 348

వ. ఇవి రివడి లక్షణ ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు, 349

## (35) సవర్ణప్రాసయతి లక్షణము

తే. చనఁగ వర్గాది వర్గ పంచకములందు
దొరసి వర్గ ద్వితీయ చతుర్థవర్ణ
విరతి నిర్బిందులెన్న సబిందులైన
ప్రాస యొనరింపఁ గృతుల భూభరణకృష్ణ! 350

వ. మఱియును, 351

తే. కవులు వర్గువులైదగు కచటతపలఁ
గూడియున్నట్టి తద్వర్గ ఘోష వర్ణ
యమళములు సవర్ణప్రాసయతికిఁ గృతుల
నిడుదు రొక్కొక్కచోట(ను నెలమిఁ) గృష్ణ! 352

వ. మఱియును, 353

తే. రఘుకులోఁడుద్రుంచె నాదశముఖుని నాఁగ
([1]స్వచ్ఛ) దైత్యారి పది లూవి (య)జ్ఝరియన
దృఢ మనోభీష్టములు భవత్పఠన చేత
సఫలమగు ([2]నందఱ)కు యదుప్రభవ కృష్ణ! 354

---

354. [1]వచ్ఛ దైత్యారి. (ఆ. శ. వ్రాఁతప్రతి).
[2]సెనదవ. (ఆ. శ. వ్రాఁతప్రతి).

తే. ఘోషవర్ణ ద్వితీయాప్తి కొమరు మిగుల
ప్రాసవడి గూర్ప రిపుజనప్రాణ హరణ
వైఖరిఁ జెలంగు నితని యమోఘ బాణ
సాధు వనఁగ నీతఁడు ప్రజానాథుఁ డనఁగ. 355

ఇందుకు సోమయాజి ప్రయోగము విరాటపర్వము మత్తేభము ౩-వ పాదమున తవర్గ ద్వితీయ చతుర్థ వర్ణములగు థకార ధకారములకు సవర్ణ ప్రాసయతి లక్ష్యము. [3-155]

మ. రథముల్ మంచివిగాఁగ నాలు గతిశీఘ్రవ్యాప్తి సత్త్వంబులన్
ప్రథితంబైన తురంగమోత్కరము సంగ్రామార్హచాపంబుల
[1]శ్లథవర్మంబులు వీరికిమ్ము రణలీలాదక్షత న్మన్మనో
రథముల్ దీర్పఁగ [2]వీరలోపుదురు దోర్గర్వంబఖర్వంబుగన్. 356

మఱియు నందే కందము, ౩-వ పాదమున థ - ధ లకు సవర్ణ[ప్రాస] ప్రయోగము లక్ష్యము. [4-148]

క. *పృధయను పేరు మదంబకుఁ
బ్రథితంబై యునికిఁజేసి పార్థుఁడనైతిన్
వృధయనఁ బలుకుదునే యవి
తథ వచనుండైన ధర్మతనయు ననుజుఁడన్. 357

*ముద్దురాజు రామభద్రయ్యగారు కవిలోకసంజీవనియందు. [1-5]

తే. ప్రాసమొనరింప బిందు పూర్వకముగాఁగఁ
గలుగఁజెల్లు ధకార థకారములకు

356. [1]'శ్లత' పాఠము థ - ధ ప్రాసకు లక్ష్యము కాఁజాలదు. వ్యాఖ్యాతృపీఠపి దీనిని 'శ్లథ' గా గ్రహించుట ప్రమాదము.
[2]వీరలొప్పుదురు. (ల. శి. వ్రాఁతప్రతి).

357. *ఈ పద్యమునందలిది థకార సమప్రాసమగునే కాని థ - ధ ప్రాసము కాదు.

358. *'ముద్దరాజు' అనుటకు 'ముద్దురాజు' అనునది యిప్పటిున వ్రాఁత ప్రతి పాఠము.

సింధు మథన శిలోచ్చయ స్యంధునకు ధు
రంధర పదంబు మామక గ్రంథమనఁగ. 358

మఱియు (*ఎఱ్ఱాప్రెగ్గడ) ఉత్పలము ౩-వ పాదమున థకార సవర్ణప్రాస ప్రయోగము లక్ష్యము. [అరణ్య. 4_159]

ఉ. అంధక వృష్ణి భోజకుకురాన్వయ భూపతులెల్ల నీదెసఁగా
బాంధవ సౌహృదప్రణయ భవ్య విశేషములొప్పనీ మనో
గ్రంథి యడంగఁజేయ నెసకంబునఁ బూనినవారు లోభమో
హాంధులు ధార్తరాష్ట్రులు నయంబు మెయిఁగా మనకుర్వియిత్తురే. 359

వ. రామభద్రయ్యగారు బిందుపూర్వకము చెల్లునన్నారు. అయినను సబిందు నిర్బిందువులకు సవర్ణప్రాస ప్రయోగములు చెల్లుటకు మహాకవి ప్రయోగములు లక్ష్యములు వ్రాసియున్నవి. ఇవి సవర్ణప్రాసయతి లక్షణ లక్ష్యములు. ఇఁక నందు, 360

(36) అలుక్సమాస యతి లక్షణము

తే. రహిని సప్తమికిని లుక్కు రాక యొకట
మహిని సమపించిన నలుక్సమాసమయ్యె
సరవి యతిచెల్లు నయ్యలుక్థ్సానమునకు
అచ్చుహల్లు(ల)కును గృతులందుఁ గృష్ణ! 361

ఇందుకు లక్ష్యము —

క. పాకారి వంద్యుఁడని కం
ఠేకాల సహాయుఁడని సు రేశ్వరుఁ డనినఁగా
లోకులు వర్ణింతురు పా
ణౌకృత కమలుఁడని (నిను) జనార్దన! కృష్ణా! 362

ఈ యలుక్సమాసయతి కుదాహరణ సూరపరాజు రాఘవపాండవీయము షష్ఠ్యంతములలో కందము, ౪-వ పాదమున అలుక్సమాసయతి లక్ష్యము. [పీఠిక. 41]

359. *శబ్దశాసనుఁడని అ. శి. వ్రాఁతప్రతి.

క లోకైక స్తుత్యునకు ని
[1]రా[2]కృతనతజన జను ర్వరామృత్యునకున్
వైశ్రికాల్య సత్యునకుఁ
[3]ణశౌ కృతగిరిరాడపత్యునకు నిత్యునకున్ 363

వ ఇందె ఋకారప్రాసమున్ను ఈ రెండవ పాదమున ప్రాదియతిన్ని ఇఁక నందు, 364

## (37) ఘుఙ్ యతి లక్షణము

క తోఁచు 'లపివ్యక్తాయాం
వాచి' యనే ధాతువునను [1](వచ్చు) ఘుఙంతం
బై చెలఁగిన యాలాపం
బౌచితి ఘుఙ్ స్ఫూర్తి యతికి నంబుజనేత్రా! 365

ఇందుకు ప్రయోగము విష్ణుచిత్తీయము, ఉత్పలము ౩-వ పాదమున ఘుఙ్ యతి లక్ష్యము [ఆముక్తమాల్యద 6-95]

ఉ. గోపురకందరాళికడకు న్మశిపుష్కరిణీ కణార్ద్రి సం
తాపహరానిలంబుఉ [1]వితాన రణన్మణి కింకిణీ కలా
లాపముల న్సుఖంబడుగ నాఁటిఁజొచ్చి యకాండగాహనా
చాపల కృన్మరుద్గణముఁ జండుఁడదల్చెడుకోని వాకిటన్ 366

మూర్తి వసుచరిత్ర ఘుఙ్ యతి ప్రయోగము గీతి ౧-వ పాదమున లక్ష్యము

తే *అంచితంబైన కోకిలాలాపనంబు — అన్నాఁడు, 367

---

363 [1]ప్రాదియతి,
[2]ఋకార్ప్రాసము
[3]అలుక్సమాసయతి

365 [1]వసుపు (శా)

366 [1]పతాక, (వావిళ్ల ప్రతి)

367 *వసుచరిత్రలో నిది మృగ్యము,

వ. ఇవి ఘఞ్ యతి ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు, 368

## (38) నఞ్ యతి లక్షణము

క. నసమాస నఞ్ సమాసము
లసమంబున (న)చ్చు హల్లులన్వడిఁ జెల్లున్
లసదుదర సరోరుహమధు
రసజలకేళీధురంధర మరాళహయా! 396

ఇందు నఞ్ సమాసయతికి సూరపరాజు రాఘవపాండవీయము మహాస్రగ్ధరావృత్తము ४-వ పాదమున లక్ష్యము. [2-13]

మహాస్రగ్ధర. తలపి ట్లుత్సాహమొందం దనయజనపరిత్రాణమర్థించియక్కాం
దళితాపత్యానురక్తిన్ మహిపుననుగతిం దానురాఁబూనకుండన్,
వలనొప్ప [1]న్మార్చిస్వస్థానమునకుఁ జనియెన్ రామునాత్మేశుఁబ్రేమా
త్యలఘుశ్రేయస్సుమిత్రానవరతనయయోగాఢ్యుఁ దోడ్కొంచు
[2]వెంటన్. 370

వ. అన్నారు. ఇది నఞ్ యతి లక్షణము. ఇఁక నందు, 371

## నసమాస యతి లక్షణము

విష్ణుచిత్తీయము, పురవర్ణనము, చంపకము ४-వ పాదమున నసమాస యతి లక్ష్యము. [1-52]

చ. (మలఁచి పయోజ కోశములమాడ్కి నొనర్చిన పద్మరాగపుం
గలశపుబెట్టుడాల్బొమిడికంబులతో నపరంజియోడు బి
ల్లల నలవై జయంతముఁ జలంబునఁ గెల్వఁగ దంశితంబులై)
[1]నిలిచినయట్లమాడుగు లనేకములుండుఁ బురంబు లెన్నఁగన్. 372

---

370. [1]మాన్చి. (వావిళ్ల రా. పాం. ప్రతి).
[2]వేడ్కన్. (వావిళ్ల).

372. [1]నిలిచినయట్లు మాడువుల నేకము లుల్లసిలున్ బురంబునన్. (వావిళ్ల

వ. అన్నాఁడు. ఇది నసమాసయతి లక్షణము. ఈ యతులకున్ను మహాకవి
ప్రయోగ లక్షణ లక్ష్యములు వ్రాసియున్నవి. 373

తే. తెలిపినంతయు యతులన్ని తేర్చి యేర్చి
కూర్చి వ్రాసితినే నేర్చుకొలఁది నవియు
([1]సురుచిరంబుగఁ) గైకొని చూచి తీర్ప
వలయు నిది విన్నపము కవివర్యులార ! 374

యతులు పుట్టుటకు *వార్తాకవి రఘురామయ్యగారు దీపికయందు —

శా॥ శ్రీదేవా స్వరసంధిభేదమొదవన్ రీ యెక్కటి న్బుట్టె కా
క్వాదేశ ప్రభునామముల్ ప్లుతము నిత్యాఖండ [1]భిన్నోభయ
ప్రాదుల్ వృద్ధి విభాగముల్ స్వరజముల్ మానుస్వరంబుల్ విక
ల్పాదుల్ సంయుతజాతి వర్గమహలాద్యా పోల్కి చక్కట్లనన్. (?) 375

వ. మంగళం మహత్ శ్రీశ్రీశ్రీశ్రీశ్రీం జేయున్. శుభమస్తు.
ఇఁక నందు, 376

## ప్రాస లక్షణము

తే. *జరుగుఁ జరణాది విశ్రమస్థానమనఁగ
పరఁగు రెండవ వర్ణంబు ప్రాసమనఁగఁ
దనరు యతులన్ని పదములఁ జొనుప నిలుప
నమరుఁ బ్రాసంబు నాల్గు పాదములఁ గృష్ణ! 377

వ. అట్టి ప్రాసంబు లెట్టివనిన, 378

---

374. [1]సురుతరంబుగ. (శా)

375. *ఈ పద్యము వార్తాకవి లక్షణదీపికయందు కానరాదు. అందుకు మాఱుగ వేరొక సీసపద్యమున్నది (523) ఈ పద్యపాఠము సరిలేదు. సవరింప ననువుగాకున్నది.

[1]భిన్నోదయ. (ల. శి. వ్రాఁతప్రతి).

377. *ఈ యాశ్వాసాది 10-వ పద్యమే యిం దించుక మార్పుతోఁ గూర్పఁబడినది.

క. ద్వాదశ విధములు షడ్విధ
భేదమ్ములు మఱియు రెండుఁ జెప్పఁగఁ దత్త
ద్భేదములు పూర్వ సత్కవి
వాదమ్ముల లక్ష్యములును బ్రాసెదఁగృష్ణా ! 379

అట్టి ప్రాసనామధేయమ్ములు

[*అనంతనగారు. ఛందోదర్పణము. 1-35]

క. సమనామ ప్రాసము ప్రా
సమైత్రి ఋత్రిలును బ్రాదిసమలఘువు విక
ల్పము బిందువర్ధ బింద్వా
ఖ్య ముభయ సంయుక్త సంధిగత సంజ్ఞకముల్. 380

వ. అనఁగలుగు ప్రాసంబులు ద్వాదశవిధంబులయ్యె నందు మొదలి, 381

## (1) సమనామప్రాస లక్షణము

క. *అరసున్నలు నెఱసున్నలు
నొరసిన వర్ణములు జడ్డయును బ్రాసములై
బెరసినచో సమవర్ణము
లరపి తగన్నిలుపవలయు నంబుధిశయనా ! 382

అనంతనగారు, [ఛందోదర్పణము. 1-37]

క. [1]పరువడిఁ బ్రాసములు సమా
క్షర సంశోభితములయినఁ, జాలును మఱి త
త్స్వర వైసాదృశ్యంబులు
పరిహరణీయంబులందుఁ బంకజనాభా ! 383

---

380. *వార్తాకవి రఘునాథయ్యగారు అని అ. శి. వ్రాఁతప్రతి.

382. *ఈ పద్యమునకును ఛందోదర్పణమునందలి పద్యమునకును (1-36) ఇంచుక భేదము కలదు.

383. '[1]పరిహారణీయములుగావు' అను అ. శి. వ్రాఁతప్రతి పాఠము అర్థ వ్యతిక్రమము.

లక్ష్యము. [ఛందోదర్పణము. 1-31]

ఆ. కుట్రల కుంతలములు నిటలంబుపై వ్రాల
నోటలేక ధేనువాటమునకు
నడ్డె యశోదపట్టి గద్దలెఁ బొమ్మనినఁ బ్రా
సాది తేటపడును మోద మెసఁగ. 384

♦♦మఱియు కంకంటి [1]పాపరాజు ఉత్తరరామాయణము సప్తమాశ్వాసములో లవణాసురవధ అయిన వెనుక వాల్మీకులు శత్రుఘ్నుని స్తోత్రము చేసిన తావున కకారాన్కు బిందుయతి ప్రయోగము. [7-159]

♦♦ఉ. ఇంకొక నాఁటికిన్ లవణుఁడీల్గునె లోకులబాధ దీఱునే,
శంక దొరంగి వీని ననిఁ జంపెడి శూరుఁడు భూమిఁబుట్టునే,
యంకిలి లేకయుండుదురె యంచుఁ దలంపుదు మాతలంపునీ
వంక ఫలించె నేఁడు బుధవత్సల! నిన్ను నుతింప శక్యమే. 385

♦♦మఱియు [శంబు]కాఖ్యుని వధచేసిన తావున పకార లకారమునకు ఉత్పల ళ పాదముల లక్ష్యము. [ఉత్తరరామాయణ. 7-213]

♦♦ఉ. విప్లవముల్ హరించి పృథివీభర మీవుభరింప శోక పా
రిప్లవతా వికారములు రీణములయ్యె భవత్కృపాణధా
రాప్లవపూతుఁడై వృషలుఁ డంగముతో దివికేఁగెడిన్ సురా
నుప్లవవృత్తి వాఁడదె కనుంగొనుమయ్య దశాననాంతకా. 386

♦♦మఱియు నందె ఖ - ఖ లక్ష్యము. [ఉత్తరరామాయణము. 7-216]

♦♦చ. శిఖికడుఁ జల్లనైన నుడుశేఖరుఁ దుష్టగుణంబుఁ బొందినన్
[1]నిఖిల శరణ్య! మీరనెడు నిశ్చయవాక్కుల బొంకు సెందునే

---

385. [1]పాపిరాజు (శా).

387. [1]నఖిల (ల. శి. వ్రాఁతప్రతి).

స్వఖురకరాసి శంబుకుని ఁ జంపినయప్పుడె ప్రాణవంతుఁడై
సుఖముననున్నవాఁడు ద్విజసూనుఁడు సూనుఁడుగాక [2]భూవరా! 387

వ. ఇది సమనామప్రాస లక్షణము. ఇఁక నందు, 388

## (2) ప్రాసమైత్రిప్రాస లక్షణము

[అనంతుఁడు. ఛందోదర్పణము. 1-40]

తే. లళలు రెండును నొండొంటఁ గలసివచ్చు
[1]నమరు [ఋ-ఱయుతాయుతము లన్యోన్యముగను]
బిందు పూర్వమై తమలోనఁ బొందు బమలు
ప్రాసమైత్రికి నిది స్వరూపంబు కృతుల. 389

ఈ పద్య(ము) క్రమంబుగా ల - ళ, బ - మ, [1]ఋ - ఱ యుతము ౩ కి, గీతి మూఁడవ పాదమున లక్ష్యము [ఛందోదర్పణము. 1-41]

ఆ. [1]నీలవర్ణు గర్భగోళంబు నందు లో
కంబు లెల్లనుండు నెమ్మితోడ
శ్రీకి నొడయఁడుజ్జ్వలాకృతి యితఁడన్నఁ
బ్రాసమైత్రి యిట్లు పరఁగుఁ గృతుల. 390

మఱియును. [ఛందోదర్పణము. 1-42]

తే. తగ ఋకారాన్వితంబు ద్విత్వంబు గాఁగఁ
బరఁగు నచ్చపు జడ్డతోఁ బ్రాసమైత్రి

---

387. [2]వేడుకన్. (ల. శి. వ్రాఁతప్రతి).

389. [1]నమరు నన్యోన్యమును ఋ యు తా యుతములు (ముద్రిత. ఛం. ద.)
[2]నమరు నన్యోన్యముగను ఋ ఱ యుతములు. (ల. శి. వ్రాఁతప్రతి. ఇందు అక్షరలోపము, యతి భంగము).

390. ఈ పద్యమున 3వ. పాదమున ఋ యు తా యు త ప్రాసకు లక్ష్య మున్నది. గాని ఋ - ఱ యుతమునకు లేదు.

యక్కృపానిధి హరిఁగని మ్రొక్కి-రనఁగ
సంభృతాశ్రితుఁ డతిశయోజ్జృంభుఁడనఁగ. 391

సోమయాజి (భీష్మపర్వము 2-246) కందము ౩-వ పాదమున బ-మ యీ రెండు వర్ణములకు ప్రాసమైత్రి ప్రాసప్రయోగము లక్ష్యము.

క. అమ్ముల నేనుఁగు కొమ్ముల
నమ్మత్తగజంబు నొంప నటిముటి మన సై
న్యం బెల్ల జడియఁబఱచె భ
యమ్మున మొనవిఱిగె దిక్కు-లద్రువ నొరులుచుఁ. 392

మఱియు ఋకారాన్వితప్రాసమునకు సోమయాజి ఉద్యోగపర్వము కందాసను లక్ష్యము. [3-351]

క. ఈకృష్ణుని సారథ్యము
నాకృష్ణుని గాండివంబునై తోఁచక ము
[1]న్నీకౌలఁదిం జక్కంబడి
యీకురువంశంబు గావు మిభపురనాథా! 393

మఱియు సావర్ణ్యప్రాసము

"ఋ ౡ వర్ణయో ర్మిథ స్సావర్ణ్యం వాచ్యమ్" అనే శబ్దసూత్రము చేతను ఋకారసంయుక్తప్రాసము వలెనే ౡకార సంయుక్తప్రాసము గలుగుటకు సూరపరాజు రాఘవపాండవీయము ప్రథమాశ్వాసము శార్దూలవృత్తము ౨-వ పాదమున లక్ష్యము. [పీఠిక. 3]

శా. లోకత్రాణరతిం దదాదిమ మహీలోకప్రవేశోత్క- భా
షాక్ౢప్త ప్రథమ ద్వితీయపదగుంజన్మంజు మంజీర గ
ళ్జాకల్పామల రామ భారతకథా సర్గంబులన్ మించు వా
ల్మీకి వ్యాసులఁ గొల్చెదం దదుభయశ్లేషార్థ సంసిద్ధికిన్. 394

393. [1]న్నీ కౌలఁదిఁ జక్కఁబడి నీ, పీతరు. (సంశో. ఛా.)

ఇఁక నందు (3) ఋప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-43]

క. ఆరయ స్వరగణమయ్యు ఋ
కారము ఋప్రాస మనఁగఁ గదియును రేఫన్
జేరి తనయురముఁ దన్నిన
యాఋషిపాదంబుఁబిసికె నచ్యుతుఁ డనఁగన్. 395

మఱియును, [ఛందోదర్పణము. 1-44]

తే. తెల్లమిగ ఋకారము యణాదేశవశత
రేఫ యగుటఁ బ్రాసంబయ్యె రేఫకిట్టు
లిదియె పరవర్ణయుతమయ్యెనేని ప్రాస
మైత్రియగుఁగాని రేఫసంబంధిగాదు. 396

శబ్దశాసనుఁడు ఆరణ్యపర్వము కందము ౧-వ పాదమునను ప్రయోగము లక్ష్యము. [3-104]

క. ఆ ఋషికుమారు కట్టిన
చీరలు మృదులములు నవ్యచిత్రములు మనో
హారములు నతని పృథుకటి
భారంబున నొక్క కనక పటమున్ వ్రాలున్. 397

లక్షణము

తే. తగు ఋకారాంత శబ్దముల్ ద్వంద్వమైన
యపుడు మీఁదటి ఋత్వంబు లఱఁగి రేఫ
లగును దద్వర్ణమిత్రంబులగు మహేంద్ర
ధాత్ర శంకరనుత పద్మనేత్ర కృష్ణ! 398

శబ్దశాసనుఁడు ఆదిపర్వము, ఉత్పల ౪-వ పాదమున ద్వంద్వసమాసం బగుట ఋకారాంతము రేఫయగుటకు ప్రయోగము లక్ష్యము. [2-175]

ఉ. క్షత్రియ వంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియ వైశ్య శూద్రులనఁగాఁ దగు నాలుగు జాతులన్ సుచా
రిత్రము దప్పకుండఁగఁ బరీక్షితుగాచినయట్లు రామ మాం
[1]ధాత్ర రఘుక్షితీశులు ముదంబునఁగాచిరె యే యుగంబునన్. 399

వ. ఇవి ఋకారప్రాస లక్షణ లక్ష్యప్రయోగములు. ఇఁక నందు, 400

### (4) త్రికారప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-45]

తే. సంఖ్యఁ బలుకు త్రికారంబుఁ జనుఁ దకార
సదృశమై త్రికారప్రాస సంజ్ఞ గలిగి
ఆత్రివిక్రముఁ డభయప్రదాత యనఁగ
వాక్త్రిపథగోజ్జ్వలులు విష్ణుభక్తు లనఁగ. 401

మఱియును [ఛందోదర్పణము. 1-47]

తే. ఇ ఉ ఋ ఌ ల కచ్చు పరమయ్యెనేని సంధి
యవర లాదేశమగునట్టి యవరలకును
నడరి ఇ ఉ ఋ ఌ లాదేశమయ్యెనేని
అదిగృతుల సంప్రసారణ మండ్రు బుధులు. 402

మఱియును [ఛందోదర్పణము. 1-46]

తే. ఈత్రికారంబునకుఁ దీయ యెసఁగఁ గ్రింద
రేఫ సంప్రసారణమున ఋత్వముగఁ దృ
[1]తీయ యగు నీ త్రికారశక్తికిని జూడ
నాత్రికారంబునకుఁ బ్రాసమైత్రి నిచట. 403

---

399. [1]మాంధాతృ. (ల. శి. వ్రాఁతప్రతి.) ఇట లక్షణ ప్రకారము ఋత్వము రేఫ కావలయును. కాన 'ధాతృ' అను పాఠము సరికాదు.

403. [1]తీయయగు నీ త్రికారమర్థించి చూడ, నాత కారంబునకుఁ బ్రాసమయ్యె వచట. (ముద్రిత. ఛం. ద.)

ఇఁక నందు, (5) ప్రాదిప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-48]

తే. ప్రాదియై యనశబ్దంబు ప్రాణమగుటఁ
బరఁగు ణన లకు వేర్వేఱఁ బ్రాసమగుట
క్షోణిధరుఁ డెత్తె నేనుఁగుప్రాణమనఁగ
దానవారాతి ప్రేతలప్రాణ మనఁగ. 404

మఱియును [కాశీఖండము. 5-296]

క. ప్రాణాపాన వ్యానో
దానసమానములు దృప్తి దలకొనఁ జేయం
గానోపెడునది యన్నమ
ప్రాణంబన నన్నమనఁగఁ బర్యాయంబుల్. 405

రామభద్రయగారు [కవిజనసంజీవని. 1-49]

క. చను ణత్వ విధాయక సూ
త్రనిమిత్తాగత ణకారరాజి నకారం
బునకుఁ బ్రాసముగా నిడఁ
బ్రణుతి యొనర్చెద మురారి పదముల కనఁగన్. 406

'ణ - న' లకు ప్రాసము *త్రికవుల షష్ఠము కందము ౪-వ పాదమున లక్ష్యము.

క. అనుటయుఁ గృష్ణద్వైపా
యనతనయుం డిట్టులనియె నవహితమతియై
వినుమతి గుహ్యము సారా
యణ కవచము భక్తవాంఛితార్థప్రదమున్. 407

---

407. *శృంగార షష్ఠమని క. జ. సం. (1-51), అప్ప. (3-338).

*మదనసేనము కందము ౨-వ పాదము ప్రాదిప్రాస ప్రయోగము లక్ష్యము.

క. పోనుద్యోగముఁ జేసిన
ప్రాణంబా యింక నీకుఁ బాథేయంబీ
మానిని మందస్మిత మధు
రానన చంద్రికలుగ్రోలి యరుగుము పిదపన్. 408

వ. ఇవి ప్రాసలక్షణ ప్రయోగ లక్ష్యములు. 409

లఘువుల మీఁద అర్ధబిందుప్రాస ప్రయోగము. ద్రోణపర్వము మత్తేభము ४-వ పాదమున లక్ష్యము. [5-114]

మ. కడకన్నెఱ్ఱని చెల్వుదాల్ప నరుఁ డుగ్రస్ఫూర్తి విల్ద్రుంచి యె
క్కుడు కోపంబున సూతు మస్తకముతోఁగూడన్ దురంగంబులన్
కడిఖండంబులుచేసి యారథికుపై గాఁడంగఁ బెక్కమ్ములే
[1]యుఁడు నస్లేపటిపాటి యెక్కెఁ గృపుతే రుర్వీశ నిర్లజ్జుఁడై. 410

మఱియు నందుకె వాతాహము కందము ४-వ పాదాన లక్ష్యము. [8-65]

క. మృగుఁడన్ ధాత్రీపతి మృగ
మృగయార్థము వాహినీ సమేతుండై పో

---

408. *ఈపద్యము 'మదనసేనము' నందలిదని అప్ప. (3-337). స. ల. సా॰ సం. (2-64) పేర్కొన, ఠం. ఛం. లో, నిది 'పరాంతము అప్పన్న బృందావనంభవము' లోనిదిగ ఉదాహృతము. (3-37).

410. [1]ఇందు నాలుగవ పాదము అర్థ బిందు ప్రాసమునకు లక్ష్యముగ నొసఁగఁబడెను. అందలి "ఏయుఁడు" నను నానంతర్యార్థక 'డు' ప్రత్యయము సబిందుకముగ పొత్తపికవి భావించెఁగానోపును. ఆనంతర్యార్థక "డున్" ప్రత్యయము సబిందుకముగ ప్రాచీన వ్యాకర్తలు ప్రదర్శింపలేదు. కాని వైకృత చంద్రికలో దీని కాకరము లభించు చున్నది. (చూ. పీఠిక)

యి గహన భాగంబునఁ జం
పై [1]గవయ శార్దూల సింహ భేరుండములఁ అన్నారు 411

ఇఁక (6) వికల్పప్రాస లక్షణము

[ఛందోదర్పణము 1-50]

తే సానునాసికలౌ వర్గహల్లులకుఁ దృ
తీయలగు వికల్పప్రాసమై యెలర్చు
బ్రాఙ్నగంబుపై రవి దోఁచె నగ్నివోలె
ప్రాఙ్ముఖుండయి వినుతించె వాఙ్మయనఁగ 412

*క్షేమేంద్రుఁడు కందము 3-వ పాదమున వికల్పప్రాస లక్ష్యము

క పద్మాసమానయగు మన
పద్మావతిఁ జూచి ధరణిపాలసుతుండు
ధ్యన్మోదంబునఁ దనముఖ
పద్మము నలరించె ననుచుఁ బరిజను లలరన్ 413

వ ఇది వికల్పప్రాస లక్షణము 414

ఇఁక నందుఁ (7) సములఘుప్రాస లక్షణము

[ఛందోదర్పణము 1-49]

తే ఓలిరేఫతోఁగూడియు నూఁదఁబడక
తేలి తెనుఁగులఁ దమయట్టి వ్రాలతోన

---

411 [1]ఇందు నాలుగవ పాదమున, 'చంపెగవయ' అనుచోట అర్ధబిందు వుండుట కవకాశము లేదు ఈ పాఠమే ముద్రిత వరాహపురాణము నందును గలదు అట్లేని యీయది లక్ష్యము కాఁజాలదు దీనిని "చెంపెఁగవియు (= చంపెన్ + కవియు) అని సవరించుట లక్ష్యాను గుణము.

413. *దీనిని 'అనంతచ్ఛందము' లోనిదిగ రం ఛం (3-110) ఉదాహరించెను. కాని యిది అనంతచ్ఛందమునఁ గనఁబడదు

సమలఘుప్రాసమగు తెక్కలమరఁబట్టి
విద్రిచె నసురఁ గృష్ణుఁడు దిక్కులద్రువ ననఁగ. 415

## (8) బిందుప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-51]

తే. పేర్చి పొల్లనకారంబు బిందు వగుచు
మీఁదనున్న ధకారంబునూఁది ప్రాస
బంధమగుఁ గృష్ణుఁడుదయించినంధరిత్రి
యంతయును నిరుపద్రవంబయ్యె ననఁగ. 416

ముద్దరాజు రామభద్రయ్యగారు [కవిజనసంజీవని. 1-32]

తే. అమరఁ గృతులందు నాంతపదములమీఁద
క చ ట త ప వర్గవర్ణముల్ గలయఁ బలుక
పిఱుఁదనున్న నకారంబు బిందువగుచు
కచటతప లెవ్వియైనను గ జ డ ద బ లు. 417

కచటతప వర్గువులకు మఱియు నిదే లక్ష్యము. [కవిజనసంజీవని. 1-33]

తే. అంగజగురుండు కరుణఁగాచెంగజంబు
కంజదళలోచనుండుప్రోచుం జగంబు
అండజహయుండు దనుజశక్తిం డిగించు
ననఁ బ్రయోగింపఁదగుఁ గాళియాహిదమన. 418

మఱియును [కవిజనసంజీవని. 1-34]

తే. నందనందనుఁ డారగించెందవంబు
నంబుజాక్షుండు మదమడంచెం బలీంద్రు
తమ్మియిమ్మగు కొమ్మ దాల్చు [1]మ్మురారి
యనఁగ వర్తిల్లు నంబుదశ్యామ! రామ! 419

---

419. [1]ఇందలి లక్షణప్రకారము "దాల్చుంమురారి" అని పొల్లునకారమునకు బిందువూత ముండవలెను.

నాచనసోముఁడు చకారంబు జకారమైనందుకు కందము ౪వ. పాదాదులను బిందుప్రాసప్రయోగము లక్ష్యము. [ఉత్తర హరివంశము 1-75].

క. అంజెదవుగాక నన్నుఁ జెం
తం జేరఁగనీక యెంత తడిసిన మిరియా
లుంజొన్నల సరిపోవే
లంజెతనములందుఁ గొమరెలన్ గెలువ[1] వశే. 420

ఆంధ్రకవితాపితామహుఁడు ఆముక్తమాల్యద చకారము జకారమై ప్రాస న్నిలుచుటకు ఉత్పలము [4-వ పాదాన] నకారము బిందువై నందుకు 3 పాదాల ప్రయోగము లక్ష్యము [2-28]

ఉ. అంజనమాన వాయుగణమంతయు ఖంజతఁ జిక్కి నజ్జవో
ష్మంజనియించు చిక్కని సమానపువాయువులో నొకండుగ
ల్మింజనియించు దుర్యశము మేల్కని లేహనవేళ వాజు లూ
ర్పుం జెడుమాణిబంధముకురంబుల కాళిమ పేరఁ గార్కొనన్. 421

మఱియు నకారము బిందువై నిలిచినందుకు శబ్దశాసనుఁడు ఆదిపర్వము లయగ్రాహి ౧-వ పాదమున రెండవప్రాసము ప్రయోగము లక్ష్యము. [5-138]

లగ్రాహి. కమ్మని లతాంతములకు [1]మ్మొనసివచ్చు మధు
పమ్ముల సుగీతనినదమ్ము లెసఁగన్ జూ
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధి కుసు
మమ్ములను సానుచుముదమ్మొనర వాచా

420. గెలువ నోకో. (అ. శి. వ్రాఁతప్రతి.)

422. [1] ఇందు లక్షణప్రకారము 'లకులమొనసి' అని బిందురూప ముండవలెను.

లమ్ములగు కోకిలకులమ్ములును భాసుర [1]ర
వంబుగను [2]వీచెననిశంబు సుమనోభా
రంబున నశోక నికరమ్ములును టంపక చ
యంబులును గింశుకవనమ్ములును నొప్పెఁ. 422

వ. ఇదియే బమలకు ప్రాసమైత్రిప్రాస లక్ష్యము. ఇవి బిందుప్రాస ప్రయోగ లక్షణ లక్ష్యములు. ఇఁక నందు, 423

## (9) అర్ధబిందు ప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-52]

తే. సార్ధబిందువై తేలినయట్టి పటల
కరయఁ బ్రాసంబు నిర్బిందువైనఁ జెలు
వీఁపు మూఁపులు మఱి తలమోపులయ్యె
మాట లేఁటికి ధాత్రి తామేఁటి కనఁగ. 424

మఱియును [కవిజనసంజీవని. 1-9]

తే. అర్ధబిందువు నిర్బిందువగు పదముల
ప్రాసములు దీర్ఘములమీఁదఁ బలుకఁజెల్లు
మూఁడు మూర్తులు నేకమై కూడె ననఁగ
సోఁకు మూఁకల నణఁచె నిక్ష్వాకుఁడనఁగ. 425

మఱియుఁ గుఱుచలమీఁద సున్నలకు, [ఛందోదర్పణము. 1-34]

ఆ. కుఱుచమీఁది సున్న మఱి తేలఁబ్రాయఁ బ్రా
సద్వయాపె నిట్లు జరుగు నచ్యు

---

422. [1]రవంబు - అనిశంబు - భారంబు - చయంబు అను శబ్దములందు ద్విత్వ మకార రూపములే - రవమ్ము ఇత్యాదిగా - ముద్రిత భారత ప్రతులం దెల్లఁ జూపట్టుచున్నవి. అట్టిచో 'బ - మ' ప్రాస ప్రసక్తి యనవసరము.

[2]విచ్చెం. (సంశో. భా.)

తుఁడు సమస్త వల్లభుఁడు నాఁగ నయ్యచ్యు
తుండు సకలవల్లభుం డనంగ. 426

మఱియును [ఛందోదర్పణము. 1-39]

తే. అయుపేంద్రుని బొడఁగాంచుచే యుపాయ
మనెడి దీర్ఘాదు లచట [1]హ్రస్వాదు లయిన
అయ్యుపేంద్రుని బొడఁగాంచు చెయ్యుపాయ
మన సమప్రాసమగు నూఁదఁజనదు రహాల. 427

అరసున్నలు, నెఱసున్నలు, జడ్డలు, అర్ధబిందు నిర్బిందులకు గీతి ౪ గు చరణములను ప్రయోగము లక్ష్యము, అనంతనగారు. [ఛందోదర్పణము. 1-38]

ఆ. వీఁ డుపేంద్రుఁ డల్లవాఁడె ప్రలంబారి
కొండయెత్తె నితఁ డతండు ద్రవ్వె
నడ్డగెడవు పడఁగ దొడ్డరా జేలెడి
వీఁడనంగఁ బ్రాస మీఁదు వచ్చు. 428

శబ్దశాసనుండు ఆదిపర్వము కందము ౨-వ పాదమున అర్ధబిందు నిర్బిందువులకు ప్రయోగము లక్ష్యము. [2-44]

క. ఆ పన్నగముఖ్యులఁ దన
వీఁపునఁబెట్టుకొని పఱచి విపినములు మహా
ద్వీపములు గిరులు సకల ది
శాపతిపురములును జూపెఁ జని వారలకున్. 429

మఱియు నందే కందము ౪-వ పాదమున అర్ధబిందు నిర్బిందువులకు ప్రయోగము లక్ష్యము. [ఆది. 8-200]

క. [1]వీఁకఁ బఱతెంచి నలుగడఁ
డాఁకినఁ గడు నలిగి ఘోరతరశరహతి న

427. [1]ప్రాసాదులైన. (అ. శ్రీ, వ్రాఁతప్రతి).
430. [1]వీంకఁ బఱతెంచి ... ... దాంకిన, (అ. శ్రీ, వ్రాఁతప్రతి).

[2]మ్ముఁకలు విరియఁగ నర్జునుఁ
డాకరముగ నేసె నుగ్రుఁడై రణభూమిఁ. 430

వ. ఇవి అర్ధబిందు నిర్బిందు ప్రాసప్రయోగ లక్షణ లక్ష్యములు. ఇఁక
నందు, 431

## (10) ఉభయప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-53]

క. చూడఁగ లకార రేఫలఁ
గూడియు వేర్వేఱఁదా నకుంఠిత గతితోఁ
దోడన యుభయప్రాసము
[1]జాడఁబడును సంయుత ప్రసంగతిఁ గృష్ణా! 432

లక్ష్యము. [ఛందోదర్పణము. 1-54]

ఆ. పాఁడి మరగి బ్రతుకువాం డ్రిల వ్రేతలు
వాండ్ర వెన్నలేల తండ్రి [1]నీకు
వీండ్ర కొఱకు నోరుల యిండ్లకుఁబోకు కృ
ష్ణుండ నీకు బ్రాఁతె పండ్లు లిచట. 433

మఱియు నొక ప్రకారము, [ఛందోదర్పణము. 1-55]

తే. రలయు లాయుత ప్రాసమార్గము దలంప
వాండ్ల లేఁజూపుమోములఁ దీండ్ర లమరె

---

430. [2]'మూకలు' అని 3-పాదమున నిర్బిందుకముగా ల. శి. వ్రాఁతప్రతిలో నున్నది. దీనికిచ్చిన నిర్దేశ వచనములో 4-పాదమున నిర్బిందువని సూచితము. కాన 'మూఁక'లో అరసున్న యుండవలెను.

432. [1]'జాడఁబడును' అనునది ల. శి. వ్రాఁతప్రతి. ఈ పాఠమును గ్రహించిన యతిభంగ మగును.

433. [1]యనఁటి, పండు కొఱకు వింతయిండ్లకు. (ఛం. ద.)

వనుచు రెండును గూర్చిన వనువు దప్పు
నంద్రు నిఖిలార్థ విదులైన దండికవులు. 434

వ. ఇది ఉభయప్రాస లక్షణము. ఇఁక నందు 435

## (11) సంయుక్తప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-56]

ఆ. పాదునూరుఁద్రోలు బహువచనమ్ములై
([1]పరఁగు)చుండ నూఁదఁబలికినపుడ
తేలఁ బలికినపుడు దీపించు సంయుత
ప్రాస మిది దెలుఁగులఁ బద్మనాభ! 436

లక్ష్యము [ఛందోదర్పణము. 1-57]

ఆ. పాళ్లు మనుజులెక్క నూళ్లుగాఁ [1]దొణఁగిన
నూళ్లు మిగుల బలసి ప్రోళ్లుగాఁగ
[2]భాగ్యవంతులేలు పాళలు నూళలు
ప్రోళులయ్యె బ్రాఁతె కూళులిచట. 437

మఱియు [ఛందోదర్పణము. 1-58]

ఆ. [1]తెనుఁగునందులేదు మును క్రిందనుడి, గ్రుచ్చెఁ
గ్రుమ్మెననఁగఁ [2]గ్రారకొమ్ము గాని
ప్రాసమైత్రి చొరదు, దానంయుతప్రాస
మగును రేఫయుతము ననుసరించి. 438

436. [1]పలుకు (ఆ. శి. వ్రాఁతప్రతి).

437. [1]దొడఁగెన. (ఛం. ద.)

[2]భాగ్యవంతుఁడేలు. (ఛం. ద.)

438. [1]తెలుఁగునందు లేదు అవి. (ఛం. ద.)

[2]రేఫ కొమ్ముగాని (ఛం. ద.)

లక్ష్యము [ఛందోదర్పణము. 1-59]

క. ఈక్రిందటి రేఫలు సమ
మైత్రాలుచుఁ దేలిప్రాసమగు సంయుక్తం
[1]బాక్రూర నక్రభయమున
వాక్రువ్వదె గజము భక్తవత్సలు ననఁగన్. 439

వ. ఇది సంయుక్తప్రాస లక్షణము. ఇఁక నందు, 440

## (12) సంధిగతప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-60, 61]

క. ధ్రువముగ సంధి జనిత రూ
పవిశేషప్రాసమగుచుఁ బరఁగు పకారం
బవిరళ వకారమగు, న
య్యవదానవ పాలెఱుంగ ననఁగ ముకుందా! 441

వ. అది యెట్లంటేని, 442

[ఛందోదర్పణము. 1-62]

క. ప్రథమాంత విభక్తులపైఁ
గథితములగు కచటతపలు గసడదవలగుం
బృథివి నవి గ జ డ ద బ లగుఁ
బ్రథమపు సున్న లగు నాంతపదముల మీఁదన్. 443

లక్ష్యము [ఛందోదర్పణము. 1-63]

తే. వాఁడు గనువాఁడు సేకొనువాఁడు డెక్క-
లాడువాఁడు [1]దపోనిధి వాఁడు వెద్ద

---

439. [1]బైర్రార నక్రభయమున, వాత్రువ్వఁడె గజము భక్తవత్సలుఁడనఁగన్. (అ. శి. వ్రాఁతప్రతి).

444. [1]వాఁడు + తపోనిధి = వాఁడు దపోనిధి — ఇందు సంధియందుఁ దెలుఁగు పోఁడి సాంస్కృతిక తకారమునకు దకారాదేశము.

చిక్కెఁ గరిమ్రొక్కెఁ జెలివాక్కుఁ దక్కువెట్టె
శౌరిఁ దలఁచె²నిజ లిఖిచె నాసంధు లిట్లు. 444

వ. ఇది సంధిగతప్రాస లక్షణము. ఇవి ద్వాదశవిధప్రాసలక్షణ ప్రయోగ లక్ష్యములు. ఇఁక నందు శబ్దాలంకారములంగల షడ్విధప్రాసవిశేషమ్ము లెట్టివనిన, 445

[శబ్దాలంకార ప్రాసములు]

[ఛందోదర్పణము. 1-70]

క. అమరఁగ దుష్కరమును ద్వం
ద్వము త్రి¹చతుష్ప్రాసములును దగనంత్యప్రా
సమును నను ప్రాసము ననఁ
గ్రమమున షడ్విధములయ్యెఁ గంసారాతీ! 446

ఈషడ్విధములందు మొదటి (1) దుష్కరప్రాస లక్షణము
[ఛందోదర్పణము. 1-71]

క. దోఃకీలిత మణికటక, యు
రఃకేళి రమాభిరామ, రంజితసుజనాం
తఃకరణ, ఖండితారి శి
రఃకందుక యనిన దుష్కరప్రాస మగుఁ. 447

మఱియును [కవిజనాశ్రయము. సంజ్ఞ. 80]

క. స్వఃకాంతాసమయోషిదు
రఃకృతరతి చిహ్నదుష్కర ప్రాసంబా
విఃకృతముగ నిట్లు సుపు
త్రః కులదీపక యనంగఁదగును మహాత్మా! 448

---

444. ²నించిలిచె - అని ఛం. ద. పాఠాంతరము.

446. ¹చతుఃప్రాస. (అ. శి. వ్రాఁతప్రతి).

అందు (2) ద్వంద్వప్రాస లక్షణము

[కవిజనాశ్రయము. సంజ్ఞ. 82]

క. దోసంబులేక వస్తు ని
వాసం బై వేలయఁ జెప్పవలయును ద్వంద్వ
ప్రాసంబు చిత్తాక్షర వి
న్యాసంబుగఁ గృతుల రేచ! నయతత్త్వనిధీ! 449

[ఛందోదర్పణము. 1-72]

క. కంజనయన భవభీతి వి
భంజన శుకశౌనకాది బహుముని చేతో
రంజన ద్వంద్వప్రాస మ
నంజను నిప్పాటఁ బల్కనం గృతులందున్. 450

అందు (3) త్రిప్రాస లక్షణము

[కవిజనాశ్రయము. సంజ్ఞ. 84]

క. దానమున సత్యమున నభి
మానమునం బోల్ప నీసమానులు ధరణిం
గాన మనం ద్రిప్రాసము
దానమనోహరమగును బుధస్తుతచరితా! 451

మఱియును [ఛందోదర్పణము. 1-73]

క. తా నవనీత ప్రియుఁడన
దానవ నిర్మూలనైక తత్పరుఁడన స
న్మౌని వినుతుఁడన శ్రితసుర
ధేను వనఁగఁ గృతులయందుఁ ద్రిప్రాసమగున్.  452

అందు (4) [1]చతుష్ప్రాస లక్షణము

[ఛందోదర్పణము. 1-73]

క. వారణ వరద నిశాట వి
దారణ వీరావతార ధరణీ వలయో
ద్ధారణ విరచిత సత్యవ
ధూరణవరవిజయ యనఁ జతుష్ప్రాసమగుణా. 453

అందు (5) అంత్యప్రాస లక్షణము

[కవిజనాశ్రయము. సంజ్ఞ. 38]

క. జనమత భీమతనూజా!
సునయార్జిత విభవ! దేవ! సుభగమనోజా!
వినుత విశిష్టసమాజా!
యన నంత్యప్రాస మి ట్లుదంచత్కీర్తీ! 454

అందు (6) అనుప్రాసము

[కవిజనాశ్రయము. సంజ్ఞ. 86]

క. విత్రస్తాఘ పవిత్ర చ
రిత్రజిత త్రిదశ వరధరిత్రీనుత స
న్మిత్రాంబుజ మిత్రాలయ
మాత్రయనుప్రాస మదియ మల్లియరేచా! 455

వ. ఇవి షడ్విధప్రాస లక్షణ లక్ష్యములు. మఱియు నేక సుకర ప్రాసంబును
అర్ధబిందు ప్రాసంబన నిరువిధమ్ము లందు, 456

సుకర ప్రాసము

[కవిజనాశ్రయము. సంజ్ఞ. 78]

క. పరమోపకార ధరణీ
సురవర సురభూజ సుగుణసుందర తరుణీ

---

453. [1]చతుఃప్రాస (ల. శి. వ్రాఁతప్రతి).

[1]స్మరనిభ సుకరప్రాసం
బరుదుగఁ గృతులందుఁజెందు నభినుతచరితా! 457

అందు

## అర్ధబిందుప్రాసము

క. [1]తొల్ఁకుచునుండిన తామర
కొల్ఁకులకడ కరిగి హంసకులమెల్లను నా
కొల్ఁకుల నాడుచునున్నను
దల్ఁకక యన నర్ధబిందు తగుప్రాసమగుః. 458

వ. మఱియు నందు విశేషమ్ములగు లాటానుప్రాస, ఛేకానుప్రాస, వృత్త్యను
ప్రాస, సమపదప్రాసమ్ము లనందగు చతుర్విధమ్ములయందు. 459

## లాటానుప్రాస లక్షణము

[కావ్యాలంకారచూడామణి. 6_17]

క. పాటిగఁ జెప్పిన శబ్దమ
చాటుగతిః నొరిదిఁబల్కు చక్కఁద మర్థా
ఘాటోత్కర్షము చేసిన
లాటానుప్రాస మనఁగ లలితంబయ్యెః. 460

లక్ష్యము, కావ్యాలంకారచూడామణి, *విన్నకోట పెదిరాజు [illegible] 8]

చ. ధరణిఁ జళుక్య విశ్వవిభుదానము దానము, కీర్తి
కరమగు వాలువాలు, రణగర్వము గర్వము, గాక ; కల్పితే
తరనృపనామధారకుల దానము దానమె, కీరికీర్తియే,
కరమున వాలువాలె, రణగర్వము గర్వమె పౌరుషక్రియః. అన్నారు. 461

---

457. [1]మరు. (ల. శి. వ్రాఁత ప్రతి).

458. [1]అర్ధబిందు ప్రాసమున అర్ధబిందువు ప్రాసాక్షరమునకుఁ బూర్వ ముండ
వలయును. ఇట పరమునను న్నది.

461. *విన్నకోట పెద్దిరాజు (ల. శి. వ్రాఁతప్రతి).

ఇఁక నందు ఛేకానుప్రాస లక్షణము

నరసభూపాలీయము, మూర్తి. [4-70]

తే. అం దనుప్రాస భేదంబులైన శబ్ద
భవదలంకారముల మున్ను ప్రస్తుతింతు;
నడర నెడలేక రెండు రెండక్షరంబు
లెనయు నియమంబు ఛేకమౌ నెట్లటన్న. 462

[నరసభూపాలీయము. 4-75]

పంచచామరము. స్ఫురత్కృపా బలప్రతాప భూతిధైర్య భూధరా
ర్చి రంగదాన బుద్ధివైఖరి న్హరిన్హరిన్సుధా
హరున్హరు న్గిరిన్గిరి న్మహానలు న్నలుప్రమా
గురున్గురు న్జయింతువౌఁ; దగు న్నృసింహ భూవరా. 463

అందు వృత్త్యనుప్రాస

[నరసభూపాలీయము. 4-76, 77]

తే. ఒక్క వర్ణంబు కడదాఁక నుద్ధరింపఁ
బరఁగు జృంభణ వృత్త్యను ప్రాసమయ్యెఁ;
దలఁపఁ బునరుక్తియయ్యుఁ దాత్పర్యభేద
మెనయు నియమంబు *లాటమౌ; నెట్లఁటన్న. 464

చ. సమద విపక్ష శిక్షణ విచక్షణ దక్షిణదోరనుక్షణ
క్రమదసిదుర్నిరీక్ష సమరక్షపితక్షితపక్షతక్షర
త్సమధిక శోణితక్షర కృతక్షణరక్షిత పక్షిలోక నీ
గమలదళాక్షఁ దేలు బలగౌరవపింహ! నృసింహభూవరా! 465

వ. అన్నారు. మఱియు సమపదప్రాసంబును యమకంబును పాదాంతపాదాది
ముక్తపదగ్రస్తమ్ము లనఁదగు నివి ప్రాసభేదమ్ముల ప్రకారమ్ములు. మఱియు
నిఁక తత్ప్రాసిన పద్ధతి. అందు, 466

---

464. * ఈ క్రింది 465 పద్యము వృత్త్యనుప్రాసకు లక్ష్యము. లాటానుప్రాస
ములకు లక్ష్యము ఇందు కానరాదు. గ్రంథపాతమేమో!

## వర్గప్రాస లక్షణము

తే. వర్గములు ప్రాసములఁ గూర్పవచ్చునంద్రు
స్నిగ్ధరూపాక్షరములఁ బ్రసిద్ధకృతుల
బుధులు గొలుతురు కాంచన రథనివాసు
నాదితేయులు పద్మినీ నాథులనఁగ. 467

లక్ష్యము శబ్దశాసనుఁడు ఆదిపర్వము ఉత్పలము ౨-వ పాదమున ద - ధ లకు ప్రయోగము లక్ష్యము. [1-124]

ఉ. కావన కిట్టిపాటి యపకారము తక్షకుఁ డేకవిప్రసం
బోధనఁజేసి చేసె నృపపుంగవ ! నీవు ననేక భూసురా
పాదిత సర్పయాగమున భస్మము సేయుము తక్షకాది కా
కోదర సంహతిన్ హుతవహో(గ్ర సమగ్ర శిఖాచయమ్ములన్. 468

వెన్నెలగంటి సూరప్పగారు - విష్ణుపురాణము, కందము ౪-వ పాదమున ద - ధ లకు ప్రాసప్రయోగము లక్ష్యము. [3-85]

క. ఆదీవిఁ దిరిగియుండును
స్వాదూదక జలధి దాని సమవిస్తృతమై
భూదేవ యిట్లు సప్తప
యోధుల యందొక్క కొలఁది [1]నుండు జలంబుల్. అన్నాఁడు. 469

### [శబ్దరూప భేదములు]

మఱియు ఐ - ఔ లకు, హ్రస్వదీర్ఘపదములకు లక్షణ లక్ష్యములు రెంటి కిన్ని కందము. [ఛందోదర్పణము 1-5]

క. క్రియనై ఔలకు హ్రస్వ
ద్వయము నమరు నాంధ్రభాషితప్రకరములో
నయిదనఁ దగు నైదనుచో
జయకీర్తులు నవుననంగఁ జను నౌననుచోన్. 470

---

469. [1]నొందు (విష్ణు. పురా.)

'వసియించు - వసించు' ననుటకు భారతము, సోమయాజి. [ఉద్యోగ. 2-326]

తే. ఎల్లయందును దాన [1]వసించు చెల్ల
యదియుఁ దనయందు వసియించు (నం(డు) వాసు
దేవుఁడనుపేరి యర్థంబు దెల్లమింత
యెఱుఁగు జనులందుఁ దగ వసియించు శుభము. 471

'ర - ల' లకు ప్రాసము నిల్పుట సోమయాజి శల్యపర్వము ఉత్పలము ౧-వ పాదమున రేఫకున్ను కడమ మూఁడు చరణమ్ములను లకారములు గల లక్ష్యము. [1-322]

ఉ. [1]వారి యెలుంగు చూచి కృతవర్ముఁడు సైన్యము నిల్వరించి యు
న్మిలిత విక్రముండగుచు మేమెయి నాతనిఁ దాఁకె నశ్రువి
ద్యాలసితుండు సాత్యకి యుదగ్రత వారలు వారివారి దో
ర్లీలలు చూచిరోటు పడిరెండు బలంబుల[2]యొద్ద వీరులుᳲ. 472

అన్నారు. ముద్దరాజు రామభద్రయ్యగారు కవిలోకసంజీవనియందు. [1-12]

తే. సంధిఁ గూర్పంగఁ బ్రథమాంత శబ్దవితతి
పైఁ గచటతపలకు వికల్పంబు చెల్లు
కాకు సంబోధనావ్యయ కర్మధార
యమ్ముల నచేతనమ్ముల నబ్జనాభ! 473

మఱియును [ఛందోదర్పణము. 1-64]

ఆ. ఆయచేతన ద్వితీయతానిజరూప
మయ్యునుండుఁ బ్రథమయట్లనుండు

471. [1]వసియించు. (సం. శో. భా.)

472. [1]వాలి (సంశో. భా.) ఈ పాఠమున ర - ల ప్రాసకుఁ బ్రసక్తియుండదు.
[2]యోధ. (సంశో. భా.)

[1]క్రతువుగాచె దాశరథి క్రతువుంగాచె
ననఁగ నిట్లు రెండు నమరుఁ గృష్ణ! 474

అందుకు లక్ష్యము [కవిజనసంజీవని 1-13]

సీ. నుతిసేతుమనగూడునే తలంప వశమగు
నెద్రమోవిదూరనీ పదయుగంబు
రచియింతుఁ గృతులు కృష్ణచరాచరాది దే
వసిరంత[1]నో(క్రి) నీకసదృశముగ
అపరాధి నగుదునైన పదాశ్రితుఁడఁగావు
న[2]పవిత్రుఁ జేయునఁట భువన వినుత
మకరేంద్ర చకితుఁడైన కరీంద్రుఁ బాలించి
న [3]గృపానిధివి నీవు జగదజేయ

తే. కోవిదులు నీదు పదభక్తిచే వడినను
పాకశాసనుపదమైనఁ జేకొనంగఁ
గోరుదురె వారు నారద శారదాభ్ర
చంద్రనిభకీర్తి! దేవతా చక్రవర్తి! అన్నారు 475

మఱియు నవు - నగవు, పువు - పూవు లన్నందుకు లక్ష్యము

క. నవు నవ్వ నగవు నగునా
పువు పువ్వనఁ బూవనంగఁ బూదగుఁ దిగిచేఁ

474 [1]గ్రతువు గాచె దాశరథి కృష్ణుఁడొక పర్వ,
తమును గొడుగుభంగిఁ దాల్చెననఁగ (ఛం ద)

475 [1]నోద్ర (అ శి ప్రాఁతప్రతి)
[2]కావున + పవిత్రుఁ - అవ్యయముపై గసడదవాదేశమని క జ సంజీవని మతము కావునన్ - ద్రుతప్రకృతికమని కొందఱు
[3]పాలించిన + కృపా - తత్సమక్రియపైఁ దత్సమ పరుషమునకు గసడద వాదేశము.

దివిచెను బగడము పవడము
దగిలించెఁ దగిల్చె నాఁగఁ దగునిడఁగృష్ణా! 476

క. పువు పువ్వు పూలనంగాఁ
బువుఁదీఁగనఁ బువ్వుఁదీఁగ పూఁదీఁగనఁగా
దవు దవ్వనఁగాఁ దగు స
త్కవి సమ్మతి యతులు ప్రాసగతులిడఁ గృష్ణా! 477

[*కవిచింతామణి. 2-13]

ఆ. ఆదిలఘులమీఁద నర్ధబిందువునిల్వ
దొండె పైఁ డకారమున్నఁ గలుగు;
నరయఁ దఱుచుగా ననాది వకారంబు
కవిత (నొ)ప్పఁగా గకారమగును. 478

అది యెట్లంటేని,

[కవిచింతామణి 2-14]

క. పవడము పగడము వేఁకువ
నివతాళించును జలంబు లిగతాళించుఁ
దివిచెను దిగిచెను చేతం
(దవిలిచెఁ దగిలించె) నన నుదాహరణంబుల్. 479

లక్ష్యము - సోమయాజి శాంతిపర్వము రెండవాశ్వాసము పురోహిత పద్ధతి. కందము ౨-వ పాదమున ప్రయోగము లక్ష్యము. [2-308]

క. వివిధోత్పాతంబులకును
నవల్లోఁ దోఁచు కీడునకుఁ దోడ్తో శాం
తివిధానంబున నిరసన
మవును బురోహితుని చేత ననవద్యముగాఁ. అన్నారు. 480

---

478. *రామభద్రయ్యగారు అని అ. శి. వ్రాఁతప్రతి.

ఇఁక 'పువు' అన్నందుకు నైషధము కందము ౪-వ పాదమున లక్ష్యము.
[శృంగార నైషధము. 1-80]

క. శ్రవణావతంసమయ్యెన్
ధవలాక్షి గుణంబు లపుడు ధరణీంద్రునకున్
శ్రవణా వతంసమయ్యెన్
బువ్వువింటి గుణంబులపుడు పుష్పాస్త్రునకున్. 481

'పూవు' అన్నందుకు ఆముక్తమాల్యద ఉత్పలము ౨-వ పాదమున లక్ష్యము. [1-62]

ఉ. వేవిన మేడపైవలభి వేణికజంట రహించియింపుగాఁ
బూవులు గోటమీఁటుతఱిఁ బోయఁడు తీఁటులమ్రోఁతగామి శం
కావహమౌఁ గృతాభ్యసనలౌటను దంతపుమెట్లవెంబడిన్
జేవడివీణమీఁటుటలు చిక్కొడలించుటలున్ సరింబడన్. 482

మఱియు రెట్టనగారు. [*రెట్టమతశాస్త్రము. ఆ. 1. పుట. 10]

ఉ. పూవులు నక్షత్రంబులును బొందుగదోయిటఁబట్టి వానకై
భావములోన మానవుఁడు ప్రశ్నయొనర్పఁగఁ బక్షియయ్యెడన్
[1]వావిరి బేసిగాఁ బలికినన్ బహుళంబుగ వచ్చువాన, గో
త్రావలయంబునం దొకమతం బిది వేంకటరాజశేఖరా. 483

'దవు' అన్నందుకు సూరపరాజుగారు రాఘవపాండవీయము ౩-వ పాదమున సమాసమధ్యంబునను లక్ష్యము. [2-69]

మ. అనయంబున్ మదనామితాస్త్రకలనాత్యంతార్తిరాకుండఁ బ
య్యనమౌనిత్వకృతేష్టసిద్ధితఁ దిరంబైపోయె దేదీప్యమా

483. *కన్నడమున రెట్టన రచించిన శకున శాస్త్రమును అయ్యల భాస్కర కవులు ఆంధ్రీకరించిరి. ఈ జంటవులు క్రీ. శ. 16వ. శతాబ్దాంతమున నుండినవారు. ఈ గ్రంథము కనకరాయ మొదలారి వారి జీవరక్షామృత ముద్రాక్షరశాలయందు, చెన్నపట్టణమున క్రీ. శ. 1906వ. సం. న ముద్రితము.

[1] వావిరి బేసిగాఁ బలుక వారిద వృష్టియుఁ గల్గునండ్రు (ముద్రితప్రతి.)

ణ నిరూఢిం బయిఁబడ్డ యాదవుల నానావీరధర్మప్రవృ
త్తినిరర్థం బనిపించి యాత్మపురికిం దేవేరితోఁగూడఁగన్. 484

[*కవిచింతామణి. 2-10]

క. భిన్నపదప్రథమలపై
నున్నపకారంబు వత్వమొందును వశికిన్
[1]మున్న(న్ని)టి రూపముప్రాసము
నన్నవ రూపముననుండు నాళీకాక్షా! 485

అన్నారు. పకారము వకారప్రాసమైనందుకు (*శృంగారశాకుంతలము) శార్దూల వృత్తము ౪-వ పాదమున ప్రయోగము లక్ష్యము. [2-188]

శా. ఆ వాలుంగనుదోయి యానగుమొగం బాగుబ్బపాలిండ్ల పెం
పా వేణీరుచి యాతనూవిలసనం బాయొప్పు లేచూచినన్
గై వారంబగుఁగాని యెయ్యెడ శిరఃకంపంబుతోఁగూడ నా
హావుట్టింపదె యిక్షుధన్వునకు నయ్యబ్జాక్షి నీక్షించినన్. 486

ఇఁక 'కర్మువు - ధర్మువు' లనుటకు —

క. కర్మువు కర్మమనంజను
ధర్మువు ధర్మంబునాఁగఁ దగు నీకృతులన్
కర్మువులు గలఁచి మీకృప
ధర్మువు లొనఁగూర్చు భక్తతతికనఁ గృష్ణా! 487

'కర్మువు' అన్నందుకు శబ్దశాసనుఁడు ఆదిపర్వము చంపకము ౨-వ పాదంబున ప్రయోగము లక్ష్యము. [4-250]

చ. అ కని యరాజకంబయినయత్తఱి భూప్రజలందు సర్వ క
ర్మువులు దొలంగు దేవముని ముఖ్యులు వాయుదు రోలి వృష్టితే

485. *రామభద్రయ్యగారు అని అ. శి. వ్రాఁతప్రతి.
[1] మున్నిటి. (అ. శి. వ్రాఁతప్రతి.)
486. *భాస్కరరామాయణము అని ల. శి. వ్రాఁతప్రతి.

దవు, మఱి [1]యర్ఘ్యముఁ దఱుఁగునందురు గావునఁ గాలయాపనం
బవితథవాక్య ! చేయక నయంబున నిల్పుము రాజ్యమిత్త్రఱిఁ. 488

'ధర్మవు' అన్నందుకు సోమయాజి శాంతిపర్వము చంపకము 3-వ పాదమున ప్రయోగము లక్ష్యము. [1-1]

చ. భువనభయంకరమ్ములగు పోరులఁదమ్ములతోడఁగూడ నీ
వువెడలుటొప్పు లెస్స యలవుఁ బలముఁ వెలయించుచోట ధ
ర్మ్మవున కొకింతయుఁ దొలఁగఁ ద్రొక్కమి యెంతయు మేలు దీనఁ గౌ
రవకులముఖ్య ! యుమ్మలికఁగ్రాచితె చిత్తము శాంతిఁబొందెనే ? 489

వ. మఱియును, 490

క. కనుకన్ను కన్నుఁగవ నాఁ
గనుఁగవ కన్గవ యనంగఁ గన్నుంగవనఁ
కనుదోయి కన్నుదోయనఁ
జనుఁ గందో యనఁగ సుకవిసమ్మతిఁ గృష్ణా ! 491

వ. మఱియును, 492

క. చివురనఁగఁ జిగురనంగను,
నెవమన నెపమనఁగ, నేతు నేత్రుననంగఁ,
భువిఁ దగుఁ దీవనఁ దీఁగనఁ
గ వెలలె వెడలె ననిచెప్పఁగాఁ జనుఁగృష్ణా ! 493

మఱియు చను – కను – చివ్రు ర నేందుకు లక్షణము —

క. చను చన్ను చన్నుఁగవనాఁ
జనుఁగవ చన్గవ యనంగఁ జన్నుంగవనఁ
గను చందోయి యనంగను
చనుదోయనఁ జన్నుదోయి చనునిడఁగృష్ణా ! 494

---

488. [1]యర్ఘ్యవుల్ (సంశో. భా.)

'పువు - పువ్వు' అన్నందుకు ప్రయోగము *(సు)భద్రాపరిణయము ౧-వ పాదమున, చివురన్నందుకు ఆరెండవ పాదమునను లక్ష్యము [1-84]

ఆ సువ్వఁ బువ్వు నవ్వు జవ్వని నాసిక,
చివురు సవురు జవురు నువిదమోవి,
మబ్బు నుబ్బు గెబ్బు బిబ్బోకవతివేణి,
(మెఱపు నొఱపుఁ బఱపుఁ దెఱవమేను) అనుట. 495

'నెపము' - అన్నందుకు శబ్దశాసనుఁడు (*ఆదిపర్వము) కందము ౪-వ పాదమున లక్ష్యము [8-112]

క. విపరీతగతిని సుందుఁడు
నుపసుందుఁడు దాఁకి పోరి రొండొరులు మహా
కుపితాత్ములై తిలోత్తమ
నెపమున దృఢఘోరముష్టి నిర్ఘాతములన్ 496

'నేతు' - అన్నందుకు సోమయాజి విరాటపర్వము కందము ౨-వ పాదమున లక్ష్యము [1-196]

క ద్యూతక్రీడకుఁ గొండొక
నేతుఁ గపటమునకు నోపని జనమ్ములు నా
చేతి ధనమెల్లఁగొని పరి
భూతి యొనర్చిన విరక్తి పుట్టి వెడలితిన్ 497

'చివు' రన్నందుకు మఱియును ప్రయోగము, శ్రీనాథుఁడు, నైషధము మత్తేభము ౧-వ పాదమున లక్ష్యము [శృంగారనైషధము 3-34]

మ పవిసంగంబునఁ దాపమొందిన శచీప్రాణేశు కెంగేలికిం
జివురుం గైదువుజోదు వైద్యముపదేశించెన్ రహస్యంబుగా

---

495 *చేమకూర వేంకటకవి విజయవిలాసమునకు 'సుభద్రాపరిణయ' మని నామాంతరము

496 *సభాపర్వమని ల శి. వ్రాఁతప్రతి.

నీవనీహారపయోమిళన్మలయజ స్నానార్ద్రపర్యంతమై
యువతాళించు విదర్భరాజతనయా హృద్యస్తన ద్వంద్వముల్. 498

'వెలలె' నన్నందుకును మఱియు నందే శ్రీనాథుఁడు చంపకము ౨-వ పాదమున లక్ష్యము. [శృంగార నైషధము. 4-24]

చ. చిలుకలు గూయునో చెవులు చిల్లులువోవఁగనంచు నెన్నఁడున్
వెలలఁడు నందనోపవనవీథులకై; యటు మౌళిభాగని
ర్మలశశిరేఖ సేయు నపరాధము నంగజదైత్యశాసనుం
గొలువఁడు పాకశాసనుఁడు కోమలి, నీదెసఁగూర్మి యెట్టిదో! 499

'జలజాత' శబ్దము 'జడజాత' మనినందులకు ప్రౌఢకవి మల్లనగారు రుక్మాంగద చరిత్ర సంధ్యావళి వాక్యము పంచమాశ్వాసము కందము, ౩-వ పాదమున 'జడజాత' శబ్దప్రయోగ లక్ష్యము. [5-47]

క. *పడఁతీ, నీతలిదండ్రుల
కడకున్ గొనిపోమనిన్నుఁ, గలఁగకుమని యా
జడజాత నేత్రిఁ బద్మిని
నోడఁబడఁగా గారవించి యుచితప్రీతిన్. 500

'చన్నుఁగవ' అన్నందుకు ప్రయోగము సోమయాజి విరాటపర్వము కందము ౪-వ పాదమున లక్ష్యము. [1-291]

క. వలపలి నిక్కు నొకించుక
మలఁగంగఁ దుఱిమి తుఱుము మాపుడుపుట్టం
బలవడఁ గట్టి జరఠవ
ల్కలముల [1]నెఱిమల్కి చన్నుఁగవఁ గప్పితగన్. 501

---

500. *వావిళ్ల ప్రతిలో 'జలజాతనేత్రి' అని అ-డ ప్రాసమున్నది. ఇది పరిష్కర్తల కార్యము కానోపును. అ. శి. లో 'నేత్రి' అను రూపమున్నది.

501. [1] నెవ్వఁగుఁ జన్నుఁగవ (సంశో. భా.)

'కన్నుఁగవ' అన్నందుకు ప్రయోగము సోమయాజి *శల్యపర్వము గీతి ౨-వ పాదమున లక్ష్యము. [1-230]

తే. నెరయు కినుక పెన్వేఁడయై నిప్పులురల
కన్నుఁగవ శల్యుఁజూచిన యున్నయునికి
నతఁడు నీఱుగాకుండుట యరిది యయ్యె
మాకుఁ జూడంగ నప్పుడు మనుజనాథ! 502

## [శ ష స ప్రాస]

మఱియు శ ష స లు ప్రాసము చెల్లుటకు కౌస్తుభాభరణాంకుఁడు లక్షణము.

క. అసదృశ శషసలు సాతో
సుషమంబుగఁ బ్రాసమౌ శషోస్పషయనఁగా
విశదముగ సూత్రసమ్మతి
నసమాయుధ జనక కౌస్తుభాభరణాంకా! 503

అన్నాఁడు. ఇందుకు ప్రయోగము [*వేములవాడ భీమకవి చాటుధార] చంపకము ౧-వ పాదమున శ - స లకు ప్రాస ప్రయోగము.

చ. బిసరుహగర్భువ్రాఁతయును విష్ణువు చక్రము వజ్రివజ్రముం
గసకపుఁబాము కాటును గుమారుని శక్తియు[1] మౌని కోపముం
దశరథసూను బాణమును ధర్మజు వాక్యము [2]కర్ణునీతియుం
బశుపతి కంటిమంటయును [3]బ్రహ్మణశాపము రిత్తవోవునే? 504

---

502. *కర్ణపర్వమని అ. శి. వ్రాఁత ప్రతి.

504. *శబ్దశాసనుఁడు ఆదిపర్వము అని అ. శి. వ్రాఁత ప్రతి.

1 మౌని రోషముస్ కాలుఁదండము. (అప్ప. 3-91).

2 మౌనిశాపము. (అప్ప. 3-91).

3 పండితవాక్యము. (అప్ప) 'బ్రాహ్మణ' అనుటకు 'బ్రహ్మణ' అని ప్రయోగించెను.

'బీభత్స' శబ్దము 'బీబచ్చం'దన్నందుకు బ - భ లు ప్రాసము చెల్లుటకు సోమయాజి ఉద్యోగపర్వము కందము ౧-వ పాదమున లక్ష్యము. [1-238]

క. [1]ఆ బీబచ్చుని భూరి భు
జాబలమును దుర్నివారశౌర్యము శరవి
ద్యా బహాలతయును బందికి
నై బవరము సేసినట్టి హరుఁడ యెఱుంగుఁ. 505

డ - ఢ లు ప్రాసము చెల్లుటకు ప్రయోగము సోమయాజి కర్ణప(ర్వము) ప్రథమాశ్వాసము గీతి ౪-వ పాదమున లక్ష్యము. [1-30]

తే. శక్తులను దోమరమ్ముల సరభసముగఁ
బోరుచో భీమసేనుని పేరురమున
క్షేమధూర్తి సముజ్జ్వలతోమరమ్ము
లేదు నాటించె దర్పమ్ము [1]రూఢికెక్క. అన్నారు. 506

ఇఁక రామభద్రయ్యగారు. [కవిజనసంజీవని. 1-40]

క. ఏవాఁడెవ్వాఁ డెవ్వఁడు
నావర్తిలుఁ గృతులయందు నళినాక్ష గుణ
శ్రీ వర్ణింపఁగ సురలం
దేవాఁడు గలాఁడు ననఖగేశతురంగా. 507

'ఏవాఁడ'న్నందుకు ప్రయోగము సోమయాజి (*శాంతి)పర్వము కందము ౧-వ పాదమున లక్ష్యము. [1-52]

---

505. [1]ఆ బీభత్సుని (సంశో. భా.) కవి నిర్దేశించిన ట్లిందు బ - భ ప్రాస లక్ష్యము గానరాదు.

506. [1]రూఢికెక్క. (భార. వావిళ్ల.)

508. *విరాటపర్వమని అ. శ. వ్రాఁతప్రతి.

క. ప్రవాసి బంధుమిత్రులు
జీవధనంబులను నొంపఁ జెందుదురు గృశుం
గా వాని నెన్నఁగాఁ దగుఁ
గేవల తనుకార్శ్యయుతుఁడు కృశుఁడే తలఁపన్. 508

మఱియు సందేకందము ౪-వ పాదమున లక్ష్యము. [విరాట. 2-256]

క. [1]నీవాకతేల మఱిం బది
వేవురనే [2]వెదకి పట్టి వేఁడిన నడ్డం
బై వచ్చిన వలదన నిం
దేవాఁడు [3]గలాఁడు నీవు నెఱుఁగవు గంటే. 509

ముద్దరాజు రామభద్రయ్యగారు. [కవిజనసంజీవని. 1-45]

క. [1]పూంచెన్ మంచెన్ బంచె న
టంచుఁ బ్రయోగింపఁ జెల్లు నమరశ్రేణిన్
మంచె మనోరథసుకరము
[2]పూంచె రమాధవుఁడు భక్తపోషణుఁడనఁగన్. 510

[1]'పూంచె' ననుటకు ప్రయోగము సోమయాజి విరాటపర్వము ౩-వ పాదమున లక్ష్యము. [4-45]

క. కాంచనమాలాలంకృత
చంచత్తనులీలమెఱయ జవనాశ్వములన్
[2]బూంచి రథమ్మున మణిమయ
పంచానన కేతువెత్తె బంధురభంగిన్. 511

1నీవొకత వేల యిల. (సంశో. భా.)
2వలచి పట్ట వెదకిన (సంశో. భా.)
3మగండు దీని. (సంశో. భా.)

510. 1పూంచెం బూనిచెఁ బూన్చె. (క. జ. సం.)
2'పూన్చె' అని ల. శి. వ్రాఁతప్రతి.

511. 1, 2 'పూన్చె' అని ల. శి. వ్రాఁతప్రతి. ఈ సంయుక్తరూపమును గ్రహించిన ప్రాసభంగమగును.

[1]'మంచితి' నన్నందుకు శబ్దశాసనుఁడు ఆదిపర్వము ఉత్పలము ౧-వ పాదమున లక్ష్యము. [2-200]

ఉ. పెంచితి ధర్మమార్గములఁ బ్రీతియొనర్చుచు ధారుణీప్రజన్
మంచి తనేకయాగముల మానుగ దక్షిణలిచ్చి విప్రులన్
నించితి సజ్జనస్తుతుల నిర్మలమైన యశంబు దిక్కులన్
సంచితపుణ్య సర్వగుణసంపద నెవ్వఁడు నీసమానులే? అన్నారు. 512

సోమయాజి శల్యపర్వము చంపకము ౩-వ పాదమున లక్ష్యము; శల్య వధార్థము ధర్మరాజు పరమేశ్వరుని వేఁడుట. [1-265]

చ. స్ఫురితషడర్ధనేత్రునిఁద్రిశూల సముజ్జ్వలు నిర్గుణున్ గుణా
దరసముదాత్తమూర్తిఁ గలితప్రభవస్థితి సంహతిక్రియా
నిరత వివర్తిత త్రిభువనీ మహనీయుని దైత్యమర్దన
స్ఫురుషవరున్ జతుర్భుజు విభుత్వమహోజ్జ్వలు నాశ్రయించెన్.
అన్నారు. 513

[ అగస్త్య వ్యాకరణ విషయము ]

వ. మఱియు నందు నిఁక నగస్త్యవ్యాకరణంబున అగస్త్యప్రోక్తంబైన వికృతివ్యాకరణంబునందు ఆంధ్ర మైదువిధంబుల వర్తిల్లు; నవియెయ్యవి యంటేని - తత్సమంబనియు, తద్భవంబనియు, శుద్ధాంధ్రంబనియు, అపభ్రంశమనియు నైదు(?)విధంబులఁ బ్రవర్తిల్లు. అందు తత్సమంబనునది సంస్కృత ప్రాకృత శబ్దములతో సమానంబైయుండు, నదియెట్లంటేని యందులకు వికృతి వ్యాకరణసూత్రములు.

సూ. మహతోఽత ఉత్॥ వృ. మహతః అతః ఉత్.

---

512. [1]'మన్చితి' అని ల. శి. వ్రాఁతప్రతి. ఈ రూపము గ్రహించిన ప్రాస భంగమగును.

514. (?)అయిదవ విధము పేర్కొనఁబడలేదు. ప్రతిలో ఆదర్శము లుప్తమై యుండును. ఇచట దేశ్యమను విభాగముండవలయును.

సూ. మహతస్సోర్డుజ్॥ వృ. మహత స్సుప్రత్యయపరే డుజ్ స్యాత్. అన్నారు.
ఇందుకు శబ్దశాసనుఁడు ఆంధ్రశబ్దచింతామణియందు

గ్యావృత్తము॥ 'స్త్రీపశుజడాన్వినాన్యేమహదాఖ్యా
స్త ద్విశేషణా శ్చాపి ।
మహతోఽత ఉద్విభక్తౌ
మహతస్సోర్డుజనితో భవేత్పుంసి.' (అజంత. శ్లో. 33)

అన్నాఁ డిందుకు స్త్రీవాచక పశువాచక జడవాచకములైన శబ్దములు వినాగాఁ గల పురుషవాచక శబ్దములున్ను వాటికి విశేషణములున్ను మహత్తులనే సంకేతము కాఁబట్టి 'మహతోఽత ఉత్' అనే సూత్రంచేతను మహత్తైన పురుషవాచకశబ్దముయొక్క, అతః అత్తుకు, ఉత్ ఉత్వము వచ్చును. ఎటువలెనంటేని - రామః అనే శబ్దము పురుషవాచకము గనుక మహత్తైన పురుషవాచకశబ్దము తుదనుండే విసర్గలకు లోపము వచ్చి ఆ మకారము మీఁదనుండే అత్తుకు ఉత్తువచ్చును. 'రాము' అని యుండును. 'మహత స్సోర్డుజ్' అనే సూత్రముచేత ఆ మహత్తైన 'రాము' అనే శబ్దము యొక్క సోః - సు ప్రత్యయమైన ప్రథమైక వచనమునకు డుజ్ వచ్చును. 'రాము డుజ్' అని యుండును. 'అనుక్తమన్యతః' అను శబ్దానుశాసనము అనుటచేత శబ్దశాస్త్రమున 'హలన్త్యం' అను సూత్రముచేత జిత్తుకు లోపము వచ్చును గనుక డుకారముమీఁద ఉండే జాకు లోపము వచ్చి 'రాముఁడని' ఉండును. ఈ ప్రకారంగానే కృష్ణుఁడు, పురుషుఁడు, ఇవి మొదలైన పురుషవాచక శబ్దముల కన్నిటికిని సరిచూచుకొనేది. "సువర్ణదండైక సితాత పత్త్రిత జ్వలత్ప్రతాపావళి కీర్తిమండలః" అనే నైషధ కావ్యమందు (1 - 1) నుండే 'మండలః - మండలుండు' అని తెలుఁగున తత్సమమేలాగయ్యేనంటేని - యీ రీతి కీర్తిప్రతాపములు గల నలునికి విశేషణం గనుక, అనల శబ్దము పురుష వాచక మహత్తు గనుక ఆ పురుషవాచక శబ్దానకు విశేషణము గనుక 'మండలః' అనే విసర్గకు లోపము వచ్చి లకారము మీఁద అత్తుకు ఉత్తువచ్చి ఆ ప్రత్యయమైన ప్రథమైక వచనానకు డుజాదేశము వచ్చి జిత్తుకు లోపము వచ్చి 'మండలుఁడు' అని అర్ధానుస్వారంతో నిలచెను. పూర్ణానుస్వార అర్ధాను

స్వారములు తెలుఁగున ముఖ్యముగా వచ్చును గనుక 'మండలుండు' - మండలుఁడు' అని యుండును. "హ్రస్వోవా ఖండః. పూర్ణోవాఖండః. ఖండఏవ దీర్ఘం స్యాత్." అనుటచేత నీలాగ తత్సమశబ్దములకు వాటి విశేషణములకున్ను సరిచూచుకోవలయును.

ఇఁక నందు తద్భవ శబ్దములకు —

తద్భవమనఁగా సంస్కృత ప్రాకృత శబ్దములంబుట్టిన తెలుంగు లనుట. 'త్రిలింగ' శబ్దమున 'తెలుఁగు' అనే శబ్దము నటువలెనె పుట్టె. అది యెట్లంటేనియు — శ్రీ పర్వత కాళేశ్వర ద్రాక్షారామ మధ్య దేశం త్రిలింగాకారమ్ గనుక, ఆంధ్రదేశానకు సంస్కృతాన త్రిలింగరాజ్యం అనే పేరుగలది. ఆ త్రిలింగ అనే పేరు ఒక 'త్రి' అను మొదల వర్ణమునకు — "రవలామధశ్చ - అధో వర్తమానానాం రేఫ వకార లకారాణాం లోపస్స్యాత్" అనే అగస్త్య వ్యాకరణసూత్రం చేత తకారం క్రిందగా నుండే రేఫకు లోపం వచ్చును. 'త్రిలింగా' అనేటప్పుడు 'త్రిలింగ' అని యుండును. 'ఇనైచావన్యోన్యం' అనే సూత్రంచేత 'ఇన్ను' కల 'ఏచ్చు'కు 'ఉన్ను'ను, కావలసినచోట తెనుఁగుల కూడివచ్చును గనుక తకారంమీఁద ఇనైన ఇకారానకు ఏజైన ఏకారం వచ్చెఁ గనుక తెలింగా అని ఉంటేను 'ఉదితశ్చ' అనే సూత్రంచేత ఇకారానకు ఉకారం, ఉకారానకు ఇకారం వచ్చెఁ గనుక లకారంమీఁద ఉండే ఇకారానకు ఉత్వము వచ్చు గనుక 'తెలుఁగా' అని యుండెను. 'అచః ప్రతిపదం కాత్యాయనశ్చ' అనే సూత్రంచేత తెలుఁగున అచ్చునకు ప్రతిపదం కద్దు గనుక 'తెలుగు' అని ఉండెను. హ్రస్వాక్షరంమీఁద పూర్ణానుస్వారం వికల్పంగనుక 'తెలుంగు' అని ఉండెను. 'తెలుఁగు' అని అనవచ్చును.

"నణ డలా మిహా న్యాన్యం" — అనే సూత్రంచేత యీ తెలుఁగులో నకార ణకార డకార లకారములకు అన్యోన్యం కద్దు గనుక 'తెలుగు' అనే పదములో ఉండే లవర్ణమునకు నకారం వచ్చి 'తెనుగు' అని యుండును. త్రిలింగ శబ్దముమీఁద తద్భవమై పుట్టిన తెనుఁగుశబ్దం. ఇది సుశబ్దం ఆ తెలుఁగు శబ్దానకు అభేదముగాఁబుట్టిన శబ్దం 'తెనుఁగు'

అనే శబ్దం కాఁబట్టి 'తెలుఁగు' అనే మాట ముఖ్యమైన తద్భవమనుట. 'తెనుఁగు' అనే శబ్దం కేచిత్పక్షం.

మఱియు, "మనయా మధోవర్తమానానాం - అధోవర్తమానానాం మకార, నకార యకారాణాం లోపస్స్యాత్" అనే సూత్రంచేత నీ తెనుఁగున ద్విత్వములైన మకార నకార యకారములకు లోపము వచ్చును. అది యేప్రకారమున నంటేని 'ముత్యం' అనేటప్పుడు ఆ క్రిందనుండే ద్విత్వయకారమునకు లోపంవచ్చి 'ముత్తెం' అని యుండును. 'కన్య' అనేటప్పుడు యకారానకు లోపంవచ్చి 'కన్న' అని యుండును. 'భగ్నం' అనేటప్పుడు ద్విత్వనకారమునకు లోపంవస్తే చతుర్థ భకారం తృతీయ వర్ణం బకారంవచ్చి 'బంగ' అని యుండెను. 'బంగపాటు' నటువలెను. ఈరీతి సకల శబ్దములకు తెలియవలెను. ఇది అగస్త్య వ్యాకరణిసూత్రప్రకారము. *అథర్వణాచార్యులు, 'ఆంధ్రశబ్దచింతామణి' వ్యాఖ్యానం మొదటను,

"వాచా మాంధ్రమయీనాం యః
ప్రవక్తా ప్రథమో భవత్
ఆచార్యం తం కవీంద్రాణామ్
వందే వాగనుశాసనమ్."

అన్నాఁడు. కాఁబట్టి ఆంధ్రకవనమునకు శబ్దశాసనుఁడె ముఖ్యం డనుట. మఱియు నిఁక నందు, 514

## రేఫ ఱకార లక్షణములు

తే. పరఁగు రేఫకురేఫయె ప్రాసమగు (ఱ)
కారమైన ఱకారంబ (గలుగు)ఁ గృతుల
కవిత రేఫ ఱకారసంకలితముగను
చెల్లవిడ, మూఁటి కొక్కటి చెల్లుఁగృష్ణ! (?) 515

514. * ఈ శ్లోకము బాలసరస్వతీయము లోనిది. (సంజ్ఞాపరిచ్ఛేదారంభము).

515. (?) ఈ పాదభాగార్థము స్పష్టము గాదు.

వ. మఱియు నెట్లంటేని, 516

తే. సంస్కృత పదమ్ములందుఁ దత్సమములందుఁ
దద్భవములఁ గ్రియాపదాంతాక్షరములఁ
గల్గు రేఫలు గృతుల నిక్కముగ వీని
మీఁద బండి [1]ఱకారములేదు కృష్ణ! 517

తద్రేఫ ఱకార ప్రకారము

సీ. అద్వయి ఋద్వయి ఉద్వయి ఏ ఓ లఁ
గలుగును రేఫఱకారములు, [1]ఋ
ౠ ఌ ౡ ఐ ఔ ల రేఫలు గలిగినఁ
గలుగున్న లేదు ఱకార మరయఁ
జను హల్లులను క గ చ జ త ద న ప బ మ
[ర వ స ల] లనెడి వర్ణములపైన
రేఫఱకారముల్వేలయును ఖ ఘ ఛ ఝ
ల్మఠి ర ఢ ధ ధ ఫ భ ల్య శ ష హ క్ష

తే. లనెడి వ్రాలందు రేఫలే దనరుఁ గాని
ధర ఱకారంబులేదు సిద్ధంబుఁ గృతుల
జూవె నన్నయభట్టాది సుకవి వరుల
కవితలందెల్ల వెదకినఁ గడఁగి కృష్ణ! 518

వ. మఱియు ఋ, ౠ, ఌంబులు శబ్దముల యందలివి యప్రసిద్ధంబులగుట
నెల్లవారికిం దెల్లంబగు నది యట్లుండె వెండియు తద్రేఫ ఱకార ప్రకా
రంబులు ప్రకాశంబగు తెఱంగెఱింగించెద నవధరింపుము 519

చిత్రకవి పెద్దనగారు [లక్షణసారసంగ్రహము. 3-4]

---

517 [1]రకారము (ల శి వ్రాఁత ప్రతి).

518 [1]ఋ, ౠ, ఌ, ౡ లు సంస్కృతాక్షరములు శుద్ధాంధ్రమున నుండవు వీనిపై ఱకారము లేదని చెప్పుట యనవసరము.

తే. పృథివి జీవుఁడిఱుఁడను నభేదవాది
వలెనె వాదించి కుకవి దుర్వాది సభల
తాను రేఫశకటాకు భేదమెయ్యనునది
కృతులఁజెప్పుట సుకవి సమ్మతముగాదు. 520

[ల సా సం 3-౯]

క ఇడఁదగు రేఫకు రేఫయె
యడరఁగఁ బ్రాసము ఱకారమైన ఱకారం
బిడఁదగును గాని రెండును
[1]బడిఁగలయఁగఁ జెప్పరాదు పావనివింటే! 521

[ల సా. సం 3_10]

సీ సంస్కృతార్ణములఁ దత్సమములగు తెలుఁగుల
యందుఁ గ్రియాపదాంతాక్షరములఁ
బలుకుచో రేఫలు గలుగు నింతియ కాని
కలుగదు బండి ఱకార మరయ
అద్వయి ఇద్వయి ఎద్వయి ఓ ఓ ఉ
[2]క గ చ జ త ద ప బాక్షరములెన్న
న మ ర వ స ల లిన్ని యూష్మర నిర్వదిరెండు
వీనిపై తా రేఫ ద్విత్తతు లొదవు

తే వాని వర్ణలచేఁ దేర్తు వరుసతోడఁ
గడమ ఝఢువడి తొమ్మిదక్కరముల తుదఁ-
గదిసి రేఫలు గలిగినఁ గలిసెఁగాని
మఱి ఱకారంబు లేదెందు మాదుత్తిసుత! 522

[లక్షణసారసంగ్రహము 3-11]

---

521 [1]వడి (ల శి వ్రాఁతప్రతి).

532 [2]క గ చ జ ద ప బాక్షరములెన్న (ల సా సం ప్రా)

వ (ఇందు) సంస్కృత పదమ్ముల తత్సమమగు తెలుఁగు పదమ్ముల రేఫము
గలవు ఱకారంబులు లేకుండుట సుప్రసిద్ధమగు క్రియాపదాంతాక్షర
ములపై వచ్చు రేఫ వర్ణంబు లెట్టివనిన, 523

తాళ్లపాక [*తిరుమలయ్య]గారు [రేఫ ఱకార నిర్ణయము 3]

క ఇచ్చిరి తెచ్చిరి యనియెడు
యచ్చ [1]తెనుంగులఁ గ్రియాపదాంతంబులపై
వచ్చినవి యెల్ల రేఫలు
రచ్చల చెడలవిర, ధలల రచనలు కృష్ణా! (?) 524

చిత్రకవి పెద్దనగారు [లక్షణసారసంగ్రహము 3-12]

క వ్రాసిరి తెచ్చిరి యోపిరి
సేసిరి వచ్చిరి యనంగఁ జెన్నగుక్రియలం
డాసిన తెలుఁగులఁ గలయవి
భాసురముగ రేఫలయ్యెఁ బవనతనూజా! 525

[లక్షణసారసంగ్రహము 3-13]

తే రేఫక్రిందట ద్విత్వమౌ రేఫలేదు
ఘనఱకారంబె ద్విత్వ ఱకార మగును
అఱ్ఱునను నల్పునొకయిఱ్ఱి మఱ్ఱినీడ
నఱ్ఱుగుఱ్ఱంబు గలవానికుఱ్ఱ వినుము 526

వ మఱియు పెద్దనగారు అకారాదులపై వచ్చు రేఫ ఱకారంబులు వర్గక్రమం
బున (వివరించిరి) అందు అకారంబుపై వచ్చు రేఫలు ఎట్టివనిన సావ
ధానంబుగా విన నవధరింపుము 527

[లక్షణసారసంగ్రహము 3-15]

---

524 *చిన్నన్నగారు (ల ? వ్రాఁతప్రతి)

[1] తెనుంగులు క్రియాపదాంత తురపై. (ల ? వ్రాఁతప్రతి)

సీ. అరిగొన నరదాన నరిగెను నరవాయి
గొనకరుదరగంటఁగనియె నరయ
నరపి చల్లారఁ గన్నార నారెడు నన
నారంగ ధర్మంబు నారఁగూడె
నారఁగాఁగిన పాలు నారెకు లారాట
మారటం బారనియగ్గి యారె
నారయ నట్లు పొంగారె నారంగ న
ద్వయిమీఁద రేఫ లిర్వదియు రెండు

తే. ఇరవు నిరువురు నిరువది యిరుగెలఁకులు
నిరము నిరవార నొల్లఁబోయి రనసీరె
నీరి కలుపట్టె నీరేడు నీరెలుఁగనఁ
బదునొకొండ్రేఫ లిద్వయిపయిని హనుమ! 528

మఱియు నిఁక ఉకారంబుపై రేఫ లెట్టివనిన —

[లక్షణసారసంగ్రహము. 3-17]

సీ. ఉరవట యురవణిం చురిమెడి యురులఁద్రో
యుట డెందమురియాడ మరియు ననఁగ
నురుశింప నూరకయుండుట నూరార్చు
టూరట పుచ్చుట యూరనుండి
యన నుద్వయంబుపై నొకరు రేఫలు పదు
నొండివి కృతులలో దండిమెఱయు
నుఱవుగ రిపులపై నుఱుకుడు బలిమిఱి
యుఱుముచు నుఱుకఱి నుఱుకచేతు

తే. లూఱడిల నూఱు ననఁగను నూఱుగడన
నూఱొ నన నుద్వయంబుపై నుప్పతిల్లు
బండిఱా లివి పదియయ్యెఁ బరఁగఁ దెలుఁగుఁ
గృతులఁ గవు లిఁకఁ బొలుపొందఁ గీశనాథ. 529

[లక్షణసారసంగ్రహము. 3-18]

సీ. ఎరగలి కెరువది యెరగాఁగ నెరియంగ
నెరికె యేరికెయన నెరవిడుమన
నేమీఁదిరేఫ లివేదగు నొండొరు
లొరు లొరసిలఁగ మిన్నొరయ నొరిమె
నొరల కొరిచి తొరి యనఁగ రేఫ
లెన్మిది యొమీఁద నెసఁగె నింక
నె(ఱ)కలు నెఱచియు నెఱు[1](కు)లు నెఱుకయు
నెఱసంజ యెఱుపును నెఱగు ఱెఱువు

తే. ఎఱుఁగుటనఁ దొమ్మిదేమీఁద నెనయుఱాలు
యొఱువ దొఱవుల నొఱగాలు నొఱిగెననిన
నొఱపుగలకత్తి యొఱలోన నొఱలు టనఁగ
[2]ఏడుఱాలివి ఓమీఁద నెసయు హనుమ! 530

వ. ఇఁక కవర్గమీఁదఁగల రేఫ లెట్టివనిన, 531

[లక్షణసారసంగ్రహము. 3-19]

సీ. కారుక్రొమ్మొగులు తొల్కాఁరిఁగరమొప్పంగఁ
గురియఁ గరిసెన మొక్కారుఁడు చేసి
కొరప్పనంబు చేకూర నిడుకరణి
కూర కొరాకులు కూరుటయును
గరకరఁ గాలంగఁ గరఁగి కరువుఁబోపి
కొరికి కూరిమి కొరఁజేసెఁ
గరవాలు కరువలి కారింప కూరుకు
కూటుతు కారాట కారనంగఁ

ఆ. గూరనాటినమ్ము కొరప్రాణ మనఁ గారి
యంబును గరి గోరునది కరకరి

530. [1]ఎఱుకలు. (ల. సా. సం.)

[2]సప్తసంఖ్య ఱాలోమీఁద జరగు సభవ. (ల. సా. సం.)

కారులు కెర లనఁగ కారాది రేఫలు
ముప్పదియును రెండు ముఖ్యచరిత 532

ఇఁక కకారాదిపై ఱకారములు [లక్షణసారసంగ్రహము 3-20]

సీ. కుఱుఁగట కొఱమాలి కొఱఁతపడి కుఱుచ
కఱవునఁ గొఱగాదు కొఱవి యనఁగఁ
గఱటిఁ దెల్పగరాదు కాఱియ కఱకంఠ
కొఱలి కొఱలువచ్చెఁ గెఱయ ననఁగ
గఱకులు కుఱుకొని కాఱుడు కొఱపంబు
కొఱగల్గు కుఱుమాపు కుఱుకుఱయన
కొఱడల కొఱుకు కాఱులక్కఱ
ఠవతికఱపెను కఱపతి[1]

తే. కఱతల కలికి కఱదులు కఱకటిగొన
కొఱికి కఱకేకి కొఱగుట కఱకఱయన
గలకకారాది [2]బండి ఱకారసంఖ్య
తెన్ను ముప్పది నాల్గయ్యె వినజమంత్రి 533

ఇఁక నందు గకారముమీఁదఁగల రేఫ లెట్టివనిన, [ల సా సంగ్రహము 3-21]

సీ. గురువులు పారఁగ గరుదాల్చె మేఁగొర
గరువతనము గఱఁగిరి గురువుగ
గురుసులు గురుగు లెగిరిపడి గిరగిర
గురుసు సింగారము గరగ గరిత

---

533 [1] పాఠము సరిలేదు. పోల్చుకొనుటకు పాఠాంతరము ఉపలబ్ధము కాలేదు లక్షణసారసంగ్రహమున 3 పాదములే కలవు, ఎత్తుగీతిలోఁ గడపటి రెండు పాదములు మాత్రము కలవు.

533. [2] పెద్ద ఱకారసంఖ్య (ల సా సం, పాఠము) బండి ఱకారసంఖ్య. (ఆ. శ. వ్రాఁతప్రతి)

గౌరాము ప్రగ్గిరి గరిసెఁడు బంగారు
గురుగులు గరువము గోరమనఁగ
విరువదియొక రేఫ లివి గకారముమీఁద
గిఱుపుట కొఱియల గిఱిచి పగఱు

తే. గుఱుతు, గీఱుట గఱి గుఱి గొఱక గొఱిజ
గిఱుక గఱుగులు గుఱుగుఱు గుఱుగు గఱిసె
గఱులు డగ్గఱి గిఱుమెట్లు గుఱుక గిఱికొ
నె నన ఱొలిరువది గోపరిని ననిఱజ. 534

ఇఁక చకారముపై రేఫ లెట్టివనిన —

[లక్షణసారసంగ్రహము. 3-22]

సీ. చేరువ తెచ్చిరి చేచ్చేర చేరిరి
చెఱుపుటచ్చెరువును చోరకయనఁగఁ
చోరవ యచ్చరలనఁ జూరెయచ్చరియము
చిరిమేనవచ్చిరి చెరిపిరి యనఁ
చిరుగని చెరఁగుల చీరలు నిచ్చిరి
యనరేఫలివి పదునెనిమి దయ్యెఁ
చిచ్చఱపిడుగును చిచ్చఱకును చోఱ
చిఱుకొట్టు చిఱిమి ముచ్చిఱుతనంబు

తే. చూఱ విడుచుట క్రచ్చఱ చఱచఱ యనఁ
గఱుల చఱచుట చిఱుపులి గట్లచఱులు
చెఱలుటయు నేలచఱచుట చెఱనిడుటయుఁ
జెఱిసగము చిఱుపుచ్చుట చెఱిగొనుటయుఁ. 535

వ. మఱియును, 536

[లక్షణసారసంగ్రహము. 3-23, 24]

ఆ. చెఱకు విల్లు చెఱపుసేయుట చెఱచుట
చెఱువు చిఱునగవును జిఱుత యనఁగఁ

జాఱుకు ముట్టెననఁగ క్షోణి నిర్వదియైదు
చపరమైన ఱాలు శంభు తనయ. 537

వ. ఇఁక జకారంబుపై రేఫలు లేవు. 538

ఱకారము లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-25]

తే. జఱభి జెఱిపోతు జఱజఱ జాఱెననఁగ
జఱిగొనియె జాఱుపుచ్చుట జీఱిజీఱియన
జోఱజోఱ యనంగ [1జుంజుఱు నెఱులనంగ]
తొమ్మిదివి జకారంబుపై దొడ్డఱాలు. 539

ఇఁక నందు తకారమ్ముపై రేఫ లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-26]

సీ. తరిచాడె తరిమిడి తరువఁగాఁ దరచుట
 తిరుగుట తిరియుట తిరము తెరువు
తెరలుట తరలఁగ తరఁగ తరతరము
 నేర్తురు తోరమ్ము నెత్తురనఁగఁ
తెకతేర వత్తురు తేరా సుగంధంబు
 తొరుగుట తరమించి తొరలిక యనఁ
దూరుపునాఁటను సేరంగనేర్తురు
 తీరనికిన్కఁబల్ తెరఁగుపనులు

తే. తెరలఁగాఁగాఁచు నెయ్యి కస్తురికి సమము
తీరుపైఁ జిత్తరువు బొమ్మ తారు గనిరి
తెరయఁ దొరితొరి వాండ్రరుదెంతు రనఁగఁ
దపరరేఫ లీక్షణమరుద్బంధులు హరి! 540

ఇఁక తకారంబుపైఁ గల ఱకారంబు లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-27]

సీ. తెఱవలు వాతెఱల్ తెఱచిరి యేత్తెఱ
 తెఱఁగుగల్గుటయును దెఱపు లనఁగ

---

౫౩౯. 1 ఈ భాగము ముద్రిత లక్షణసారసంగ్రహమున లుప్తము.

దఱుగుట తక్కువ తఱుగుట వెత్తియుఁ
దఱుగుట ఛేదనార్థంబు నయ్యె
దఱియగు నత్తఱిఁ దఱచగు తఱిగొని
తొఱఁగువడుటయును దుఱఁగలింపఁ
దఱుముచుఁ దొఱఁగమిఁ దొఱఁగులు పోవుచుఁ
దొఱఁగిన తావియుఁ దొఱఁగె ననఁగ

తే. దఱగు తుఱుమును డిఱియును దాఱుటనఁగఁ
దూఱు తఱముచుఁ దఱలనఁ దేఱుదురనఁ
దేఱికనుఁగొనఁ దఱలనఁ దేఱమి యనఁ
దఱియఁ జొఱుమనఁ దీఱగఁ దఱికి ననఁగ. 541

వ. మఱియును, 542

[లక్షణసారసంగ్రహము. 3_28]

తే. తిఱుగఁజేయుఁడు తొఱులను దఱగదీర్ఘ
కన్నుతెఱచుట మఱితెఱగన్ననంగఁ
దఱిమి యనిసేసెఁ దెఱఁగొప్పఁ దఱిగొఱపనఁ
దపదములఱాలు దృక్సముద్రము అనిలఱ. 543

ఇఁక దకారముమీఁది రేఫ లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3_29]

సీ. దురదుర జాదరి దొరలెల్లఁ గుదురుగ
దొరకోలు దురమాట దొరయుఁడనుట
దురపిల్లు పెదురుట దొరకొల్వు దొరకొంట
దూరులు దరిద్రొక్కి దొరసి రనఁగ
దరికొనె ననఁ బంచదశరేఫ లవియయ్యె
ముందఱ కాలంబు ముందఱెదురు
నం దొఱలించెద రందఱు మిద్దఱు
మెందఱు వదఱుట కొందఱనఁగ

ఆ నెద్దిఱా యనంగఁ బెద్దఱికం బన
[1]నందఱెన్నఁగాను నింద అనఁగ
బండిఱాలసంఖ్య పదుమూఁట నగునెన్న
దపరమునను గల్గి తరుచరాఢ్య 544

ఇఁక నకారముపై రేఫ లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-30]

సీ నరములు నరలును నారులు నేరమి
నీరును నోరును నారసములు
నెరసులు విలునారి నేరుపులున్నారు
నేరేరనంగఁ గన్నార మనఁగ
నేరేళ్లు నురుగులు నెరయంగఁ జల్లుట
నేరక యన నివిన్నియు నవర్ణ
పరము సప్తదశరేఫలు నఱినొప్పుట
నఱయంగ నెఱిదప్పి నఱిగొనెనన

తే నెఱియు నెఱసియు నెఱమంట నెఱఁకులనఁగ
నుఱుముగా నుఱుమాడెను నెఱసరి యన
నెఱవు నెఱకూరె నుఱుపాడె నెఱపె ననఁగ
నీఱుపైఁ గవిసిన నిప్పు మాఱు పదులు 545

వ మఱియును, 546

[లక్షణసారసంగ్రహము 3-31]

తే నాఱు విడుచుట నెఱిలేక నూఱుటనఁగ
నీఱుగాఁజేయు నెమ్మెలు నెఱపకనుట
నెఱపుగను నెఱివెండ్రుకల్ నెఱమొగమన
నెఱబిరుదు నెఱవాదులు నెఱిచెడ కన 547

వ మఱియును, 548

---

544 [1]నందఱు నెన్నంగ నిందఱనఁగ (ల సా సం, పాఠము గణ భంగము)

[లక్షణసారసంగ్రహము. 3-32]

తే. నెఱికెగట్టుట నిఱుపేద నెఱవువిడిచి
నెఱికె నెఱనారసము నాఁటె నఱుజుపేను
అదిగో నెఱత్రోవ నుఱుమయ్యె నన నవర్ణ
పరము. ఱాలు [1]ముప్పదియాఱు పవనతనయ. 549

ఇఁక పకారముమీఁది రేఫ లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-33]

సీ. పరఁగనఁ బరువడి పరికింపఁ బురుడిడు
పురుడు సూతక మగుఁ బొరక యనఁగ
బరిమార్చిరి యన దెప్పర మిప్పరుసనఁగఁ
బొరిపొరి పరుసనఁ బొరిగొని రనఁ
బురపురఁ బొక్కంగఁ బొంపిరి పోరఁగాఁ
బెరిఁగె వర్ధిలె ననఁ బెరుఁ గనంగఁ
బరిచనుదెంచె నేర్పరి పెనుపరి పోరి
పోరితం బనఁగను బొరలితి మనఁ

తే. బరపుగలచోటఁ బరపులు పరుసములును
బేరునామంబు పరుసంబు పోరచి యనఁ
బెరడనఁగ దొడ్డి పరితేనె పెరయనంగ
బేరె నెయ్యనఁ బరిగొనె బేరుర మన. 550

వ. మఱియును, 551

[లక్షణసారసంగ్రహము. 3-34]

తే. పొరుగు చప్పరంబును బొరపొచ్చెము పురి
కొల్పుపోరామి పొరిగడుగు పిరిగొనుట
పొరయ నీపవర్ణోపరిఁ బొలుచు రేఫ
లెన్న నలువదిరెండయ్యె నినజమంత్రి. 552

---

549. [1]ముప్పదిరేడు. (ల. శి. వ్రాఁతప్రతి. శా.)

ఇఁక అకారము లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-35]

సీ. పఱచెను వేగంబ పఱపెద పఱపిఱి
పఱివోయెఁ బఱచిన పాట్లనంగఁ
బిఱికితనమును నంపఱ పఱియలనఁగఁ
బఱిగొని పఱిమార్చెఁ బిఱుసని యనఁ
బఱివఱిగాఁ జేయఁ బిఱుఁదనఁ జొచ్చెను
బెఱమూఁక పెఱచేతఁ బఱపనోపఁ
బిఱిఁదికిఁ బాఱెఁ జూపఱ పఱివోయెను
బెఱిగినచందంబు పిఱుఁదు లనఁగఁ

తే. బఱవక పఱచు పాఱించుఁ బఱువుటనఁగఁ
బాఱుఁడన విప్రుఁడంబులు పాఱుటయును
బొఱకవురియలు తెప్పఱ పఱిపఱియలు
పెఱికెఁ గోఱలు పెంపఱు బోఱయనంగ. 553

వ. మఱియును, 554

[లక్షణసారసంగ్రహము. 3-36]

తే. పెఱిగె నట్లనఁ బిఱిపెడి పెఱికివచ్చెఁ
బఱపయినపట్ల బఱచిరి పఱవ నవఁగఁ
బఱిక గఱుపాఱెఁ జిక్కులుపఱచి రనఁగ.
ప[1]పరములు ఱాలు గతిగతుల్ పవనపుత్ర. 555

ఇఁక బకారంబుమీఁది రేఫ లెట్టివనిన [లక్షణసారసంగ్రహము. 3-37]

సీ. బూరుగుచెట్టగు బూరుగ వాద్యంబు
బేరంబు [1]బురదయు బేరజములు
బరిగట్టె బారెఁడు బరవసంబును బారు
బారమ్ము లేసిడి బారివడియె

---

555. [1]పపరమయిన ఱాల్ముగతిసతుల్ పవనతనయ (అ. శి. వ్రాఁతప్రతి.)

556. [1]బురడయు. (ల. సా. సం)

బూరెలు బోరలు బోరగిలంబడె
బోరని [2]మ్రోసెను బూరటిల్లె
బురుజులు [3]గజ్జెలు బెరసెనుబీరమ్ము
బరిమైని బరులుబ్బె బరువు బరడు

తే. బిరుదు బురబురఁ బొంగె నిబ్బరము నబ్బ
రం బనఁగ నివి యీ బవర్ణంబుపైని
సప్తవింశతి రేఫలు జరుగునయ్య
[4]అనిలసుత! సేవకవిధేయ! ఆంజనేయ! 556

ఇఁక ఱకారమ్ములు, [లక్షణసారసంగ్రహము. 3-38]

తే. బిఱుసుముట్టించె బిఱుసులు బిఱులులెందు
బఱ[1]బిఱ నెఱపిపైచె దబ్బఱ లనంగ
బఱబఱన నీడ్చె బిఱువోయెఁబనియన నివి
బపరముల ఱాలుగిరి సంఖ్యఁబరఁగె హనుమ! 557

ఇఁక మకారముమీఁది రేఫ లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-39]

సీ. మురిసెను దొండ మామరదంతికిని నన
మొరపఱాలును దేంట్లు మొరసె ననఁగ
మారట మూర్తులు మేరలు దప్పిరి
మారిమసఁగుటను మోర లనఁగ
మురియలు తునుకలు మరియాదక్రుమ్మరి
మరిగించుకొనుట వేమా రనంగ
మరలుట మది మేర మెరమెరవసమరె
మురిపెంబు తామరల్ మురమురయన

556. [2]పోకను.

[3]గజ్జులు. (అ. శి. వ్రాఁతప్రతి పాఠములు]

[4]యాజిసుత సేవకవిధేయ యాంజనేయ. (ల. సా. సం.)

557. [1]బఱనఁద్రిప్పివైచె. (ల. సా. సం.)

ఆ. మరులుడుపుట మొరడు మారేళ్లు మిరియంబు
సుమ్మర యనఁగల్గె సొరిది నున్న
మపర ఱేఫలౌను మఱి యెంచి చూడంగ
నిరువదియును నాల్గు హరకుమార! 558

మఱియు మకారముమీఁది ఱకారములు, [లక్షణసారసంగ్రహము. 3-40]

సీ. మఱి మేఘపుమెఱుఁగు మెఱచునొకోయని
మఱతుఱు మెఱుఁగెక్కి మొఱసి యింక
మాఱట నోళ్లను మఱచి దిక్కులుసూచి
మఱతును నేనును మాఱడుగుట
ముఱిమొండె మనుటయు ముమ్మాఱు వేమాఱు
మెఱములు వైచెను మొఱయిడిరన
మొఱఁగుచు మఱచిన మఱువక మఱియును
మిఱుమిట్లు గొనియును మెఱయు మెఱసి

తే. మీఱు మీఱియు మెఱములు మెఱుఁగులనఁగ
మఱపు ముఱిముఱి చీఁకటి మఱఁగు మఱఁది
మఱలఁ గ్రమ్మఱి పల్మఱు మాఱియనఁగ
మాఱుమొగమును మఱపు నేమఱియనంగ. 559

[లక్షణసారసంగ్రహము. 3-41]

తే. మాఱుపడుటయు పెడమఱి మఱఁదలనఁగ
మొఱకు మఱునాఁడు మిఱుచూపు మఱుఁపుకొనుట
మఱుమఱువులును మఱతేక మఱకు వనఁగ
మపరమున ఱాలు మునిగతుల్ మారుతసుత. 560

ఇఁక ఱేఫ లెట్టివనిన [లక్షణసారసంగ్రహము. 3-42]

ఆ. ఱేయి ఱిచ్చ ఱిత్త ఱేయెండ ఱెండన
ఱూడిఱేకు ఱాదు ఱూపు ఱమణ
ఱమ్ము ఱార ఱోఁజు ఱాగిల్లి ఱాచూలి
ఱవ్వ ఱాయిడియును ఱాలుటయును. 561

[లక్షణసారసంగ్రహము. 3-43]

తే. రారు రాయంచ రాయుచు రాయుటయును
రక్కసియు రోయు రూపింప రంకెలనఁగ
రూపెదను (రేవు) రాతిరి రుచియనంగ
*ముప్పదర్ణముల్ రేఫాది నొప్పు హనుమ. 562

ఇఁక ఱకారములు, [లక్షణసారసంగ్రహము. 3-44]

ఆ. ఱేఁడు ఱెప్ప ఱాచ ఱివ్వన ఱంపిల్లి
[1]ఱిక్క ఱెక్క ఱేసు ఱేవు ఱేవ్వు
ఱవిక ఱట్టు ఱంకు ఱాఁగ ఱంకించుట
యనఁ బదేను ఱాదులయ్యె హనుమ. 563

ఇఁక వకారముమీఁది రేఫ లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము. 3-45]

సీ. వారించు వారికి వ్రాకంబుగ విరుల్
వారక యిందు నెవ్వరికి నీకు
వరిపంట తలవరుల్ వరుస నార్వ్వురు గాచి
వేరంబు వెరవున వెరసు లిడిరి
వరవళో విరవిర వారనిసేసల
విరియంగఁ జల్లిరి విరియుటయును
గాల్వ్వురు నిరువురు పల్వ్వురు నెవ్వరు
వీరల వరిటంబు వారువములు

---

562. * "రూపెదను రాతిరి రుచియనం" అను ల. సా. సం. పాఠమును గ్రహించిన 29 పదములే వచ్చును. ల. శి. సవరింపఁబడిన "రూపెదను (రేవు) రాతిరి రుచియనంగ" అను పాఠమును గ్రహించిన ముప్పది పదములు వచ్చును.

563 [1]ఱెక్క ఱేక ఱేను ఱేవు ఱవిక
ఱట్టు ఱంగు ఱాఁగ ఱంకించు ఱాఁయున. (ల. శి. వ్రాఁతప్రతి)

తే వరుజూ గట్టిరి యోవరి వారకులన
వీరలన దేవరన సాటి వేరియనఁగ
వరుసనంగను నిన్ని వవర్ణపరము
రేఫ లివియయ్యె ముప్పదిరెండు హనుమ 564

[లక్షణసారసంగ్రహము 3-46]

తే వఱలె ననఁగను వేడుక విఱిగె విల్లు
వెఱఁగుపడి యాజి విఱుఁగుట విఱిచెననఁగ
వెఱమృగంబులు వెఱవెఱ వెఱచఱవఁగ
వఱదు గూసెను వేఱొక వెఱగుతోడ 565

తే వఱుతఁ ద్రోవఁగ విఱివిది వెఱచి వఱచి
వఱద యనఁగను నెండిన వఱుగనంగ
నమరు చిఱిగాలి విఱిపొల్లు ననవవర్ణ
పరము ఱాలివి యిరువదో పవనతనయ ! 566

ఇఁక సకారముమీఁది రేఫ లెట్టివనిన, [లక్షణసారసంగ్రహము 3-48]

తే సరకు సెరబడి సైరణ సరులనంగ
సరుకు సేయక సురిఁగిరి సొరిది యనఁగ
సురియ సోరనగండ్లును సూరెలనఁగ
సారెసారెన సొగటాల సారెలనఁగ 567

[లక్షణసారసంగ్రహము 3-49]

తే సిరియనంగను లక్ష్మియౌఁ జేఁరనఁగ
నేసరుల నెక్కి తనసరి నేసిరనఁగ
సప్తదశరేఫలయ్యె సాక్షరముమీఁద
జానకీ జాని చరణాబ్జ షట్పదీక 568

[లక్షణసారసంగ్రహము 3-50]

క మును నన్నయభట్టాదులు
మునుకొని రేఫలు అకారములు కృతులందు గూ

ర్చిన పలుకులేర్పరించితి
ఘనులిఁక మఱి గలిగెనేని గ్రైకొనఁగఁదగుఁజా. 569

అన్నారిఁక మదీయము —

తే. రేఫలు, అకారములు చెప్పలేక కాదు
చిత్రకవి పెద్దనార్యుండు చేసినట్టి
లక్షణమె యేను లక్ష్యంబువ్రాసినాఁడ
ఘనుల లక్షణములు వ్రాయఁ జనుటఁగృష్ణ! 570

మఱియు నీరేఫ ఱకారంబులకు నన్నభట్టుగారు ఆంధ్రకవిచింతామణి యందు శ్లోకము —

శ్లో. †లఘువశ్శిఖి శైలాగ్నియోఽన్యేఽ గజబర్హిషః
లఘుర్నాస్తి జకారస్య లఘుస్సస్య క్వచిత్ క్వచిత్. 571

శ్లో. *తత్సమగ స్తద్భవగో దీర్ఘైకాక్షర గశ్చరేఫస్స్యాత్;
నాన్యేషాం ద్వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యాత్. 572

వ. టీక - శిఖిశైలాగ్ని = ౩౭౩ తేలుఁగున రేఫలున్ను, గజబర్హిషః = ౩౮౦ ఱకారములున్ను కలిగియుండును. జకార పరాన రేఫ లేదు. సకార పరాన బండి ఱకారము లేదు. తద్భవ తత్సమ పదములతోనున్ను, దీర్ఘ ఏకాక్షర పరాననున్ను బండి ఱకారము రాదు. రేఫ ఱకారములకు యతిప్రాసశ్లేషలకు విరుద్ధము అన్నారిది రేఫ ఱకారపద్ధతి. సమాప్తము.

శ్రీశ్రీశ్రీశ్రీ శ్రీఁజేయునా. 573

571. †ఇది అథర్వణకారికావళిలోనిది. [సంజ్ఞ. 24]

572. *ఇది యార్యావృత్తపాదమేకాని ఆంధ్రశబ్దచింతామణి ముద్రితప్రతి యందుఁ గానరాదు. బాలసరస్వతీ యాహోబలపండితీయములలో వ్యాఖ్యాతముగాదు. 'నాన్యేషాం' అనునది అం. శ. చిం. లోఁ గలదు. [సంజ్ఞ. శ్లో. 10]

ఇఁక నందు,

## విభక్తి పద్ధతి లక్షణము

క. వెలయు నిడఁ బులక లలకలు
పులకము లలకములు హంసములనఁగ హంసం
బులు నా హంసలనఁ దరం
గలనఁ దరఁగములనఁ దరఁగలనఁగ కృష్ణా! 574

పులకలన్నందుకు ప్రయోగము [1]ప్రబంధ పరమేశ్వరుఁడు, ఆరణ్యపర్వము గీతిపాదమున లక్ష్యము. [7-33]

ఆ. ఆ మనోజ్ఞరత్న మక్కునఁ గదియించి
పులక లెగయఁగొంత ప్రొద్దు విభుఁడు
జానకీకుచాగ్ర సంగమ సుప్తుఁడై
నట్లయుండె ముకుళితాక్షుఁడగుచు. 575

'తరగల' న్నందుకు ప్రయోగము భాస్కరరామాయణము శార్దూల వృత్తము ౨-వ పాదమున లక్ష్యము, [యుద్ధ. ప. 142]

శా. జ్యా ఘోషంబు నిరంతరం బగుచుమ్రోయం బెల్లుదంభోళి ధా
రాఘోరాస్త్ర పరంపరల్ దరఁగలై రాజిల్ల నాపూరితా
మోఘావృత్తిఁ (దనర్చు రామధనురంభోరాశి దోర్విక్రమ
శ్లాఘాగాథము నేఁడు ముంచుఁబెలుచన్ లంకాపురీ ద్వీపమున్.) 576

అందు హంస లన్నందుకు శబ్దశాసనుఁడు, ఆరణ్యపర్వము కందము ౨-వ పాదమున లక్ష్యము, [2-18]

క. దమయంతికి నలునకు సం,
గమ కారణదూతయైన కలహంస మనో
జ్ఞ మనుష్య వాక్యముల న
ద్దమయంతికి హర్షమెసఁగఁ దానిట్లనియెన్. 577

---

575. [1]శబ్దశాసనుఁడు. (ల. శి. వ్రాఁతప్రతి)

'హంసలు' అన్నందుకు సోమయాజి కర్ణపర్వకందము ౪-వ పాదమున లక్ష్యము, [2-60]

క బలశాలియైన హంసముఁ
బిలిచితి పురుడించి పారె బేలుఁ దనమునన్
[1]గలవేయింతకుమును హం
సలతోఁ బురుడించు వాయసంబులు జగతిన్ 578

రామభద్రయ్యగారు, [కవిజనసంజీవని 2-1]

తే ఇత్వము విసర్గలోపంబు వెలయుచోటఁ
జను నుకారాంతశబ్దంబు తెనుఁగుసేయ
రఘు రఘువు బాహు బాహువు రాహు రాహు
పూరు పూరనమఱి మేరు మేరువనఁగ 579

అందు రఘువన్నందుకు ఆదిపర్వము శబ్దశాసనుఁడు మత్తేభము ౩-వ పాదమున లక్ష్యము, [2-221]

మ రజనీనాథకులైక భూషణుఁడవై రాజర్షివై ధారుణీ
ప్రజనెల్లన్ దయతోడ ధర్మచరితన్ బాలించుచున్ దొంటి ధ
ర్మజు నాభాగు భగీరథున్ బృథుగయున్ మాంధాతృరామున్ రఘుఁ
విజయున్ బోలితి సద్గుణంబుల జగద్విఖ్యాత పారీక్షితా 580

'బహు' శబ్దమునకు ప్రయోగము సోమయాజి విరాటపర్వము గీతి ౩-వ పాదమునను లక్ష్యము, [2-7]

తే నేల నాలుగు చెఱఁగుల నృపుల కొలువు
లందు నేను వర్తించితి నవనినాథ!
అగ్గలించి నాయెదుట బాహాప్పళించి
కడఁగఁ జాలిన మల్లులఁగాన నేను 581

---

578. [1]కలదే (అ శి వ్రాఁతప్రతి పాఠము)

రాహు' శబ్దమునకు ప్రయోగము సోమయాజి (*శల్య)పర్వము శార్దూలము ४-వ పాదమున లక్ష్యము, [2-240]

క ఉర్వీచక్రము వడఁకెన్
ఒర్వము లేకయును రాహు భానుని బట్టెన్
పర్వతములురిలెవరళుయు
సర్వదిశలనటిచెనభము శర్కర గురిసెన్ 582

'ఊరు' లన్నందుకు ప్రయోగము సోమయాజి కర్ణపర్వము శార్దూల వృత్తము ४-వ పాదాది లక్ష్యము, [3-210]

శా లీలన్ గేల నమర్చు మత్తగజకేళీ సుందరోల్లాసమా
భీలత్వం బొనరంగఁ ద్రిప్పుఁజదలన్ బృథ్వీస్థలిన్వైచు ముం
గాలన్ ద్రొయు మొగంబుద్రేయు దిశలుగ్రస్ఫూర్తి వీక్షించు మోఁ
కాలూరుల్ పయిఁగ్రమ్మలేచు మెడవిక్కన్ ద్రొక్కి నిల్చున్నగున్ 583

'మేరు' అన్నందుకు ప్రయోగము పాండురంగమహత్త్వము శార్దూలము ౧-వ పాదమున లక్ష్యము, [1-8]

శా మీఁదం దారధరాధరంబుగల యా మేరున్నగంజాలి త
త్త్రాదృక్షుండ రుచిం దలిర్చు ఖగయూథస్వామి హేమప్రభా
ప్రాదుర్భావ శుభప్రభుండు మనుచున్ రామానుజామాత్యశ్రీ
వేదాద్రీశు విరూరి మందిరు జగద్విఖ్యాత [1]చారిత్రునిన్ 584

రామభద్రయ్యగారు లక్షణము, [కవిజనసంజీవని 2-15]

క పరఁగున్ గొన్నిటఁ దిర్య
క్స్వరమైన పదంబు పురుషపదవాచకమై
యురగులు సముద్రుఁడనఁగా
నురగములు సముద్రమనఁ బయోజదళాక్షి! 585

---

582 *కర్ణపర్వము అ శి వ్రాఁతప్రతి

584 [1]కీర్తిశ్వరున్ (పాండు రంగ)

'ఉరగు' లన్నందుకు ప్రయోగము శబ్దశాసనుఁడు ఆదిపర్వము చంపకము ౨-వ పాదమున లక్ష్యము, [1-105]

చ. అరిది తపోవిభూతి నమరారుల బాధలు పుట్టకుండఁగా
నురగుల నెల్లఁగాచిన మహోరగ నాయకుఁడున్న మత్సురా
సుర మకుటాగ్ర రత్నరుచిశోభిత పాదునకద్రినందనా
వరునకు భూషణంబయిన వాసుకి మాకుఁ [1]బ్రసన్నమయ్యెడుఁన్. 586

పన్నగులన్నందులకు ప్రయోగము ఎఱ్ఱాప్రగడ అరణ్యపర్వము కందము ౩-వ పాదము లక్ష్యము. [4-100]

క. మృగయార్థమరిగి హిమవ
న్నగములయందు నను బవననందనుఁడొక ప
న్నగు చేతఁ జిక్కువడి యి
మ్మగ ధర్మజు చేతఁ దాను మోచితుఁడయ్యెన్. 587

[కవిజనసంజీవని. 2-20]

క. చరితము చరిత్రమొక యెడఁ
బరఁగున్ స్త్రీలింగరీతిఁ బద్మాక్షభవ
చ్చరిత జగన్నుతమగునా
చరిత్ర శక్రాది దివిజ సంసేవ్యమనన్. 588

చరిత యన్నందుకు ప్రయోగము సోమయాజి ఉద్యోగపర్వము గీతి ౨-వ పాదమున లక్ష్యము. [2-50]

తే. హితవు కర్తవ్య మెఱిఁగించితీవునాకు
ధర్మపుత్రు చరిత విదితంబు నీకు
అట్లు గావున వినిపింపు మఖిల వాక్య
జాలములయందుఁ జిత్తోపశమముగాగ. 589

---

586, [1]ప్రసన్నుఁడయ్యెడున్. (సంశో. భా.)

లక్షణము, [కవిజనసంజీవని. 2-31]

ఆ. పంచమీ విభక్తి [1]పరఁగిన మధ్యనే
కారలోపమగు వికల్పముగను
విష్ణుభక్తుఁడొకఁడు [2]విష్ణునకంటెను
గలఁడె వేల్పు కృష్ణుకంటె ననఁగ. 590

ఇందుకు ప్రయోగము సోమయాజి కర్ణపర్వము సీసము నాలుగు పాదము లను లక్ష్యము. [2-24]

సీ. రాత్రియైఁదాఁకి క్రూరతఁ చోరి మగఁటిమిఁ
బాపిన యంగారపర్ణకంటె
ఘోషయాత్రా విధిఁ గురురాజుఁ జెఱపట్టి
మానమేదిన చిత్రసేనుకంటె
ఖాండవోద్యానంబుగావనేరక సిగ్గు
పడిచన్న నిర్జర ప్రభువుకంటె
క్రీడాకిరాతుఁడై క్రోధంబునకుఁగాఁగఁ
బెనఁగి చిక్కిన త్రిలోచనునకంటె

ఆ. [నెక్కుడైన వీరుఁడే నర్జునునితోడఁ
బోడుతు నోడుతుననినఁ బోలుఁగాక
వినుము సూత తనయ! మనబోఁటు లాతనిఁ
జెఱుతుమనుట నోరి చేటుగాదె.] అన్నారు. 591

[కవిజనసంజీవని. 2-2]

తే. ఏకవచనంబె కేలున కిరులకెల్ల
బహువచనమై తగుమురారి బాణకేలు
దునిమెనన నమ్మహాత్ము భక్తుల జయింతు
లిరులడఁచు సూర్యుకైవడి దురితమనఁగ. 592

---

౫౯౦. [1]పట్టున. (క. జ. సం.)
[2]విష్ణుని. (క. జ. సం.)

[కవిజనసంజీవని 2.33]

క. పలుకం జెల్లు విశేషణ
ములు మఱి షష్ఠికిని బ్రథమము ల్పరలందుఁ
గలరా భువనానఁ దో
హలబాహా బలుఁడు [1]నీరజాక్షునికన్నన్ 593

ఇందుకు ప్రయోగము సోమయాజి, భీష్మపర్వము కందము. [2.392]

క. అపరాహ్ణ సమయమున న
ట్లుపమాతీతాతి ఘోరయుద్ధంబయ్యెన్
విపుల భుజబలుఁడు భీముని
కపరిమిత బలుండు కౌరవాధీశునకున్. 594

[కవిజనసంజీవని 2.36]

క. తెనుఁగు కృతుల స్త్రీలింగం
బునకు విశేషణము పున్నపుంసకములచే
తనములఁ జెల్లు యశోదా
తనయ కృపాదృష్టి సౌఖ్యము లొసఁగన్. 595

ఇందుకు ప్రయోగము శబ్దశాసనుఁడు సభాపర్వము కందము. [1.70]

క. వరుణసభ సర్వలోకో
త్తరముజ్జ్వల మణిమయము సితప్రభమతి సు
దర మందుండును వరుణుఁడు
వరుణానీ సహితుఁడై ధ్రువంబగ నెమ్మిన్. 596

[కవిజనసంజీవని 2.37]

క. తెలిఁగింపఁగ బహువచనం
బుల కైనను నేకవచనము విశేషణమై

593 1 నీరజాక్షునకనఁగన్ (క జ సం)

నిలుచుఁ బ్రాణపదమ్ములు
వెలిగా హరికీర్తితతులు విఖ్యాతమనన్ 597

ఇందుకు ప్రయోగము శబ్దశాసనుఁడు ఆదిపర్వము, మాలిని వృత్తము లక్ష్యము [2-81]

మాలిని సురపతి సభఁ జూడన్ జూడ నంగార వృష్టుల్
గురిసె గులిశధారల్ కుంరితంబయ్యె దిక్కుం
జరమదములడంగెన్ సర్వదిక్పాలకాంతః
కరణములు భయోద్వేగమ్ములై సంచరించెన్ 598

వ ఇది విభక్తి పద్ధతి ఇఁక నందు, 599

## విభక్తి సంధిక్రమ లక్షణము

రామభద్రయ్యగారు [కవిజనసంజీవని 4-1]

క చెన్నగు నకార పొల్లుల
కున్నచ్చులతోడి సంధిగూర్పఁగ నొకటన్
పన్నగ శయనుఁడు హరియిం
చున్నఘములు భక్తులైన సుజనుల కనఁగన్ 600

నకారపొల్లుమీఁద అచ్చుసంధిచేసియు ప్రయోగించినందుకు శబ్దశాసనుఁడు, అరణ్యపర్వము చంపకము ౨-వ పాదమున లక్ష్యము, [1-321]

చ వరదుఁడు పార్థశౌర్యవిభవంబున నాతనిధైర్యవృత్తికి
న్నరుదుగమెచ్చి సన్నిహితుఁడయ్యె జటామకుటేందురేఖయున్
గరమున శూలమున్ గరళకాల గళంబు బృహద్గజాజి నాం
బరముఁ దృతీయలోచనమును బన్నగహారము లొప్పుచుండఁగన్ 601

మఱియు శబ్దశాసనుఁడు ఆదిపర్వము, మత్తకోకిలము ౪-వ పాదమున నకారపొల్లుమీఁద అచ్చుప్రయోగము లక్ష్యము, [7-142]

మత్తకోకిలము మానితంబగునాతపంబుక్రమంబులోక పరాభవం
బేనుసేయఁగఁబూని చేసితి నిట్టియొక్క ప్రతిజ్ఞ, మున్

డీనినెట్టులఁ గ్రమ్మఱింతు మదీయ [1]భాషణ మెన్నఁడు
న్నే(న)మోఘము[2]సుమ్ము దిగ్ధరణీందుభానుతెఱుంగఁగన్ 602

(ఇందుకు) లక్షణము. [కవిజనసంజీవని 4-3]

తే. అచ్చుపై నచ్చు సంధిసేయంగఁ జెల్లు
సకల శుభములు శౌరిచ్చు జనులకనఁగ
అతని నుతియించు భక్తులే యధికులనఁగ
కినుకుడుగఁ గంసు నడఁగించెఁ గృష్ణుఁడనఁగ. 603

వ. మఱియును. 604

[ఆంధ్రభాషాభూషణము ప 79]

క. అచ్చుగఁ బెఱ యచ్చులపై
నచ్చు యకారంబుఁ దాల్చు నటులా యేలో
యిచ్చె యపూర్వమేకో యింది
యచ్చెరువై యూనికి నానుదాహరణంబుల్. 605

క. క్రియలును విభక్తులును న
వ్యయములు సంస్కృత పదంబులైనను నొకచో
బ్రియమై తెనుఁగునఁ దగు దు
ర్జయ దైత్యచమూ విభంగ! శార్ఙ్గ రథాంగా! 606

ఇందుకు లక్ష్యము —

క. మనసా భజింతు సతతం
బున నోదేవా! నమోస్తు మురదానవ భం
జన! శరణం, శరణ్యంబో
జనార్దన! యనంగ వికచజలజదళాక్షా! 607

602 [1] భాషణ మెన్నఁడున్ ఏని మోఘము సుమ్ముల (అ శి వ్రాఁతప్రతి).
[2] న్నని మోఘము గాదు దిగ్ధరణీ రవీందు లెఱుంగఁగన్. (సం శో. భా.)

ఇందుకు ప్రయోగము సోమయాజి, విరాటపర్వము, నాంది, ఉత్పలము ౧-వ పాదమున లక్ష్యము, [1-1]

ఉ శ్రీయన గౌరినాఁబరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
[1]ద్రాయతమూర్తియై హరిహరంబగు రూపముదాల్చి "విష్ణురూ
పాయ నమశ్శివాయ!" యని పల్కెడు భక్తజనంబువైదిక
[2]ఘ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్ 608

మఱియు ప్రౌఢకవి మల్లనగారు రుక్మాంగదచరిత్ర సీసము, లక్ష్యము, [3-179]

*సీ దంభోళి ధరసతీ తాంబూలపేటీషు
దహన బింబాధరా స్తనభరేషు
శమన శుద్ధాంత యోషా ఫాల భాగేషు
నిర్ఋతి సాధ్వీముఖ నీరజేషు
కంధి నాయకి బాలికా కర్ణపత్రేషు
గంధ వాహాంగనా కచభరేషు
రాజరాజాన్తః పురస్త్రీ కరాగ్రేషు
గిరకంఠ కామినీ కటితటేషు

తే చంద్ర శకలంతి హారన్తి చందనన్తి
విశద హాసన్తి హీరన్తి విచికిలన్తి
దర్పణన్తి దుకూలన్తి తవయశాంసి
క్లేశభవభంగ! యిష్టకామేశలింగ! 609

---

608. [1]భద్రాయిత (అప్ప 3-128)
[2]"ధ్యాయిత" అని ౧ శి వ్రాఁతప్రతి

609 *౧ శి వ్రాఁతప్రతి యందలి సీసపాదములలో "కంధి, గంధ" ఇత్యాదులందు బిందువు, గీతిపాదములలో "శకలన్తి, హారన్తి" అను పదములందు పరసవర్ణానునాసికముగ లిఖింపఁబడెను

క. రాజశ్శబ్ద జకారము
రాజిల్లఁగ నణఁగియుండు రాయంచన రా
రాజన వలరాయఁడన స
భాజననుత యనఁగఁ గృతుల భాసిలుఁ గృష్ణా! 610

వ. ఇది సంధిక్రమ పద్ధతి. ఇఁక, 611

## షట్సంధులు

అనంతనగారు, [*ఛందోదర్పణము. 4 : 37-122]

క. క్రమమున[1] నేఁ జెప్పిన దో
షములం దత్యుత్కటము విసంధికమని రా
ది మునులు దత్పరిహారా
ర్థముసంధి సమాసములు [2]దిరంబునఁ దేర్తుఁగా. 612

[1]నిటు. (ఛం. ద.)

[2]దిరంబుగఁ జేర్తుఁగా. (ఛం. ద.

తే. సంధిఁ దెలిపెడుచో సూత్రసమ్మతముగఁ
దొలుతఁ బల్కఁ జూపెడు వర్ణముల విసంధి
నాఁటుకొనదు శ్లిష్టోచ్చారణంబుఁజేసి
చూపునదియె నిశ్చయసంధి సూచకంబు. 613

తే. పరఁగుఁ దుక్సంధి స్వరసంధి ప్రకృతిభావ
సంధి వ్యంజనసంధి విసర్గసంధి
[1]స్వాది సంధియు నైన షట్సంధులందుఁ
బ్రకృతి యనుసంధి యదియాంధ్రభాష సొరదు. 614

---

612. *ఇటనుండి (ల. శి. 610-696.) ఛందోదర్పణములోని పద్యములు [4 : 37-122] సంగ్రహింపఁబడినవి.

614. [1]స్వాది సంధి నా షట్సంధులందులోనఁ
బ్రకృతిసంధియన్నది యాంధ్రభాషఁజొరదు. (ఛం. ద.)

## [ తుక్సంధి ]

క. పదమధ్య దీర్ఘలఘువును
బదాంతలఘువును ఛకారపరమై యొఁదున్
మదిమ్లేచ్ఛుఁడు తుచ్ఛుఁడనన్
ద్రిదశచ్ఛత్రమన నీగతిన్ దుక్సంధిన్ 615

తే. లలిఁబదాంత దీర్ఘము వికల్పంబువొందు
పుత్రికాచ్ఛత్ర మాత్మజాఛత్రమనఁగ
నటఁబదాంత దీర్ఘంబయ్యె నాఙ్ప్రియుక్తి
నిత్యమాచ్ఛాదనంబని నెఱయమూఁదు 616

అందు

## స్వరసంధి

క. ధర అ ఇ ఉ ఋ ఌ సవర్ణము
పరమగుచో దీర్ఘమగు సువర్ణాద్రియనన్
శరధీంద్రుఁడన బహూదక
సరపియనఁ బితౄణములు వెసందీర్పుమనన్ 617

క. చెచ్చెర ఇ ఉ ఋ ఌ మూఁటికి
నచ్చుపరంబైన యవరలాదేశమగున్
హెచ్చుగ దధ్యన్నంబనఁ
బెచ్చుగ మృద్వన్నమనఁగఁ బిత్రర్థమనన్ 618

తే. సరవి నీనాల్గుపదమధ్య సంధులందు
నప్రసిద్ధ మేకారాంత, మైత్వమునకు
నోత్వమునకు నౌత్వమునకు నొగిఁబదాంత
సంధినగు విశేషంబు లేచందమునిన 619

క. గోశబ్దముపై నవజా
దేశమున గవాక్షమనఁగ దీపించు నవా

దేశము ద్యోశబ్దముపై
నాశక్రుండు దవధీశుఁడ[1]న చ్ఛంధిన్ 620

క వైశిఖరాచ్ఛన కాయా
దేశంబగు సంధి రాయధీశ్వరుఁ డనఁగా
గ్లౌశిఖరాచ్ఛన కావా
దేశంబగు సంధి గ్లావుదీర్ణ యనంగన్ 621

క మొదలి అకారము ఇ ఉ ఋ ఌ
పొదలిన నేత్వమును నోత్వమును రేఫయుఁ బెం
పొదవు సురేంద్రుఁ డనఁగ నీ
రదోత్కరంబనఁగ సంధి బ్రహ్మర్షులనన్ 622

తే ఇత్వ ముత్వ మోత్వం బైత్వ మౌత్వ మైదు
నాదియై ఋకారము పరమైనచోట
మహితకవ్యృద్ధి మన్వృద్ధి మఱిద్యవృద్ధి
యద్ది రాయ్ఋద్ధి గ్లావృద్ధి యనఁగఁ బరఁగు 623

క వశగతి ఋణపద మధికపు
దశఁబ్రవసన కంబళార్ణదశ వత్సతరా
ఖ్యశిఖరిసంఖ్య పదంబులు
రశిరస్కాకార మొంది ప్రార్ణాదులగున్ 624

క ఐలగునే ఐలోఔ
లౌలగు నాద్యంతమునకు నఖిలైక విభుం
డా లలితైశ్వర్యుఁడు స
త్యాలాపౌదనుఁడు భవమహౌషధ మనఁగన్. 625

తే అత్వమున కోతు వోష్ఠమంత్యమునఁ గదియఁ
గలుగు నోత్వోత్వయుగ్మ వికల్పసంధి

620. [1] సత్సంధిన్ (ఛం ద)

అరయనల్పోష్ఠ మఱియు నల్పౌష్ఠ వనఁగ
నాఁగ బింబోష్ఠి నొక్క బింబౌష్ఠి యనఁగ. 626

## ఆఙ్ప్రయోగ చతుష్టయము

క. అందముగ నీషదర్థము
నం దాఙుద నుత్వ మోత్వమై యోష్ఠమగున్
జెంది క్రియాయోగము తుద
యందలి యత్వ మది యాత్వ మావన మనఁగన్. 627

క. ఇల మర్యాదాదులయం
దలి యత్వం బాత్వమై పొదలు నాద్రియనన్
లలి నభి విధ్యాదుల యం
దలి యత్వము నాత్వమై పొదలు నాద్రియనన్. 628

తే. ఈషదర్థమనఁగ నించుక[1]యనఁ గ్రియా
యోగమనఁగ [2]సక్రియోపయుక్తి
అంతదాఁక ననుట యైన మర్యాద
[3]ఆభియనుట యర్థ మభివిధికిని. 629

క. ఈనాల్గిట నుపసర్గయె
కానఁగలిగె సంధి యట్లుగావు ప్రకృతిభా
వానుగతాకారము లవి
జానుగఁ దెలుఁగునకుఁ జొరవు సంధికలియమిన్. 630

క. ప్రతిషేధాకారోత్తర
గతశబ్దాద్యచ్చులవి నకారము లగునా
శ్రితులకుఁ బంకజనేత్రుఁడ
నతిదూరుం డనఁగ నతఁ డనాద్యంతుఁ డనన్. 631

---

629. [1]యగ. (ఛం. ద.)
[2]సత్క్రియోపయుక్తి. (ఛం. ద.)
[3][illegible] ననుట. (ఛం. ద.)

అందు

## వ్యంజనసంధి

క పోడవగు దిగిభ మజంతము
షడంగములు జగదరిష్టశాంతి సుబంతం
బడరె ననఁ దృతీయము లల
వదు వర్గవ్యంజనములపై నచ్చంధిఁ గా. 632

తే షడృతు ధర్మభూషిత తరుషండలక్ష్మి
నిర్మలాబ్వృద్ధ దీర్ఘిక నిజవిశిష్ట
వాగృజుత్వంబు భవదృషిత్వమున కమరె
నాఁగ బుత్త్వవర్గ వ్యంజనముల సంధి 633

తే ఆదిజఞాణనమల పోల్లు లచ్చులంట
స్వస్వరూపంబ యగు బుత్వసంధి నైన
నడఁగు గూడి హాలంతము నాఁదిజంతమన ని
కోయణచి నా నన్నృజువనఁగూఁగుఁగాను 634

క పన్నగ మకార హల్లగు
సున్నమకారమగు నచ్చునోఁక సమగ్రం
బన్నమన బుకారం బో
సన్నమ్మగ మృత్వమగు రససమృద్ధి యనఁగా. 635

క తమతమ వర్ణంబుల ద్వి
త్వములగుఁ దత్తరుణి తత్త్వదర్థము తద్ధా
నము తద్ధనంబు తన్నయ
నము నా నిటు వర్గములఁ దనరు వ్యంజనముల్ 636

సీ వర్గహల్లుల చేరువను హకారము చతు
ర్థాక్షరంబై సంధి నడఁగు నొండె
మూఁడవవ్రాలతోఁ బోఁడిగ దీపింప
గ్రస్థార మనఁగ నఘల్లి లనఁగ,

షడ్దలంబులునాఁగ సకలజగద్ధిత
ప్రౌఢిమ నాఁగ కుబ్బస్తుల నఁగ
నవియస్రగ్ హారంబు లనఁగ నజ్ హల్లు ల
నంగ షడ్ హలములు నాజగద్ హి

తే. తాను వర్తను లనఁగకుబ్‌హస్తులనఁగ
శపరమైన వాక్‌శాంతి వాక్ఛాంతి యట్ల
చపట హల్లులు మూఁటను జను విభాష
ఛత్వమగుఁ దకాలమునఁ దచ్ఛాఖయనఁగ. 637

తే. [1]లలిత తద్వ్యంజనంబుపై లత్వమునకు
ద్విగతి తల్లీల యనఁగఁ దల్లీల యనఁగ
సంచిత సకారమడఁగును నడఁగకుండు
నుత్థితం బుత్‌స్థితం బనునుండుఁగాన. 638

క. అనునాసిక వర్గవ్యం
జనముల నిజరూపమొండె జరగుఁదృతీయం
బునఁ బ్రాఙ్ముఖంబు ప్రాగ్ముఖ
[1]మన వాఙ్నియమంబు వాగ్నియమ మనుచోటన్. 639

తే. కచటతపహల్లు పంచవర్గద్వివర్ణ
సలనిజాకృతి మీఁది యక్షర యుగముల
యరలవలఁ దృతీయంబు వాక్తరుణి వాక్ప
రంబు లనఁగ దృగ్దీప్తి దృగ్వ్రాత మనఁగ. 640

తే. కపల ప్రథమయుగ్మ సకారగతులఁదాన
అపరయుగ యరలవ తృతీయంబు తత్కృ
తంబు తత్ప్రత్రి [1]తత్సఖి తద్గతియు జ
గద్గురుఁడు సదృశము నాఁదకారహల్లు. 641

---

638. [1]లలిని. (ఛం. ద.)
639. [1]మన వాఙ్మయమంబు వాఙ్మయంబమరనొగిన్. (ల. శి. వ్రాఁతప్రతి).
641. [1]తత్సతి. (ఛం. ద.)

తే. తచ్ఛమత్కృతి తచ్ఛాయ తజ్జలంబు
తజ్ఝషము తట్టణాంకృతి తట్ఠకార
ఘనత తడ్డోల తఢక్క యనఁగ రెండు
వర్గములు ద్విత్వమొందుఁ దద్వ్యంజనమున. 642

అందు

## విసర్గసంధి

క. కపముఖ యుగ్మములు విస
ర్గపయిం బొదసూపి నిర్వికార మగు మనః
కపట మనఃఖేదము లనఁ
దపఃఫలంబనఁ దపఃప్రతాపం బనఁగన్. 643

తే. కపల మొదలిరెండ్లకు దుర్నిరుపరిసంధి
షత్వమగు దుష్పదంబు నిష్ఫల మనంగ
జరగు దుష్కర్మ మనఁగ నిష్కర్మ మనఁగఁ
జెల్లు దుష్ప్రీత మనఁగ నిష్ప్రీత మనఁగ. 644

క. పొలుపుగఁ జటతాది యుగం
బుల శషస లెనయ విసర్గపొందు ననన్ నా
శ్చలనము ఛందష్టికలు
లలిత యశస్తలి మిథశ్ఛలంబు లనంగన్. 645

క. అలరు నికారాది విస
ర్గలపై వర్గాపరాక్షరద్వయగణముల్
యలహావలు గదియ రేఫల్
గలియు హవిర్భుజ ధమర్భలంబు లనంగన్. 646

క. మొదలి విసర్గల మీఁదన్
బొదలిన శషస లవి యూఁదు భూరియశస్స్నం
పదయనఁగా సుమనష్ష
ట్పదము లనఁగ నధికమగు తపశ్శక్తి యనన్. 647

తే. అవ్యయాంత విసర్గవర్గాక్షరముల
రెంట ఙనమయలవహల రేఫ, రేఫ
గాక పెఱ వర్ణములఁ గారకంబుపట్ల
గదియు స్వర్గజం బనఁగ స్వఃకాంత యనఁగ. 648

క. ప్రకట విసర్గాది స్వర
మకారమునఁ గలపి యోత్వమగు సంధిఁ దపో
ధికుఁడన విసర్గచెడి వా
క్ఋకార మాప్రభృతిఁ గదిసి రజ ఆప్తియగున్. 649

క. కలితేకారాది విస
ర్గలు స్వరములమీఁదఁ గదియఁగా రేఫలు సం
ధిలు నర్చిరగ్ర మనఁగా
నలవడు మఱి చక్షురింద్రి[1]యంబన నొప్పున్. 650

తే. వర్గములఁ దృతీయ చతుర్థవర్ణములును
ఙనములును యరలవహలు నొనరఁగదియ
[1]వామ పద సవిసర్గాంత వర్ణ మోత్వ
మగురజోగుణమన మనోహర మనంగ. 651

క. వెలయ నివర్ణాది విస
ర్గలమీఁదను రేఫ గదియఁగా దీర్ఘము వ
ట్రిలి యర్చీరాజి యనఁగ
నలిఁ జక్షూరాగమనఁ దనర్చును సంధిన్. 652

క. ధర నవ్యయపు విసర్గకుఁ
బరమున నచ్చున్నఁ గుఱుచపై రేఫ యగున్
పరరేఫ గదియ దీర్ఘ
స్వరమగు స్వరధీశుఁడనఁగ స్వారాజ్యమనన్. 653

---

650. [1]చక్షురింద్రియం బనఁగ మహిన్. (ఛం. ద.)

651. [1]రాదుపర. (అ. శి. వ్రాఁతప్రతి).

తే. ప్రథమ శబ్దాంత దీర్ఘ వర్ణంబుమీఁది
[1]జరుగు రేఫాంత వర్ణ విసర్గయుండి
రేఫయగుఁదుది నచ్చున్న రేఫయున్నఁ
గ్రాఁగు వారాకరంబు వారాశియనఁగ. 654

క. అత్వాంత విసర్గయుడుగు
నిత్వాదుల రత్వమొందు ఋత్వముతుదరా
సత్వము తపబుద్ధియనఁగ
సత్వయుతా నిర్భృతియనఁ బ్రశస్తంబగుటన్. 655

క. తలమగు రేఫాంత విస
ర్గలమీఁద ఋవర్ణమొనరఁగా సంధివిస
ర్గలుడిగి రేఫయు ఋత్వము
గలియును బునర్భృతు సమేతకమలాక్షియనన్. 656

తే. స్వాదిసంధిలోపలి విసర్గాంత వర్ణ
సంధులెన్ని యన్నియును విసర్గసంధి
యందె కలసివచ్చుటఁజేసి స్వాదిసంధి
వేఱ యొనరింపఁబడదు వివేకరూఢ. 657

వ. మఱియు నొక్కసంధి విశేషం బవధరింపుము. 658

క. ఉపరిని హల్పంయుతమై
నపు డూఁదును స్వరసమన్వితాక్షరమగునే
నపుడూఁద దాదివర్ణము
ప్రపాద్యయము పరిష్కృతంబు పరిక్షప్తియనన్. 659

[మఱియు
సమాసంబులు]

క. లలిత ద్వంద్వ బహువ్రీ
హులు తత్పురుషము నలుక్కు నుద్యద్ద్విగువున్

654. [1] జరనమైన రేఫాంత విసర్గయుండి. (ఛం. ద.)

నలిఁ గర్మధారయము ని
ర్మలావ్యయీ భావమును సమాసము లరయన్. 660

వ. అందు పూర్వపదార్థప్రధానం బవ్యయీభావంబు, నుత్తరపదార్థ ప్రధానంబు తత్పురుషంబు, నుభయపదార్థ ప్రధానంబు ద్వంద్వంబు, నన్యపదార్థ ప్రధానంబు బహువ్రీహియునగు నందు, 661

## ద్వంద్వసమాస లక్షణము

క. పైకొకటైనను రెండైనను
జొక్కపు శబ్దములు [1]గదియుచున్ ద్వంద్వమగున్
గ్రమ్మొకొకద బలకృష్ణులకన
నక్కటి కమఠాదు లుర్వికాధారమనన్. 662

తే. వ్యస్తపదమయ్యేనేని సమస్తమైన
ద్వంద్వమున కంత్యపదము చందము విభక్తి
అంబువులు గోవు ద్విజుఁడు శుద్ధాత్ములనఁగ
[1]నంబు గోద్విజుల్ శుద్ధాత్ములనఁగ నిట్లు. 663

తే. చేయవలయు మాతాపితృసేవయనఁగ
మహితరుచులు సూర్యాచంద్రమసులనంగ
నాదిమునులు మిత్రావరుణాఖ్యులనఁగ
ద్వంద్వమున సంధిదీర్ఘము ల్వచ్చునిట్లు. 634

క. అల సంస్కృతమునఁ బోలెన్
వల దల్పాచ్చునకు నిచట ద్వంద్వపు నియతుల్
తెలుఁగు లనుగ్రహ నిగ్రహ
ములు నాఁగను బుణ్యపాపములు నాఁజనుటన్. 6‹5

---

662. [1]గదియుచో. (ఛం. ద.)

663. [1]నిట్లు ద్వంద్వంబు గృతులలో నెనసియుండు. (అ, శి, వ్రాఁతప్రతి).

అందు

## బహువ్రీహి

క. ఏవస్తు వెవ్వనికిఁ గల
దావస్తువుకలిమి యతని కలవడఁ బలుకం
గావలయు బహువ్రీహి శి
రోవిలసద్బర్హిబర్హారూఢవివేకా! 666

అందు

## తత్పురుషసమాసము

తే. ప్రథమపదమున కెద్ది విభక్తి దాని
చే విశేషింపఁబడినది యా విభక్తి
[1]సరగఁ బరఁగెడి తత్పురుషంబు గృతుల
నదియు నఞ్పూర్వ సహిత మెన్మిదివిధములు 667

క. తగఁ బ్రథమాతత్పురుషం
బగుఁ గాయము యొక్కపూర్వమపరము దెల్లం
బుగఁ బూర్వకాయ మనఁగా
[1]నగణితమతి నపరకాయ [2]మనఁగా వరుసన్. 668

క. కమలాశ్రితుండు ధనకృ
త్యము కుండలకాంచనంబు ధామాగతుఁ డ
ర్యమసుతుఁడు [1]పటస్థిత చి
త్రమును ద్వితీయాదు లాఱు తత్పురుషంబుల్ 669

---

667 [1]సంజ్ఞఁ బరఁగును (ఛం. ద.)

668 [1]నగణితముగ. (ఛం. ద.)

[2]మనఁగాఁ దనరన్ (ల. శి. వ్రాఁతప్రతి).

669. [1]సుతుఁడు పరిస్థితచిత్రమన. (ఛం. ద.)

## నఞ్ తత్పురుషము

క. క్షితి నఞ్ తత్పురుషంబగుఁ
బ్రతిషేధ నకారమునకుఁ బ్రతియై మొదలన్
వితతాకారము చొప్పడి
యతఁ డబ్రాహ్మణుఁ డనఁగ నవృషలి యనఁగన్ 670

## ద్విగువు

క. ద్విగువగు సంఖ్యా పూర్వక
మగుచు సమానాధికరణమగుచుఁ బ్రసిద్ధం
బుగఁ గర్మధారయాహ్వయ
మగుఁ దత్పురుషంబ యాక్రియన్ భిన్నగతిన్ 671

క. ఏయది సంఖ్యాపూర్వక
మై యలవడఁ బలుక ద్విగుసమాసంబది దా
నీయదు పతికీర్తిం దెలు
పాయెఁ ద్రిలోకియన నీసమాహారోక్తిన్. 672

అందు

## కర్మధారయము

క. ఏమిటి కెయ్యది గుణమై
తా మెఱయుచు నుండునది మొదల నిడిపలుకన్
భూమినది కర్మధారయ
మౌ మధురోదకము మేచకాభ్రంబనఁగన్ 673

క. అందముగఁ గర్మధారయ
మందు మహాత్మునకు నమరు నభియోగము గో
విందుఁడు మహాత్ముఁ డనఁ జే
యందు ఫలిత కల్పలత మహాలక్ష్మియనన్. 674

అందు

## అలుక్సమాసము

క. ఏక్రియ యెవ్వనికిందగు
నాక్రియఁదేరఁ బదమధ్యమందు విభక్తి
ప్రక్రియఁగూర్పఁ నలుక్కగు
నీక్రియ ఖేచరవనేచరేశ్వరు లనఁగఁ. 675

అందు

## అవ్యయీభావము

క. ఎక్కడ నెయ్యవి లేవవి
యిక్కడ లేవనిన నవ్యయీభావము దా
నెక్కొను నిర్మక్షికమని
[1]యక్కజముగఁ దీర్ఘమహిమ మభినుతిఁజేయఁగ. 676

వ. మఱియు [1]నుత్తరపదోపమాన సమాసం బెట్టిదనిన, 677

తే. ఓలిఁ బురుషసింహోయని యుగ్గడించు
చోటఁ దా సింహ ఇవ పురుషో యనంగఁ
దనరు విగ్రహమగుట నుత్తరపదోప
మానసమాసమం డ్రిది శాస్త్రమహిమవిదులు. 678

మఱియు

## కారకశబ్దంబులు

తే. [1]తగను సంస్కృతి తెలుఁగైనఁ దత్సమంబు
[2]దానఁ బుట్టిన తెనుఁగైన తద్భవంబు

---

676. [1]యక్కజము ... సేయఁగ. (ఛం. ద.)

677. [1]నుత్తరసమాసంబెట్లనిన. (ల. శి. వ్రాఁతప్రతి).

679. [1]సంస్కృతము తెనుఁగైనఁ దత్సమపదంబు. (ఛం. ద.)

[2]దానఁబుట్టి తెనుంగైనఁ దద్భవంబు. (ఛం. ద.)

దేశితెనుఁగు దేశజ మచ్చతెనుఁగు తెనుఁగు
నిర్మలుఁడు సిరియొడయఁడు నిక్కమనఁగ. 679

తే. సర్వనామముల్ యుష్మదస్మత్పదంబు
లావిభక్తులుక్రియ లవ్యయములు మానఁ
దెలుఁగు లగుచోటఁగారకాదిని వసించి
సర్వనామాశ్రయంబులు జరుగుఁగొన్ని. 680

సీ. ఏనన్న నీవన్న నితఁడన్నఁ బ్రథమాఖ్య
నను నిన్ను నాతని నన ద్వితీయ
నతనిచే నతనితో ననఁగఁ దృతీయ యా
తనికొఱ కతనికై యనఁ జతుర్థి
పంచమి యగు దీనఁబట్టుండి యందుండి
వానికంటెను వానివలన ననఁగఁ
వానియొక్క కులంబు వానికిఁ బ్రియమది
జనులలో నితఁడు మేలనఁగ షష్ఠి.

ఆ. జలధియందు లక్ష్మి గలుగుచుండఁగ దన్ని
మిత్తమనఁగ సప్తమీ విభక్తి
జలజనాభయనఁగ సంబుద్ధి యిట్లు వి
భక్తు[1]లమరుఁగారకోక్తి గతిని. 681

క. స్త్రీపున్నపుంసకములన
నేపగు లింగములమీఁద నెసఁగు విభక్తుల్
దీపించు నవియె వచన
వ్యాపార నిరూఢి [1]తత్పదాంతమ్ములతోఁ. 682

---

681. [1]వి. భక్తులరు, (ఛం. ౯.)

682. [1]నక్షరాంతరములతోఁ. (ఛం. ద.)

క. తనరఁగ అ ఆ ఇ ఈ
లనఁగా ఉ ఊ లు నాఁగ నంబుజ దళలో
చన ఋ ౠ లన ఓ ఔ
లనఁగ నజంతాహ్వయంబులగు నీపదియున్. 683

క. చజలు తవర్గములు పబమలు
స్వజనప్రియ రవలు శషలు సహలు పదాఱున్
నిజమగు హలంతములు హరి
యజంతములుగూడ నిరువదాఱంతంబుల్. 684

క. అంతము తెలుఁగగునెడ నే
యంతము తలసూప దైన నచట సమాసా
భ్యంతరములందు సంధ్యుచి
తాంతములకుఁగాన ధీవియద్విష్ణులనన్. 685

క. యత్తత్ప్రభృతు లొకటితోఁ
జొత్తెంచును యద్గుణంబుచూచి మహాత్మల్
మెత్తురు తత్పురుషుఁడు లో
కోత్తరుఁడన నీదృశప్రయోగబలమునన్. 686

మఱియు

క్రియాపదంబులు

క. [1]ఒరుఁ బలుకుఁ బ్రథమ పురుష మె
దిరి మధ్యమ పురుష పలుకు ధృతిదనుఁబలుకున్
ధరనుత్తమ పురుషక్రియ
వరుస నలింగకములైన వచనము లెనఁగున్. 687

క. కారక పదములు తెనుఁగై
నారి నరుఁడు రత్నమనఁ దనర్చుగతి క్రియా

687. [1] పరుఁబలుకు. (ఛం. ద.)

కార విశేషము [1]లమరవు
వారలు వచ్చెదరు దండువచ్చెద రనుచోన్. 688

క. ద్వివచనము లేదు తెనుఁగునఁ
బ్రవిమలగతి నేకవచన బహువచనము లోఁ
దివిచెద ననఁ దివిచెద మనఁ
గవియనఁ గవులనఁగ గ్రియలు కారకఫణితిన్. 689

మఱియు

## అవ్యయపదంబులు

క. ఇలఁగారక మట్టుల యు
జ్జ్వల రూపములయ్యు లింగవచనములు విభ
క్తులులే కవ్యయ శబ్దం
బులు సకలము సముచితార్థములు విలసిల్లున్. 690

తే. నెఱయ నవ్యయపదములన్నియు సమాస
రూపమున నంధ్రకవితకు రుచియొనర్చు
స్వర్వధూమణియన వృథాశంక యనఁ బూ
నః ప్రణతి వాఁగ నుచ్చైర్నినాదమనఁగ. 691

క. వృథ యను నవ్యయ మొక్కఁడు
ప్రథితంబై చెల్లుఁ గృతులఁ బ్రత్యేకము తా
వృథసేయక యెపుడు మనో
రథములు మాకిచ్చునీమురద్విషుఁ డనఁగన్. 692

క. కారకజనిత క్రియయును
నారఁ గ[1]ల్యప్క్త్వ్యయాది కావ్యయము దెనుఁ
గైరంజిలుఁ బూజించి వి
చారించి యుదాహరించి సంధించి యనన్. 693

---

688. [1]అఅరవు. (ఛం. ద.)

693. [1]ల్యత్ప్క్త్వయాదు లవ్యయము లగున్, (ఛం. ద.)

మఱియు

### విశేష్యవిశేషణంబులు

క. హరికరుణాకరుఁడనఁగా
హరియను శబ్దము విశేష్యమగు మఱి కరుణా
కరుఁడనఁగ విశేషణ మి
ట్లురుతరగతిఁ గారక ప్రయోగము లమరుక్. 694

మఱియు

### క్రియావిశేషణంబులు

క. పగతుని తమ్ముని శాశ్వత
ముగ నిల్పెను దశరథేంద్ర పుత్త్రుండనుచో
జగమునఁ గ్రియావిశేషణ
మగు నీయెడ శాశ్వతముగ నని పల్కుటయుక్. 695

ఆ. [1]శబ్దశుద్ధిగోరి సంధిసమాస రూ
పంబులిట్లు కొంత పలుకఁబడియె
మఱియు నుచితరీతి నెఱుఁగంగవలయు ర
హస్య లక్షణంబు లాంధ్రకవులు. అన్నారు. 696

వ. ఇవి సంధి పద్ధతి ప్రయోగ లక్ష్యములు. 697

---

696. [1]శబ్దసిద్ధికొఱకు. (ఛం. ద.)

ఇటనుండి గ్రంథపాతము.

## చి త్ర క వి త్వ ము

### చక్రబంధము

[ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము. 861]

శా. సత్యా క ల్పక ప్ర స్ఫుటా శరభిదాచా రా విశం క క్రమా
మత్యా వి ష్కృత బం ధురాదరణ ధామా జ ంతు కూ టా శ్రితా
దిత్యా వేం ధన ధ ర్మసారరత మూ ర్తీ ము త్కరా ద్రి క్షమా
మాత్యుల్లాస పదామహావిదితధామా [1]సాధుతారక్షమా. 698

### నాగబంధము

[ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము. 862]

చ. కరివరదానశూర సురగౌరవ సజ్జితపాదసార [1]సా
ధరధరతార [2]సూరి నరతారక నిత్యనశోకదాసభా
స్వరమదకౌశలార [3]సరసారకు భృద్వరధీరమౌనిభా
సురశుకగీతమారనిభశోభన రమ్యశరీరసంభృతా. 699

---

698. [1]సంధు (అ. శి. వ్రాతప్రతి). ఇందు మూఁడవ వలయమున "కవి వేంకటాద్రి" అనియు, ఆఱవ వలయమున "ప్రంబంధరాజము" అనియు కవిపేరు, కృతిపేరు వచ్చును.

శిరోమణిగారుని నామాంకితములైన స్వీయ చక్రబంధము లుప్తమై యుండనోపును.

699. [1]సారసేంధర. (అ. శి. వ్రాతప్రతి).

[2]శూరి. (అ. శి.)

[3]హార. (ప్ర. రా. వేం.)

### పుష్పమాలికాబంధము

[ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము. 8౬3]

స్రగ్ధర. శ్రీ[1]రామా[2]రా(ను)రాగస్థిరతరమురళీ స్మేరసారస్వరశ్రీ
తారాదారా[3]ధరాస్యా[4]తతనత వితతీదానితా నిత్యనిష్ఠా
తారాపారాబ్జరావా[5]ధరవరభరణాద్రౌపదీపస్వపక్షా
[6]సారాచారాభిరామా శరవర[7]శరణా చారుకారుణ్యరుచ్యా. 700

### అష్టదళపద్మబంధము

[ప్రబంధరాజ వేంకటేశ్వర విలాసము. 8౭0]

స్రగ్ధర. రామా రక్షో దలప్రాగ్ర్య [1]ధరకదన సత్రానపథ్యారమారా
రామా రథ్యాపసత్రా ప్రకటగుణసముద్రా పవిత్రాసమారా
రామా సత్రా విపద్రా రవినిభకరచక్రాశరణ్యాగమారా
రామాగణ్యా రశక్రా రథితఖగ వరాప్రాలదక్షోరమారా. 701

### ఓష్ఠ్యాచలజిహ్వాద్వ్యక్షరి

క. భవభాపీభవవిభవా
భవభావభవాభిభావభాపీభీభూ
భవభావభావివై భవ
భ[1](వి)భావిభుభావవిబుధభావావిభవా! 702

---

700. [1]రామే. (ప్ర. రా. వేం.)
[2]రాజి. (ల. శి.)
[3]బాద. (ల. శి.)
[4]దరభరహరణా. (ప్ర. రా. వేం.)
[5]దరభరణరతా. (ప్ర. రా. వేం.)
[6]శారానీరాజిరాజ్యా. (ల. శి.)
[7]శరహరణరతా. (ల. శి.)

701. [1]దరకదనసత్రా. (ప్ర. రా. వేం.)

702. [1]భవ. (ల. శి. వ్రాతప్రతి).

[పఫబభమవలు - ఓష్ఠ్యములు, అచలజిహ్వము అనఁగా నుచ్చారణలో జిహ్వాచలనము (నాలుక కదలిక) లేనివి, ద్వ్యక్షరి యనఁగా రెండక్షరములు గలది జిహ్వాచలనములేని యోష్ఠ్యములలో 'భ - వ' అను రెండక్షరములతో నీపద్యము రచింపఁబడినది ]

## బ్రహ్మాస్తుతి – పుష్పమాలికాబంధము

చ ఖరకరఘోరతేజ కవికల్పక బద్ధనవీనజానకీ
వరధరధీరరాఘవ భవస్తవలోలుప చాపరోపఖా
స్వరకర[1]వీరగుప్తస[2]వసర్వసమారమణీ [మనో]మనో
హరశరహారకీర్తియన [యవ్య]యదానవజీవనావనా 703

## గోమూత్రికాబంధము

చ రఘువర ధీరతావిమలరామ దయాపరదివ్యమూర్తి య
త్యఘ నలినాక్షదాన [1](రత)యక్షయరూప జితారిభాసురా,
రఘుశరవీరభూవిభుల (రా)మ జయాకరభవ్యకీర్తిని
త్యఘనఘనాథ దాశరథి యక్షయకోప ప్రతాపభాస్కరా 704

## *పుష్పగుచ్ఛబంధము

క సురవర దరకర ఖర కర
కరఖర శర దార ధీర ఖరహారహార

---

703 [1]వార (అ. శి వ్రాఁతప్రతి)
[2]సవ (అ శి వ్రాఁతప్రతి).

704 [1]తర (అ శి వ్రాఁతప్రతి).

705 *ఇది 'ఛత్రబంధ' మని అ శి కాని ఛత్రబంధ లక్షణ మిందు సరిపడుట లేదు దీనిని గోమూత్రికాబంధముగను, పుష్పమాలికాబంధముగను సంతరింపనగును ఇందు ప్రతి 2-వ అక్షరము రవర్ణముగా నిర్వహింపఁబడియున్నది. గోమూత్రికా పుష్పమాలికలు కిట్టి నిర్బంధమనవసరము కాన నిది పుష్పగుచ్ఛ బంధముగా నూహించి, సంతరింపఁబడినది.

స్ఫురమర నరవర ధీర
త్రరమా రఘు రమ్య రక్షి రణిరత రథ్యా! 705

## నాగబంధము

స్రగ్ధర. భవ్యా, రామక్షితీశా, భవనవజలజప్రాయవైశద్యకీర్తీ,
దివ్యాగత్యాగరాజద్విమల, రణరమాధీన భద్రాకరాయ
తక్రివ్యాదాకీర్ణ నానాగహన వినతపక్షా జరాతీతధీరా
నవ్యాపద్మేశ భవ్యా, నరభరణదిశానాథగణ్యోపసేవ్యా! 706

## పాదగోపనము

చ. నరవరధీరగుప్తకృపణాపరభూధరమన్యువేగజే
త్రరియుతధీరతాలఘుతరావణభృల్లలితా(భ)భూసురా
[1] యురుఘనభావమావిభవయుక్తరమా(వరవత్స)నిర్మలా
(వరకృప ధన్యుఁజేయుఁ రఘువల్లభరాఘవ భక్తవత్సలా!) 707

[పాదగోవనమనఁగాఁ బాదమును దాఁచుట. ఇదియొక చిత్రకవితావిశేషము. ఇందు మొదటి మూఁడుపాదములలో నాల్గవపాదముయొక్క యక్షరము లొకక్రమమున నిముడ్పఁబడియుండును. పై పద్యము మూఁడుపాదము లలోఁగల యక్షరములలో రెండేసి యక్షరముల విడిచి మూఁడవదానిని గ్రహించి క్రమముగా ఎత్తి వ్రాపినచో నాల్గవపాదము వచ్చును.]

## అనులోమవిలోమము

క. మానవ పాయజ తనుశివ
మానధనాసార భవన మదన దవనదా
దానవదన దమనవభర
సానాధన మావశినుత జయ పావనమా. 708

---

707. [1] పురు. (అ. శ.) యతిభంగము.

[ఇందు మొదటినుండి తుదివఱకుఁ, దుదినుండి మొదటివఱకు నెటు చదివినను నొకేరీతినుండును. ఇదియొక చిత్రకవితావిశేషము. అనులోమ విలోమమనిన త్రిప్పిచదివిన నర్థవంతమగు పద్యాంతరము కావలెనని యితర లక్షణ గ్రంథములు దెలుపుచున్నవి. త్రిప్పిచదివిన నొకేరీతి నుండునవి భ్రమక చిత్రములు. పై పద్యమందు పూర్వార్ధము త్రిప్పి చదివిన నుత్తరార్ధమగుచున్నది. ఇట్టిరీతి చిత్రకవితను పద్యభ్రమకమని పేర్కొనుట యుక్తము. కానఁ బైపద్యము ననులోమ విలోమమనుట కన్నఁ బద్యభ్రమకమనుట యుక్తతరము.]

## అష్టదళపద్మబంధము

స్రగ్ధర. హారీనిత్యాసనర్మా హరవినుతనయాత్యాయ సత్రావిరాధీ
ధీరావిత్రాసయత్యా ధృతవదనతధాత్రీ పదివ్యాభరాకా
కారాభవ్యాది పత్రీద్గమన శుభగుణగ్రామసక్తాసరామా
మారాసక్తా సమగ్రా మహిత వరధనుర్మాన సత్యానిరీహా. 709

గద్య :- ఇతి శ్రీమద్వేంకటరమణ కరుణాకటాక్షవీక్షణసంప్రాప్త సహజసారస్వత విశ్రుతాశ్రాంత విశ్రాణనసంతత సంతోషితామందానంద కందళిత నిఖిల ధరాబృందారకబృంద నందవరవంశోత్తంస, సకల కవిరాజమిత్ర, పౌత్తపి వంశపవిత్ర, గౌతమసగోత్రాశ్వలాయనసూత్ర, సుచరిత్ర, పపిండికొండ దుర్గరాజవెంగనమంత్రిపౌత్ర రామయామాత్యపుత్ర, మడూరి రఘునాథ ప్రధానదౌహిత్ర, యశేషవిద్వత్కవిజనకృతాదరణపాత్ర, చతురుపాయ ధురీణ, కార్యఖడ్గప్రవీణ, నిఖిలసుకవిజనాంగీకృతదత్తనిశ్శంకలక్షణ చక్రవర్తి బిరుదాంక, వేంకటరమణార్యప్రణీతంబైన సకలలక్షణసంయుత సుధాబ్ధిసంపూర్ణచంద్రోదయంబగు 'లక్షణశిరోమణి' యందు వర్ణగణ వృత్తవిశ్రమాధికారమ్ములను చతుర్విధాశ్వాసముల విస్తరిల్లుచుండునందు, విరతులు, ప్రాసస్థానసంజ్ఞలు, వడులు, ప్రాసంబులు, ప్రాసవిధులు,

రేఫఱకారంబులు, విభక్తిక్రమ సంధిసమాస విచారంబులు, దశవిధదోష భేదంబులు, నవరససంగతులు, చ, జ, య, వ, స, ర అనియెడి వర్ణ సంకేతంబులు, వట్రువలు, క్రారలు, చిత్రకవితాలక్షణవిశేషణంబులుగలుగు విశ్రమాధికారమను నిది చతుర్థాశ్వాసంబు సర్వంబు సంపూర్ణంబు.

మంగళమహత్ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

# అనుబంధము - 1

## చక్రబంధము



శా. సత్యాకల్పకప్రస్ఫుటాశరభిదాచారావిశంకక్రమా
మత్యావిష్కృతబంధురాదరణభూమాజంతుకూటాశ్రితా
దిత్యావేంధనధర్మసారరతమూర్తీముత్కరాద్రిక్షమా
మాత్యుల్లాసపదా మహావిదితధామా సాధుతారక్షమా. 698

## నాగబంధము



చ. కరివరదానశూర, సురగౌరవ సజ్జిత పాదసారసా,
ధరధరతార, సూరినరతారక, నిత్యనశోకదాస, భా
స్వరమదకౌశలా, రసరసార, కుభృద్వరధీర, మౌనిభా
సుర, శుకగీత, మారనిభశోభన రమ్యశరీరసంభృతా. 699

## పుష్పమాలికాబంధము



స్రగ్ధర. శ్రీరామారా(ను)రాగస్థిరతరమురళీస్మేరసారస్వరశ్రీ
తారాదారాధరాస్యాతతనతవితతీదానితానిత్యనిష్ఠా
తారాపారాబ్జరావాధరవరభరణాద్రౌపదీపస్వపక్షా
సాదావారాభిరామాశరవరశరణాచారుకారుణ్యరుచ్యా. 700

## అష్టదళపద్మబంధము




స్రగ్ధర. రామారక్షోదలప్రాగ్ర్యథరకదన సత్రాసపథ్యా రమారా
రామా రథ్యాపసత్రా ప్రకటగుణసముద్రా పవిత్రానమారా
రామా సత్రా విపద్రా రవివిభకరచక్రా శరణ్యాగమారా
రామాగణ్యారశక్రా రథిత ఖగవరాప్రాలదక్షోరమారా. 701

## పుష్పమాలికాబంధము



చ. ఖరకరఘోరతేజ కవికల్పక బద్ధనవీన జానకీ
వరధరధీరరాఘవ భవ స్తవ లోలుపదావరోపభా
స్వరకరవీరగుప్తసవసర్వసమారమణీ[మనో]మనో
హరశర హారకీర్తియన [యవ్య]యదానవజీవనావనా. 702

గోమూత్రికాబంధము



చ. రఘువర ధీరతావిమలరామ దయాపరదివ్యమూర్తి య
త్యఘనలినాక్షదాన(రత)యక్షయ రూపజితారిభాసురా
రఘుశరవీరభూవిభుల(రా)మ జయాకరభవ్యకీర్తిని
త్యఘనఘనాథ దాశరధి యక్షయకోపప్రతాపభాస్కరా. 708

## పుష్పగుచ్ఛబంధము




క. సురవర దరకర ఖరకర
కర ఖర శరధార ధీర ఖరహర హోర
స్ఫురదుర నరవర ధీర
త్రరమారఘురమ్య ధక్షిరణి రతరధ్యా. 705

## నాగబంధము



స్రగ్ధర. భవ్యా, రామక్షితీశా, భవనవజలజప్రాయవైశద్యకీర్తీ,
దివ్యాగత్యాగరాజద్విమల, రణరమాధీన భద్రా పరాయ
త్క్రవ్యాదాకీర్ణ నానాగహనవినతపక్షిజరాతీతధీరా
వవ్యాపద్మేశభవ్యా, నరభరణదిశానాథగణ్యోపసేవ్యా! 706

## అష్టదళపద్మబంధము



స్రగ్ధర. హారీనిత్యాసనర్మాహర వినుతనయాత్యాయ సత్రానిరాధీ
ధీరా నిత్రాసయత్యా ధృతవదనతధాత్రీపదివ్యాభరాకా
కారాభవ్యాదిపత్రీడ్గమన శుభగుణగ్రామ సక్తాసరామా
మాధాసక్తాసమగ్రా మహితవరధనుర్మానసత్యా నిరీహా. 709

# అనుబంధము - 2

**(i)** లక్షణశిరోమణియం దుదాహృత లక్షణగ్రంథములు - పద్యములు.

**(i-అ)** లక్షణగ్రంథములు :

అథర్వణకారికావళి (వికృతి వివేకము. అథర్వణుఁడు) ల. శి. ఆ-ప.

లఘువశ్శిఖిశైలాగ్నయో ఽన్యేష్వగజ బర్హిషః
లఘుర్నాస్తి జకారస్య లఘుస్సస్య క్వచిత్ క్వచిత్. 4-571

అథర్వణచ్ఛందము (అథర్వణుఁడు)

చ. అలవడ సంపెఁగల్ దురిమి 1-111
క. ఎన్నిట యతిరావలెనని 2-12
తే. పర్వతములందు మేరువు భాతి 2-48, 170
క. వసుధామరులకుఁ గచటలు 1-108
క. స్థానచ్యుతియగు నీచ 2-151

ఆంధ్రకవితాపితామహుని అలంకారము (పెద్దన)

తే. ఇందురేఖాకలాప లోకైక సేవ్య 4-183

ఆంధ్రభాషాభూషణము (కేతన)

క. ఒప్పులు గలిగిన మెచ్చుఁడు 1-26
క. గుణదోషంబు లెఱిఁగి 1-24; 4-21
క. లక్షణములు దెలిపెడిచో 1-80

ఆంధ్రశబ్దచింతామణి (నన్నయభట్టు)

సూ. తత్సమగస్త్వద్భవగో దీర్ఘాత్తురగశ్చ రేఫస్స్యాత్ 4-57
సూ. నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు
నిత్యంస్యాత్. 4-571

కవిజనాశ్రయము (భీమన)

| | |
|---|---|
| | ల. శి. ఆ_ప. |
| క. కమనీయ సమస్తకళా,గమముల | 1_43 |
| క. కావునఁ గవిత్వతత్త్వము | 1_44, 3_429 |
| క. జననుత భీమతనూజా | 4_454 |
| క. దానమున సత్యమున నభి,మానమున | 4_451 |
| క. దోసంబులేక వస్తు ని,వాసంబై | 4_449 |
| త్రిభంగి. ననలును, ననలును | 3_233 |
| లయవిభాతి. నస నన సనంబులును | 3_232 |
| క. నిక్కవమయ్యెఁ వర్గుల | 4_42 |
| క. పరమోపకార ధరణీ, సురవర | 4_457 |
| సీ. పాదముల్ నాలుగు పాదముల్ గాఁజేసి | 3_331 |
| క. పోలుఁ పుష్ప బుభు లకము | 4_335 |
| క. ప్రపరా పసమను సుప్ర,త్యపి | 4_137 |
| క. ప్లుతమనఁబరఁగు మాత్రా | 4_195 |
| ఉ. మానుగ విశ్రమాక్షర సమన్వితమై | 4_82 |
| తే. పెంఁదల సంయుక్త వర్ణంబు గదిసె నేని | 1_118 |
| క. విత్రస్తాఘపవిత్ర చరిత్రజిత | 4_455 |
| క. వెలయఁగ సంయుక్తాక్షరములో | 4_293 |
| క. స్వః కాంతా సమయోషిదు | 4_448 |
| క. హిమకర కర వైశ్వానర | 3_161 |

కవిరాజగజాంకుశము (భైరవకవి)

| | |
|---|---|
| సీ. అవని గణాలి గణావళి కధిదైవ | 2_97 |
| క. ఉరగంబును ముంగిసయును | 2_80 |
| ఆ. ఏ యవస్థనుండి యేవేళ నేగ్రహంబు | 2_131 |
| చ. కలువలఁగొప్పదీర్చి సిరిగంధమలంది | 1_36 |
| ఆ. గ్రహము పొంతు కలిమికలగణసంగతి | 2_87 |
| క. తొలుత గణగ్రహమైత్రులు | 2_89 |
| తే. ధనముఁ గోలుపుచ్చు దగ్ధనక్షత్రంబు | 2_140 |
| క. నక్షత్రగ్రహ రస భూ,తా | 2_195 |

| | |
|---|---|
| | అ. శి. ఆ-ప. |
| తే. హరియుత వర్గహల్లు వికల్పయతులజరుగు | 4-281 |
| క. హరి కరుణా కరుఁడనఁగా | 4-694 |
| **నరసభూపాలీయము (మూర్తికవి)** | |
| తే. అందనుప్రాసభేదమ్ములైన శబ్దభవ | 4-462 |
| తే. ఒక్క వర్ణంబుకడదాక నుద్ధరింప | 4-464 |
| క. తనునగు శబ్దార్థంబులు | 1-58 |
| మ. పరమజ్ఞాన లతాలవాలము జగత్ప్రఖ్యాత | 1-46 |
| చ. సమద విపక్షశిక్షణ విచక్షణ దక్షిణ | 4-465 |
| పంచచామ. స్ఫురత్కృపాబలప్రతాపభూతి | 4-453 |
| **నాగాభరణము (?)** | |
| క. ఈవర్ణనలాకళాన్ని యభావములైనను | 1-56 |
| **బాలసరస్వతీయము (బాలసరస్వతి)** | |
| శ్లో. వాచామాంధ్రమయీనాంయః | 4-514 |
| **భాస్కరచ్ఛందము (భాస్కరుఁడు)** | |
| తోటకము. చెలువార గజాజిన చేలముతో | 4-166 |
| **రెట్టమతశాస్త్రము (అయ్యల భాస్కరకవులు)** | |
| ఉ. పూవులు నక్షతంబులును బొందుగాఁ దోయిటఁబట్టి | 4-483 |
| **రేఫ ఱకారనిర్ణయము (తాళ్లపాక తిరుమలయ్య)** | |
| క. ఇచ్చిరి తెచ్చిరి యనియెడు | 4-524 |
| **లక్షణతిలకము (లింగముగుంట రామన్న)** | |
| క. ధరపైఁ గురుపర కవితల | 2-186 |
| ఉ. లక్కనమేచికైత మొదలన్ | 1-117 |
| క. లక్షణ మెఱుఁగని కవియువ | 2-188 |
| క. వినఁబడు దీర్ఘము విషమగు | 2-177 |
| సీ. వినుత పద్యాది నిల్చిన వర్ణమునకు నాథుని | 2-181 |

LS — 57

| | ల. శి. ఆ-ప. |
|---|---|
| **వికృతివ్యాకరణము (అగస్త్యవ్యాకరణము. సం. అగస్త్యుఁడు)** | |
| సూ. అచః ప్రతిపదం కాత్యాయనశ్చ | 4-514 |
| సూ. ఇనైచావనో్యస్యమ్ | 4-514 |
| సూ. ఊదితశ్చ | 4-514 |
| సూ. నణడలామిహోన్యాన్యమ్ | 4-514 |
| సూ. మనయామధోవర్తమానానామ్ | 4-514 |
| సూ. మహతోఽతఉత్ | 4-514 |
| సూ. మహతస్సోర్డజ్ | 4-514 |
| సూ. రవలామధశ్చ | 4-514 |
| సూ. హ్రస్వోవాఖండః | 4-514 |
| **విశ్వేశ్వరచ్ఛందము (?)** | |
| ఆ. మీను తూని కోల మిథునంబు తేలును | 2-83 |
| **వృత్తరత్నాకరము (సం. కేదారభట్టాచార్యులు)** | |
| శ్లో. పాదేగుర్వగురావాద్యాఃఘు | 3-250 |
| శ్లో. వర్ణాన్ వృత్తభవానైకనైనా | 3.264 |
| శ్లో. వడ్వివమేష్టౌసమేకలాస్తాశ్చ | 3-398 |
| శ్లో. సంఖ్యేవద్విఘ్నైకోనసద్భిర | 3-255 |
| సమవృత్తములు | 2 : 141-155 |
| **శ్రీధరచ్ఛందము (శ్రీధరుఁడు)** | |
| తే. అరయ ననునాసికా పూర్వమగుచువర్గ | 4-117 |
| క. మున్నగ్రహంబుల గణముల నెన్నుచు | 2-169 |
| క. యశవర్గద్వయము యతికిన్ | 4-320 |
| ఉ. అక్కన మేచికైత మొదలన్ సుగుణాక్షరముల్ | 1-117 |
| చ. వెలయుఁగ బొడ్డుమల్లియలు వేనలినంగమున్ | 1-135 |
| క. సురుచిరముగ ద్విరదగతి | 3-362 |

| | ఆ. శ. ఆ.ప. |
|---|---|
| **ఉత్తరహరివంశము (నాచన సోముఁడు)** | |
| క. అంజెదవుగాక నను జెంతన్ జేరఁగ నీకై | 4_420 |
| **ఏకావళి (సం.) (?)** | |
| ప్రాలేయాచల కన్యకా | 2_155 |
| **కవికర్ణరసాయనము (సంకుసాల నృసింహకవి)** | |
| చ. అడుగని యండజాదులకు నాకలిదీరక యున్నె | 4_38 |
| **కవులషష్ఠము (రాచమల్లు కవులు)** | |
| మ. అనియీ విద్య గురుప్రసన్నుఁడు పృథుస్వాంతుండునా | 4_314 |
| క. అనుటయుఁ గృష్ణద్వైపాయన | 4_407 |
| తే. వలవదు భయంబు వారెంత వారలైన | 4_316 |
| ఉ. సంతతభక్తియుక్తి కొనసాగ కయుండిన | 4_313 |
| **కల్పవల్లి (సం) (?)** | |
| హేరంబమవలంబే | 2_155 |
| **కాశీఖండము (శ్రీనాథుఁడు)** | |
| క. ప్రాణాపానవ్యానదాన | 4_405 |
| **జయదేవాష్టపది (జయదేవుఁడు)** | |
| ఇతిచటుల చాటు పటుచారు మురవైరిణో | 3_427 |
| **తపతీసంవర్ణోపాఖ్యానము (అద్దంకి గంగాధరుఁడు)** | |
| క. మనసా కన్యకఁ బెంచి | 2_162 |
| **త్రిస్థలీదండకము (నందిసింగయ, తిమ్మన)** | |
| విజయనగరి హేమకూట | 2_15 |
| **నలోదయము** | |
| హృదయసదేతి | 2_[illegible] |

సభాపర్వము :

| | ల. శి. ఆ-ప. |
|---|---|
| భీమనగారి చంపకము | |
| చ. వెలవెలఁబాఱి తాల్మిఁగడు వేగదవగ్గి | 4-100 |
| భీమన ప్రార్థనాపంచకము | |
| ఉ. శ్రీలలనా తనూభవ విశేష జగజ్జయ మూలమన్మథా | 4-64 |
| భీమన మిత్రపద్ధతి | |
| క. భువిలో మిత్రుండగవాఁడు | 4-153 |
| భీమన శివస్తుతి | |
| క. ఎంతయును దుస్తరంబు | 4-147 |
| బృందాసంభవము (పరాపృతము అప్పన) | |
| ఉ. తేజవరాంద్రచూపు చితికిన్ మెఱుఁగెక్కు నా | 4-123 |
| మదనసేనము (నంది మల్లయకవి) | |
| క. పోనుద్యోగముఁజేసిన | 4-408 |
| మనుచరిత్ర (అల్లసాని పెద్దన) | |
| సీ. వదనప్రభూత | 4-347 |
| మ. వనజాక్షీ పమ వామలూరు | 4-122 |
| శా. శీలంబుం గులమున్ శమంబు | 4-260 |
| రంగనాథరామాయణము (అచ్చవెల్లిరంగనాథుఁడు) | |
| ద్వి. ఎక్కడా గురుఁడని యెఱుఁగని నీవు | 4-221 |
| ద్వి. ఎసఁగి దివ్యులఁ బెంప ఋషుల మన్నింప | 4-39 |
| రాఘవపాండవీయము (పింగళిసూరన) | |
| మ. అనయంబున్ మదనామితాస్త్ర | 4-484 |
| క. జనులందఱు నీయందత్యను | 4-186 |

| | ఆ. శి. అ-ప. |
|---|---|
| మ. జవవద్ఘోటకపాటితక్షితి | 4-124 |
| మహాస్రగ్ధర. తలఁపిట్లుత్సాహమొందన్ | 4-370 |
| శా. లోకత్రాణరతిన్ దదాదిమహీలోక | 4-394 |
| క. లోకైకస్తుత్యునకు | 4-363 |
| క. వేమఱు మనగుర్వశ్వత్థామం | 4-103 |
| **రుక్మాంగదచరిత్ర (ప్రౌఢకవి మల్లన)** | |
| సీ. దంభోళిధరసతీతాంబూలపేటి | 4-609 |
| క. పడతీ నీ తలిదండ్రుల,కడకున్ | 4-500 |
| **వరాహపురాణము (నందిమల్లయ, ఘంటసింగన)** | |
| మ. అని గౌరీపతికిన్ భవానికిని నాహ్లాదంబుగ | 4-115 |
| ఉ. ఆనళినాక్షినవ్వుటయు నంతన | 4-66 |
| తే. ఋషివరైక వతంస నిస్పృహుఁడైన | 4-238 |
| క. నృగుఁడన్ ధాత్రీపతి మృగయార్థము | 4-411 |
| తే. పృథివియిట్లను | 4-345 |
| క. మీ రెఱిఁగినంత యెఱుఁగుదు | 4-239 |
| **వసంతవిలాసము (?)** | |
| క. అత్తఱివిట నాగరికుల | 4-326 |
| **వసుచరిత్ర (రామరాజభూషణుఁడు)** | |
| తే. అంచితంబైన కోకిలాలాపంబు | 4-357 |
| **వామనచరిత్ర (?)** | |
| క. స్వస్తియని పలుకు మఁగమలా | 4-215 |
| **విక్రమార్కచరిత్ర (కొఱవి గోపరాజు)** | |
| క. ఇది చేతిది పోచక పిన్నది | 4-211 |

# సంకేత

# లక్షణశిరోమణి - పరిష్కరణ

| పుట | పంక్తి | ఉన్నరూపము | ఉండవలసినది |
|---|---|---|---|
| | | పీఠిక | |
| 2 | 2 | దు(ద్గ) | దు(గ్గ) |
| 5 | 13 | గృష్టా [ ] | [3-434] |
| 8 | 8 | సుసాధ్యము | సుసాధము |
| 11 | 16 | యుదాత | యుదాత్త |
| ,, | 17 | కాతంభట్టు, | కాతంభట్టు. |
| 13 | 1 | (1080-11 0) | (1080-115C) |
| | 10 | వాదాంగచూడామణి | వాదాంగచూడామణి(12వ శ) |
| 16 | 18 | నిరేశము | నిర్దేశము |
| 17 | 4 | పేర నుద్ధరింపఁబడి | పేర ఈ లక్షణశిరోమణిలో నుద్ధరింపఁబడి |
| 19 | 16 | కాకనిది-ఛందో | కాకనిది |
| 20 | 2 | కర్త, కాలము | కర్త పేరు, కాలము |
| 22 | 20 | నిరేశము | నిర్దేశము |
| 23 | 5 | నశబోఽస్తి | నశబ్దోఽస్తి |
| 25 | 17 | కులగృహా | కులగ్రహా |
| 32 | 19 | 67108 | 6,71,08,864 |
| 36 | 15 | ఏద్విత్రిచ్ఛందః | ఏద్విత్రచ్ఛందః |
| 40 | 8 | సితిభేదమూ సమానమే | స్థితిభేదము లేదు |
| 42 | 25 | మాత్రాసమత | మాత్రాసమక |
| 48 | 15 | సర్వస్థాన గర్వచతు | పరస్థానసర్వచతు |
| 51 | 9-10 | కారుఁడు పదివృత్త | కారుఁడు పరివృత్త |
| 55 | 7 | గురువునకు మూఁడు | గురువునకు మాఱు |
| 56 | 17 | పాదములందుఁబ్రాస | ఏకప్రాస |

| పుట | పంక్తి | ఉన్నరూపము | ఉండవలసినది |
|---|---|---|---|
| 62 | 19 | కతానుగతికో | గతానుగతికో |
| 63 | 13 | యాతని కతి | యాతని కృతి |
| 71 | 17 | యతిసంఖ్య తగినట్లు | తగ్గినట్లు |
| 75 | 6 | స్వరమున నే కాక | స్వరమున కే కాక |
| 77 | 19 | త్వత్+చరణ=త్వచ్ఛరణ | త్వచ్చరణ |
| 79 | 22 | 'అప' | 'అప' |
| 83 | 3-4 | దాసోహములోఁ | దాసోఁహములో |
| 88 | 9 | శబాదిలో | శబ్దాదిలో |
| 93 | 16 | (మార్కొండునని) | (మార్కొండునని)-ఇట్టి |
| 96 | 12 | (రక్ష, | (రక్ష,) |
| 101 | 4 | (ఉద) | (ఉత్) |
| 104 | 5 | శకంధాదుల | శకంధ్వాదుల |
| 106 | 16 | అకారము మీఁది | లకారము మీఁది |
| 107 | 9 | ఇందు చేయుటకే | ఇందు స్వరమైత్రి చేయుటకే |
| 109 | 2 | వ్యాఘుతమగును | వ్యాఘాతమగును |
| 110 | 14 | అనంతపు కవులు | అనంతర కవులు |
| 113 | 11 | సజప్రాస | వర్గజప్రాస |
| 116 | 15 | శిష్టమునలేని | శిష్టమునకని |
| 117 | 26 | మాంధాత్రఘు | మాంధాతృరఘు |
| 119 | 10 | నిలిపును | నిలిపెను |
| 121 | 9 | విరాట పర్య | విరాట పర్వ |
| | 21 | వర్గరొుక్క | వర్గయుక్క |
| 122 | 6 | భీమకవిబాటుధార | చాటుధార. |
| | 12 | యుద్ధ — | యుద్ధ — 1446 |
| | 15 | భాగవత -- | భాగవత -- 992 |
| 124 | 8 | గవేరాది | గకారాది |
| 127 | 6 | యొద్దేశ | యొంర్దేశ |
| 128 | 5 | ంఘవోఁ | ంఘువో |

| పుట | పంక్తి | ఉన్నరూపము | ఉండవలసినది |
|---|---|---|---|
| 149 | 18 | నసన నసన నస | నసన నసన సస |
| | 19 | 36 అక్షరములు | 34 అక్షరములు |
| | | 36 వర్ణములు | 34 వర్ణములు |
| 153 | 26 | రేఫఱకారములో | రేఫఱకారముల్ |
| 158 | 1 | 4 ఆ - | 4 ఆ - 176 వ |
| | 12 | సంప్రదించి | సంప్రతించి |
| 159 | 20 | అప్పకవ్యాదులలో | అప్పకవీయాదులలో |
| 160 | 1 | సంప్రదించి | సంప్రతించి |

## ప్రథమాశ్వాసము

| | | | |
|---|---|---|---|
| 2 | అధస్సూచి | పండితగురురా | పండితగురుకవిరా |
| 4 | 23 | నతులీతా | నతులిత |
| 5 | 15 | దురంధర | ధురంధర |
| 10 | అధస్సూచి | కహార | కహ్లార |
| 13 | 10 | సత్కృతిః పుత్రః | సత్కృతిః పుత్రైః |
| 16 | 17 | వర్ధ | వర్థ |
| 19 | 10 | మదంబు | ముదంబు |
| 20 | 14 | కఠోష్ఠంబున | కంఠోష్ఠంబున |
| 20 | 23 | అకారంబులు | ఱకారంబులు |
| 21 | 12 | నేబది | నేఁబది |
| 21 | 23 | దెలియకృష్ణ | దెలియఁగృష్ణ |
| 22 | 10 | లుపదిబూ | లుపదిబుూ |
| 24 | అధస్సూచి | ఛందోభంగము | ఇందలి అపపాఠములు ఛందోభంగములు. ఇంచుక సవరింపఁబడినవి. |
| 25 | 21 | కసురి | కస్తురి |
| 26 | 22 | నోసఁగు | వోసఁగు |
| 27 | 10 | యరలమవతి | యరలమువలి |
| ,, | 23 | గమార | గుమార |

| పుట | పంక్తి | ఉన్నరూపము | ఉండవలసినది |
|---|---|---|---|
| 28 | 8 | దేకృష్ణ | దేవకృష్ణ |
| 30 | అధస్సూచి | ఖిన్నపాఠము | భిన్నపాఠము |
| | ,, | మెఱుగరాదు | మెఱుఁగరాదు |
| 32 | 121 | తటము ( ) | [ ] |
| ,, | 123 | ( ) | [ ] |
| 34 | 12-13 | | [భాగవతము 10వ స్కంధము. ఉ. భా. 473]. |
| ,, | | x x x x | నిన్నుఁజూడఁగంటి నీకృపఁగనుఁగొంటి నఖిల సౌఖ్యపదవులందఁగంటి. |
| ,, | అధస్సూచి | ఆకాదులం | కాదులు |
| 35 | 17 | రుచిఁబోల్చ | రుచిఁబాల్చ |
| 36 | 1 | కినికీర్తిమాలిని | కినిఁగూర్తిమాలిని |
| ,, | 2 | శుభగాఖ్య | సుభగాఖ్య |
| ,, | 10 | ఫలములోఁనగూర్చ | ఫలములోనఁగూర్చ |
| 38 | అధస్సూచి | చూ. 3-47 | చూ. 3-63 |

## ద్వితీయాశ్వాసము

| పుట | పంక్తి | ఉన్నరూపము | ఉండవలసినది |
|---|---|---|---|
| 42 | 21 | నివిఱొ | నవిఱొ |
| 43 | అధస్సూచి | రెండులఘువులం | రెండులఘులు |
| 44 | 2 | లగముగలవి | లగముగలము |
| ,, | 23 | మాత్రలిండగన్ | లిడంగన్ |
| *46 | అధస్సూచి | శ్రీనాథుఁడుకాదేమో | కాఁదేమో |
| 48 | 20 (33వ పద్యముక్రింద) | — | ఇఁక గణమ్ములకుఁబ్రాణవాది సప్తస్వర లక్షణము |
| 49 | 2 | గ్రమములో | గ్రమముతో |
| 50 | 1 | గాస్యప | గాశ్యప |
| 51 | 7 | గౌరవాంతి | గౌరకాంతి |
| 52 | 6 | పులింగంబు | పుంలింగంబు |
| 53 | 23 | దుర్గుణంగణ | దుర్గుణగణ |

| పుట | పంక్తి | ఉన్నరూపము | ఉండవలసినది |
|---|---|---|---|
| 54 | 22 | కృతులయందు | కృతులందును |
| ,, | అధస్సూచి | సరుగు | పరుగు |
| 55 | ,, | నొరులఁబేరయిన | నొరులఁజేరయిన |
| 61 | 7 | నేట్పది | నేడ్పది |
| 64 | 4 | గొఱయయుఁగోతి | గొఱియయుఁగోఁతి |
| 66 | 8 | సలక్షణసారము | సులక్షణసారము |
| 68 | 22 | వృషభంబుతో | వృషభంబుతో |
| 78 | అధస్సూచి | శార్దూలత్తములు | శార్దూలవృత్తములు |
| 79 | ,, | డరిగృహస్థ | 2. డరిగృహస్థు |
| 80 | 7 | పాతికదృషిచే | పాతికదృష్టిచే |
| ,, | 12 | సంపూర్ణదృలు | సంపూర్ణదృష్టి |
| 82 | 5 | షట్చుదిర్ణవ | షట్చుద్ధిర్ణవ |
| 84 | 19 | వఱపను | వఱపు |
| 90 | 12 | సలరక్షణ | సంరక్షణ |
| ,, | 26 | వలయుఁగృష్ణ | వలయుఁగృష్ణ |
| 91 | 13 | నుండుసంశ | నుండునొండుసంశ |
| 97 | 2 | గ్రహవైరములు | గ్రహవైరముల |
| 99 | 8 | అరువడ | సీ. అరువడ |
| 1(3 | 11 | లారా | లార |

తృతీయాశ్వాసము

| | | | |
|---|---|---|---|
| 107 | 22 | ద్విపదగావళి | ద్విపదభోగావళి |
| 108 | 15 | ౪ _ ౦ | ౪౨ |
| 111 | 12 | విలసిల్లగాన్ | విలసిల్లఁగాన్ |
| 116 | 19 | వత్తమ్ములు | వృత్తములు |
| 117 | 11 | ౨౧ వే ౮౯ | ౨౧ వే ౮౪౯ |
| 119 | 22 | తిరుగున _ తని | తిరుగు _ నతని |
| 120 | 15 | వే ౩౬ | వే ౧౩౬ |
| 122 | 9 | వే ౩౫ | వే ౧౩౫ |

| పుట | పంక్తి | ఉన్నరూపము | ఉండవలసినది |
|---|---|---|---|
| 123 | 20 | 6+6+ + | 6+6+6+ |
| 126 | 6 | 26 ఛందముల సమ | 26 ఛందమున సమ |
| 131 | 16 | కవిరాజ విరాజితము | [కవిజనాశ్రయము - వృత్త - 117] |
| 133 | 15 | వైశ్వదేవి యను వృత్తము [3 - 1] | వైశ్వ...వృత్తము [3 - 17] |
| 135 | 3 | ౨౦౯౭ | ౩౦౯౮ |
| ,, | అధస్సూచి | ప్రహార్షణ | ప్రహారణ |
| 138 | 18 | రండో | రెండో |
| 139 | 8 | ౨౧ | ౨౦ |
| ,, | 17 | రథోద్ధత | రథోద్ధత |
| ,, | 19 | చంద్రవర్త | చంద్రవర్త్మ |
| ,, | 21 | వృత్తము ౧ | ౧౩ |
| 140 | | [విస్ఫూర్జిత] | (      ) |
| ,, | | [సువదన] | (      ) |
| 143 | 24 | షడ్వింశతిఛంద | షడ్వింశతిచ్ఛందస్సు |
| 146 | 9 | గలుగు ౨ | గలుగు |
| 154 | 18 | త్ర్యంఘ్రికి | ద్ర్యంఘ్రికి |
| 157 | 16 | దోదగ | దోదక |
| 160 | 18 | ద్విపాద | ద్వి - పాద |
| 163 | 5 | మొదలను నెనిమిది గణములు | మొదల నెనిమిది న గణములు |
| 165 | 7 | నిల్పున | నిల్పిన |
| 171 | 11 | గురువు వలయు | నిల్పవలయు |
| 174 | 3 | వృత్తసంఖ్య 1 ( x = | వృత్తసంఖ్య 16 x 2 = |
| 175 | అధస్సూచి | ప్రడమవృత్త | ప్రథమవృత్త |
| 176 | 4 | సరిజెప్పెడి | సరిచెప్పెడి |
| ,, | అధస్సూచి | శారి | శారి |

| పుట | పంక్తి | ఉన్నరూపము | ఉండవలసినది |
|---|---|---|---|
| 177 | 9 | నర్థింపవళయు | నర్ధింపవలయు |
| 179 | 6 | ఎన్నవయొన్నవయని | ఎన్నవయొన్నవయవి |
| ,, | 10 | నిట్లుర్వాని | నిల్లు |
| 181 | 14 | యంకేళ | యంకెల |
| 182 | 4 | 373 – 347 | 373 – 374 |
| 187 | 13 | తేసి వేయఁగా | తీసి వేయఁగా |
| ,, | 25 | వృత్తానాంపీదమే | వృత్తానాంవదమే |
| 193 | 21 | ప్రయోగ్యములు | ప్రయోజ్యములు |
| 199 | 4 | కదంబులు | కందంబులు |
| 200 | 14 | ద్వివస్పృతి | దివస్పృతి |
| 201 | 12 | ప్రసన్నది | ప్రసన్నపది |
| 205 | 14 | చెప్పఁగా | చెప్పఁగావలయు |
| 206 | 14 | ఆర్యగీతి | ఆర్యాగీతి |
| ,, | 22 | ఇది | ఇవి |
| 207 | 11 | 620 + 2 | 6 ఇం + 2 సూ |
| 209 | అధస్సూచి | దురూహ్యము | దురూహము |
| 233 | 22 | పతిపాదమున 2 ఇం + 1 సూ + 2 ఇం | 3 ఇం + 1 సూ + 3 ఇం |
| 234 | 12 | చేనిన | చేసిన |
| 245 | 14 | సుగంధివుత్తము | సుగంధివృత్తము |
| | అధస్సూచి | 3 – | 3 – 94 |
| 246 | 10 | పరిమాణనంజ్ఞలు | పరిమాణసంజ్ఞలు |
| ,, | 17 | తెరంగును | తెఱంగును |

## చతుర్థాశ్వాసము

| | | | |
|---|---|---|---|
| 258 | 6 | 1 – 34 | 7 – 34 |
| 264 | 19 | వి(సుగు) | వి(సుఁగు) |

| పుట | పంక్తి | ఉన్నరూపము | ఉండవలసినది |
|---|---|---|---|
| 273 | 24 | భీమకర | భీకర |
| 275 | 7 | ద్వితీయాశ్వాస | చతుర్థాశ్వాస |
| 277 | 12 | పవర్గనవ | టవర్గనవ |
| ,, | అధస్సూచి | వారిపూరితా | వాఃపూరితా |
| 283 | 8 | తొలుఁగుబాసను | తెలుఁగుబాసను |
| ,, | 18 | అథి | అధి |
| 285 | అధస్సూచి | వజ్రా | క్రజా |
| ,, | 8 | [7 - 19] | 7 - 199 |
| 295 | అధస్సూచి | (క. జ. సిం.) | (క. జ. సం.) |
| 303 | 21 | రాయ | రాయణ |
| 320 | 13 | సంయుక్తశాక్షర | సంయుక్తక్షాక్షర |
| 335 | 22 | పదిలావి | పదియావి |
| 336 | అధస్సూచి | 'శ్లత' | 'శ్లథ' |
| 352 | 3 | టంపక | జంపక |
| 356 | 14 | [ఛందోదర్పణము 1-2] | [ఛం...ము 1-62] |
| 359 | 8 | సంజ్ఞ 38 | సంజ్ఞ 88 |
| 362 | 20 | [ఛందోదర్పణము 1-5] | [ఛం...ము 1-85] |
| 367 | 21 | అని | అవని |
| 368 | 4 | [1 - ] | 1 - 4] |
| ,, | అధస్సూచి | యర్ఘువుల్ | యరుఘువుల్ |
| 370 | 1 | నీవనీ | నవీనీ |
| 373 | 13 | మనోరథసుకరము | మనోరథనికరము |
| 374 | 9 | స్ఫురితవదర్థ | స్ఫురితవదర్ధ |
| 375 | 24 | అనఆశబ్దము | ఆనఆశబ్దము |
| 376 | 24 | మిహాన్యాసన్యం | మిహాశోర్వన్యం |
| 396 | 16 | రఘుఁ | రఘున్ |
| ,, | 18 | 'బహు' శబ్దము | 'బాహు' శబ్దము |

| పుట | పంక్తి | ఉన్నరూపము | ఉండవలసినది |
|---|---|---|---|
| 399 | 8 | చోరి | బోరి |
| 404 | 1 | రాజశ్శబ్ద | రాజన్య |
| 406 | 2 | దవధీశుఁడ | ద్యవధీశుఁడ |
| ,, | 22 | భవమహావథ | భవమహావధ |
| 409 | 8 | దశాలము | దశారము |
| 417 | 18 | గారకోక్కి | గారకోక్తి |
| 418 | 5 | తవర్గములు | తవర్గము |
| 424 | 5 | భద్రారాయ | భద్రావరాయ |
| 437 | 12 | తాతంబట్టు | తాతంభట్టు |
| 455 | 18 | సంవర్ణోపాఖ్యాన | సంవరణోపాఖ్యాన |
| 456 | 9 | మహాత్మ్యము | మాహాత్మ్యము |
| ,, | 18-19 | కృష్ణవాసుదేవ | కృష్ణవాసుదేవ 1-132 |

1 ఈ క్రింది పద్యగద్య సంఖ్యలందలి ఖండలీకరణముఁ దొలఁగింపవలెను -

| పుట | పద్యసంఖ్య |
|---|---|
| 7 | 24, 26 |
| 10 | 36 |
| 69 | 97 |

2 క్రింది పద్యసంఖ్యలతోఁగల ఖండలీకరణములు ( - ) సరికావు. అవి నిలువు బ్రాకెట్లలో [ - ] నుండవలెను -

| పుట | పద్యసంఖ్య |
|---|---|
| 11 | 43 |
| 12 | 44, 47, 49 |
| 13 | 55 |
| 18 | 74 |
| 82 | 121, 122 |

| పుట | పద్యసంఖ్య |
|---|---|
| 257 | 29 |
| 305 | 225 |
| 329 | 322 |
| 334 | 347 |
| 339 | 372 |
| 395 | 576 |
| 425 | ఆశ్వాసాంతగద్య |

3. పుట 114 లో 46 వ పద్యము క్రిందనున్న "వ. అందు ౧౧ వ త్రిష్టుప్ఛందస్సు ..." అను వచనము 46 వ పద్యము పైనుండవలెను.

4. పుట 119 లో 81 వ పద్యము సింహానందన వృత్తమునకు గణములు :-

భ, స, జ, న, న, న, గ.